శ్రీ ర స్తు.

శ్రీమచ్ఛంకరాచార్యవిరచిత

# వివేకచూడామణి

శ్రీకామర్షి వేంకటసుబ్బయ్యగారిచే

రచియింపఁబడిన

ఆంధ్రతాత్పర్యవివరణసహితము.

బ్రహ్మశ్రీ పండిత

వేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

పరిష్కృతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

# ఉపోద్ఘాతము

శ్రీపరమేశ్వరసృష్టిలోని సమస్తప్రాణికోటియు సుఖమునే కోరుచుండును. ఆసుఖము ఐహికము, ఆముష్మికము, కైవల్యము నని త్రివిధము. ఈలోకమునందు ధన వనితాది విషయభోగములవలనఁ గలుగుసుఖము ఐహికము. పరలోకమందు స్వర్గాదిభోగములవలనఁ గలుగుసుఖము ఆముష్మికము. ఆత్మతత్త్వజ్ఞానమువలనఁ గలుగుసుఖము కైవల్యము. ఐహికాముష్మికసుఖములు విషసంపృక్తాన్నమువలె దుఃఖమిశ్రితములు. కైవల్యసుఖము దుఃఖలేశరహిత మగునిత్యసుఖము. ఎట్లన:—

1. ఇహమందు రాజ్యము గలవాఁడు రాజ్యచ్యుతుఁడగునేని వానికి దుఃఖము కలుగును. ధనికునకు ధననష్టము కలిగిన యెడల వానికిని దుఃఖమే కలుగును. రూపవతియగు భార్యగలవానికి భార్య గయ్యాళియైనను పరాభిలాషిణియైనను మృతిజెందినను దుఃఖమే సంభవించును. ఇట్లు ఇహసంబంధమగు సమస్త విషయములు దుఃఖభాజనములై అంతులేని జన్మమరణరూప సంసారమునకుఁ గారణము లగును. కావున ఐహికసుఖము నిత్యసుఖము కాదు గనుక కోరఁదగినది కాదు.

2. యజ్ఞాదిపుణ్యకర్మలవలన లభించుస్వర్గాదిభోగములు "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" యనున్యాయమున పుణ్యము క్షీణింపఁగా మఱల మర్త్యలోకమునందు జన్మించి భవసాగరమునఁ జిక్కి జీవు లనేకవిధదుఃఖముల ననుభవించుచుఁ

బరితపింపవలసివచ్చును. కావున ఆముష్మికసుఖము సయితము దుఃఖభాజన మగుటచేఁ గోరఁదగినది కాదు.

౩. కైవల్యము దుఃఖలేశరహితమై శాశ్వతసుఖమును గూర్చును గనుక నవశ్యము గోరఁదగినది. కారణ మే మనఁగా, జీవుఁడు తాను స్వయముగ సచ్చిదానందపరమాత్మయయ్యును అవిద్యాప్రతిబంధముచేఁ దన నిజస్వరూపమును మఱచి, దేహమే తాననుకొని భ్రమఁజెంది, సంసారబంధమునఁ జిక్కి ఐహికాముష్మిక సంబంధదుఃఖముల ననుభవించుచున్నాఁడు. తత్త్వజ్ఞానమువలనఁ దన నిజస్వరూపమును దెలిసికొనెనేని 'అహం బ్రహ్మాస్మి' యనెడి నిశ్చయజ్ఞానము గలిగి సంసారబంధనిర్ముక్తుఁడై, తానే సచ్చిదానందపరబ్రహ్మమై విలసిల్లుచు సదా ఆనందమునే యనుభవించును. ప్రచండమార్తాండునియందు నంధకార మెట్లుండదో యట్లు ఆత్మసుఖమందు దుఃఖలేశమే లేదు. ఇట్టి పరమావస్థయే దుఃఖాభావమగు నిత్యసుఖము. ఇదియే జీవన్ముక్తి. కావున సర్వ ప్రయత్నములచేతను కైవల్యసుఖమే ప్రాపణీయము.

ఇట్టి జీవన్ముక్తిప్రాప్తికొఱకే ఋషులు మునులు యోగులును చిరప్రయత్నము సేయుదురు. అట్టిప్రయత్నము మనుష్యజన్మమందే కాని తదితరజన్మములం దనువు పడదు. కావుననే దేవతలు సయితము మనుష్యజన్మమునే యభిలషింతురని "వాంఛంతి జన్మ మానుష్యం భువి దేవైః శతక్రతుః" అని దత్తాత్రేయ సంహితయందుఁ జెప్పఁబడినది. మఱియు "మహతాపుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌస్త్వయా, పారం దుఃఖోదధే ర్గన్తుం తర యావన్న భిద్యతే." (ఓయీ నీ వీదుఃఖసాగరమును దాటుటకు గొప్పపుణ్య మనెడి ధనము నిచ్చి నరశరీర మనెడి యీ యోడను

సంపాదించితివి. కావున నీశరీరనౌక భిన్నము గాకముందె దుఃఖ సాగరమును దాటుమా) అని ఆర్యవచనము. ఈగ్రంథమందు ౨, 3, ౪, ౫ శ్లోకములలో శ్రీమదాచార్యులవారును నరజన్మమందే మోక్షప్రయత్నము సేయవలె నని నుడువుచున్నారు. కనుక పరమేశ్వరుఁడు మనకు నరశరీరము ననుగ్రహించినందుకు మోక్షప్రాప్తికై సర్వవిధములచేతను బ్రయత్నించుటయే శ్రేయము.

"జ్ఞానాదేవ తు కైవల్యమ్" కైవల్యము జ్ఞానమువలననే కాని యే యితరోపాయముచేతను సిద్ధింపదు. అట్టి సుజ్ఞానమును ప్రజలకు బోధించుటకై ఆత్మజ్ఞు లగు పూర్వఋషులు సదయహృదయు లై లోకోపకారముకొఱకు తమతమ యనుభవములనుబట్టి యనేకోపనిషత్తులను రచియించిరి. ఆయుపనిషత్తులు దురవగాహము లగుటచే శ్రీమచ్ఛంకరాచార్యులవారు ఈశాది దశోపనిషత్తులకును, నృసింహతాపిన్యాదీతరోపనిషత్తులకును, బ్రహ్మసూత్రములకును, భగవద్గీతలకును, విష్ణుసహస్రనామాద్యనేకవేదాంతగ్రంథములకును భాష్యములను రచియించుటయే కాక, ఉపదేశసాహస్రి, వివేకచూడామణి, ప్రపంచసారము, మహావాక్యదర్పణము, ప్రబోధసుధాకరము మున్నగు ననేక ప్రకరణగ్రంథములను; భజగోవిందస్తుతి, లక్ష్మీనృసింహస్తోత్రము త్రిపురసుందరీమానసపూజ, ఆత్మానందాష్టకము, ఆత్మపంచకము మున్నగు ననేకలఘుగ్రంథములను రచియించి తద్ద్వారా వేదాంతవిజ్ఞానామృత మను భక్తిమకరందమును వర్షించిరి. శ్రీమదాచార్యులవారు రచియించిన గ్రంథములలో 'వివేకచూడామణి' యను నీగ్రంథము వేదాంతవిద్యావిదుషీమణికి చూడామణియై

యలరారుచు, ముముక్షువులకుఁ బెన్నిధియై, అజ్ఞానతమో భాస్కరమై, సర్వవేదాంతవిషయములను గరతలామలకముగ బోధించుచున్నది. ఈ గ్రంథమును బ్రశాంతనిర్మలచిత్తముతోఁ బఠించి, సద్గురుముఖమున సంశయవిముక్తినిఁ బొంది బ్రహ్మాత్మతత్త్వమును దెలిసికొనువారలు తప్పక మోక్షసౌధాగ్రమునఁ జేరఁగలరు. అట్టి మహోన్నతమోక్షసౌధాగ్రమును జేరుటకు నీగ్రంథములోని 376-వ శ్లోకములో వివరింపఁబడినయట్లు పక్షికి రెక్కలవలెనే ముముక్షువునకు 'వివేకవైరాగ్యము' లనెడి రెండురెక్క లుండవలెను. ఈరెండింటిలో నెయ్యది లోపించినను బ్రయత్నము నిష్ఫల మగును.

ఇదివరలో కాశీ, లాహోరు, బొంబయి మున్నగు పట్టణములలో ననేకవేదాంతగ్రంథములు నాగరలిపిలో ముద్రింపఁబడినవి. ఏతద్గ్రంథములు సంస్కృతభాషాపరిచయములేని ఆంధ్రలోకమున కుపకరింపకపోవుటచే కీ॥ శే. శ్రీవావిళ్ల రామస్వామి శాస్త్రులవారు నైష్కర్మ్యసిద్ధి స్వారాజ్యసిద్ధి, మున్నగు గ్రంథములను స్వయముగ నాంధ్రీకరించియుఁ గొన్నిటినిఁ బండితులచే నాంధ్రీకరింపించియు ముద్రించి ఆంధ్రలోకమునకు మహోపకారమొనరించిరి. శ్రీరామస్వామిశాస్త్రులవారిపుత్రరత్నమగు బ్రహ్మశ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు స్వర్ణమునకుఁ బరిమళ మబ్బినట్లు తమ తండ్రిగారిమార్గమునే యనుసరించి, దశోపనిషద్భాష్యాదిగ్రంథములను బునర్ముద్రితములఁగావించియు, కొన్ని యుపనిషత్తులను నితరవేదాంతగ్రంథములను టీకాతాత్పర్యవిశేషార్థసహితముగ ముద్రించియు, ఆంధ్రలోకమున కత్యంతోపకార మొనర్చి

చున్నారు. మఱియు నిదివఱకు ముద్రితములైన గ్రంథములలో తెనుఁగుతాత్పర్యము సమగ్రముగను సుబోధముగను లేనిగ్రంథములను, అచ్చుపొరపాట్లు గలవానిని సవరణ చేయించి పునర్ముద్రితములఁ గావించుచున్నారు. అట్లు వాసుదేవమననము, వేదాంతపంచదశి, నైష్కర్మ్యసిద్ధి మొదలగు కొన్నిగ్రంథముల నిదివఱలో పునర్ముద్రణము గావించిరి. నాయం దభిమానముచే వివేకచూడామణి మున్నగు కొన్నిగ్రంథములను సవరణకొఱకు నాకుం బంపిరి. నాకు సంస్కృతహిందీభాషలయందుఁ బ్రవేశమే కాని విశేషపరిశ్రమ లేదు. అందువలన నే నిట్టికార్యమునకుఁ బూనుట సాహసమే యైనను ఏతద్రూపమున నాకు జ్ఞానాభివృద్ధి యగునను ఉత్సాహముతో నియ్యకొంటిని.

ఈవివేకచూడామణి యిదివరలో 1925, 1931-వ సంవత్సరములలో ముద్రింపఁబడినది. కాని యందలి ఆంధ్రతాత్పర్యము మూలశ్లోకాభిప్రాయముల ననుసరించి సమగ్రముగను సుబోధముగను లేకపోవుటచేత, శ్రీమదరవిందానందయతీశ్వర ప్రణీత హిందీవ్యాఖ్యానము ననుసరించియు, శ్రీచంద్రశేఖరపండిత హిందీతాత్పర్యము ననుసరించియు, నాయిష్టదేవతాప్రసాదమునను సద్గురుకటాక్షమునను జగద్గురు శ్రీమచ్ఛంకరాచార్య పాదారవిందముల స్మరింపుచు యథాశక్తిని ప్రత్యేకముగ వివరణసహితముగ నాంధ్రీకరించినాఁడను. విజ్ఞు లిందలి స్ఖాలిత్యములను మన్నింపఁ బ్రార్థితులు.

వ్యయప్రయాసములను సరకుగొనక లోకోపకారమే ప్రధానముగ నెంచి, విద్యాప్రచారముచే నాంధ్రలోకమునకు జ్ఞానామృతమును బంచిపెట్టుచున్న బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి యుద్యమమున కెల్లరును దోడ్పడుదురుగాక అనియు, వారికీర్తి దినదినాభివర్ధమానమై ఆచంద్రార్కస్థాయిగ నిలుచుఁగాక యనియుఁ బరమేశ్వరునిఁ బ్రార్థించెద.

పేరూరుపేట,
22-12-1937

ఇట్లు సజ్జనవిధేయుఁడు,
కామర్షి వేంకటసుబ్బయ్య.

# పారిభాషికపదవివరణము



అ

అంతఃకరణము = మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము
అక్షః = ఇంద్రియములు
అక్షరం = నాశములేనిది
అజః = పరమాత్మ, పుట్టుకలేనిది
అధికారి = బ్రహ్మోపదేశమునకు అర్హుఁడు
అధిష్ఠానము = ఆధారము
అధ్యాసము=ఒకవస్తువును జూచి అది మఱియొకటి యనుకొనుట
అనవచ్ఛిన్నము = ఆవరణరహితపరిపూర్ణవస్తువు
అమృతత్వం = జన్మమృత్యురహితబ్రహ్మస్వరూపము నొందుట, ముక్తి
అవచ్ఛిన్నము = ఆవరణముతోఁగూడిన చిన్నవస్తువు
అవిద్య = అజ్ఞానము, జీవాత్మపరమాత్మలు ఒకటియే యని తెలిసికొనలేని మూఢావస్థలో నుండుట
అవ్యక్తము = మూలావిద్య, ఇంద్రియములకు గోచరింపనిది
అవ్యయము = నాశములేనిది
అసత్ = సత్యముకానిది, ఆత్మేతరము
అసద్వస్తుః = ఆత్మేతరపదార్థము

ఆ

ఆగమాః = వేదములు
ఆత్మనిష్ఠ = నిరంతరాత్మావలోకనము గలవాఁడు, బ్రహ్మనిష్ఠుఁడు
ఆభాసః = లేనిది యున్నట్లు తోఁచుట

ఈ

ఈశ్వరః = మాయయందు ప్రతిబింబించిన బ్రహ్మము

ఉ

ఉపాదానం = ముఖ్యకారణము, ఆధారము
ఉపాదేయం = గ్రాహ్యము

ఏకరసః = మాఱులేని తన్మాత్రము

క

కరణం = ఇంద్రియము, సాధనము
కుసూలః = (ధాన్యము పోయు) పాణక, గాదె
కూటస్థః = జననాదిరహితబ్రహ్మము, ప్రత్యగాత్మ, సాక్షి
క్షతిః = హాని
క్షరం = నశించునది
క్షేత్రం = శరీరము

గ

గుహా = కోశపంచకము
గ్రంథిః = (జ్ఞానావరోధక మగు) ముడి, అడ్డంకి
గ్రాహః = మొసలి

### చ

చిదాత్మ = ప్రత్యగాత్మ
చిదాభాసః = జీవుఁడు, ప్రతిబింబుఁడు

### జ

జిజ్ఞాసుః = ఆత్మను దెలియఁగోరు ముముక్షువు
జీవః = చిదాభాసుఁడు, అంతఃకరణమందు ప్రతిఫలించిన ప్రత్య
గాత్మ బింబము
జ్ఞానం = బోధ, తెలివి, పరమాత్మను తెలిసికొనుట

### త

తమః = అజ్ఞానము, చీఁకటి, రాహువు
తాదాత్మ్యం = ఐక్యము, ఏకత్వము
త్రిపుటి = జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు

### ద

దృక్ = ఆత్మ
దృశిః = ఆత్మ
దృశ్యం = చూడఁబడునది
దేశికః = గురువు, తత్త్వోపదేశకుఁడు
ద్రష్టా = చూచువాఁడు

### ధ

ధీః = బుద్ధి, జ్ఞానము, ఆత్మజ్ఞానము

న

నశ్వరం = నశించునది
నిగమః = వేదము, శ్రుతి
నిర్ల్వయనీ = (పాము) కుబుసము
నిర్వృతిః = నిత్యసుఖము, మోక్షము, భవబంధవిముక్తి
నివృత్తిః = అప్రవృత్తి, ప్రాపంచికవిషయములనుండి మఱలుబాటు

ప

పండితః = తత్త్వజ్ఞుఁడు, విద్వాంసుఁడు
పరతత్త్వం = ఆత్మతత్త్వము
ప్రతియోగి = విరోధి (తిమిరమునకు తేజస్సువలె)
ప్రత్యగాత్మ = కూటస్థుఁడు
ప్రత్యయః = జ్ఞానము, ప్రసిద్ధి
ప్రమితి = యథార్థజ్ఞానము, ప్రమాత
ప్రవృత్తి = ప్రపంచవాసన
ప్రాగభావః = పూర్వము లేనిది

బ

బంధః=సంసారబంధము, కర్తృత్వాద్యభిమానమువలని బంధము
బహిర్ముఖః = అంతఃకరణమును ఆత్మధ్యానమందు నిలుపక
బాహ్యవ్యాపారమం దాసక్తిగలవాఁడు, అజ్ఞాని

భ

భవము = జననమరణరూపసంసారము
భాగత్యాగము = విరుద్ధాంశపరిత్యాగము

భానం = ప్రకాశము
భాసకం = ప్రకాశింపఁజేయునది, ఆత్మ
భాస్యం = ప్రకాశింపఁజేయఁబడునది

మ

మనోరాజ్యము = సంతతవిషయధ్యానము
మహాన్తః = ఉదారాత్ములు
ముముక్షుః = ఆత్మజ్ఞానమందు ఆసక్తి గలవాఁడు

ల

లింగం = లింగశరీరము, సూక్ష్మశరీరము, హేతువు

వ

వస్తు = ఆత్మ, బ్రహ్మము
వాసనా = పూర్వసంస్కారము
విక్షేపః = బహిర్దృష్టి
వికృతిః = ప్రకృతికార్య మగు ప్రపంచము
విద్వాంసః } = ఆత్మతత్త్వము నెఱిఁగిన పండితులు
విపశ్చితః }
విద్యా = ఆత్మజ్ఞానము
విపర్యయః = విపరీతగ్రహణము
విపర్యాసః = అది కానిదానిని అది యనుకొనుట
విలక్షం = విరుద్ధస్వభావము గలది
వివర్తం = స్వరూపహానిలేకుండ పదార్థాంతరముగ తోఁచుట

విషయాః = దృశ్యములగు జడములు
విషయీ = ఆత్మ
విస్మృతిః = విస్మరణము. మఱపు
వేదనం = జ్ఞానము

శ

శైలూషః = నటకుఁడు
శైవాలం = నాచు

స

సంసృతిః = సంసారము, జన్మమరణరూప ప్రవాహము
సంవిత్ = జ్ఞానము
సన్తః = ప్రాతిభాసిక విక్షేపరహితముగ నుండు శాంతచిత్తులు
స్మృతి = గడచినదానిని స్మరించుట
స్వస్వరూపం = ఆత్మ
స్రోతస్సు = ప్రవాహము, నది

హ

హేయం = విడువఁదగినది

---

శ్రీ ర స్తు.

# వి వే క చూ డా మ ణి

## ఆంధ్ర తాత్పర్య వివరణ సహితము

### మంగళాచరణము

శ్లో. సర్వవేదాన్తసిద్ధాన్తగోచరం తమగోచరమ్,
గోవిన్దం పరమానన్దం సద్గురుం ప్రణతోఽస్మ్యహమ్. 1

తా. "సర్వవేదాంతసిద్ధాంతగోచరం తమగోచరమ్" అని గ్రంథ మారంభింపఁబడినది. ఇందు ప్రతిపాద్యవిషయము అవాఙ్మానసగోచరమై వేదాంతసిద్ధాంతజన్య జ్ఞానముచేఁ దెలిసికొనఁదగిన పరబ్రహ్మము. కనుక నీవాక్యము నిరూప్యనిరూపకభావ సంబంధమును సూచించుచున్నది.

"నిర్విఘ్నసమాప్తికామో మంగళమాచరేత్" అనెడి శ్రుతివాక్యానుసారముగ గ్రంథారంభమున మంగళాచరణ మావశ్యకము. గురునమస్కారపూర్వక మంగళాచరణము శిష్టాచారము. వేదాంతాచార్యుల సంప్రదాయముప్రకారము నిర్గుణబ్రహ్మమునకు మంగళ మాచరింపవలెను. భౌతికవిగ్రహమునకు మంగళాచరణము అనుచితము. ప్రతిపాద్యవిషయము నిర్గుణబ్రహ్మము. కావున గురువునకును నిర్గుణబ్రహ్మమునకును అన్వయించునట్లు ఈశ్లోకము చెప్పఁబడినది. ఎట్లనఁగా—"పరిపక్వమలా యేతా నుత్సాదనహేతుశక్తిపాతేన, యోజయతి పరే

తత్త్వే సదీక్షయాచార్యమూర్తిస్థః," (రాగద్వేషాదిమలరహితుఁడును, ప్రత్యగభిన్న పరమాత్మతాదాత్మ్యమునుబొందినవాఁడును నగు ఆచార్యమూర్తియందుఁగల బ్రహ్మమే గురువయి, ఈశ్వరారాధనచే నిర్మలచిత్తులగు శిష్యులకు అవిద్యాతత్కార్య నివారక మగుశక్తినిఁ గలిగించి పరతత్త్వమును బోధించును. మఱియు, "గోభిర్వేదాన్తవాక్యైర్విద్యతే లభ్యతే ఇతిగోవిన్దః" అను వ్యుత్పత్తినిబట్టియు గోవిందశబ్దము పరబ్రహ్మవాచకము. "యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథాగురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః" ఇతి శ్రుతివచనరీత్యా, ఏ పురుషునకు సర్వోత్కృష్టదైవభక్తిగలదో యాపురుషునకు ఆత్మజ్ఞానోపదేష్టయగు గురువునందును పరమభక్తి యుండును. అట్టి మహాత్ముఁడే బ్రహ్మాత్మైక్యబోధోపయోగ మగు ఉభయపదార్థశోధన, ద్రష్టృదర్శనదృశ్యత్రిపుటీవివేకాదిశుభసంపత్తియుఁ గలిగి యుండును. మఱియు, "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి," "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్," "జ్ఞానీ చ విశిష్యతే," ఇత్యాది శ్రుతిస్మృతిపురాణ వచనప్రమాణముగ ఆత్మవేత్త పరమాత్మ యగుటకు సందియము లేదు. ఇట్టి కారణములవలన గురుదైవాభేదమును సూచించుచు శ్రీమదాచార్యులవారు తమ అద్వైతజ్ఞానోద్రేకమును వెల్లడించుచు, గురుపరముగను శ్రీహరి (ఆత్మ) పరముగను అన్వయించునట్లు ద్వ్యర్థముగ నీ మంగళాచరణ శ్లోకమును నుడివి రని యూహింపఁదగియున్నది.

### శ్లో కా ర్థ ము

గురుపరము—ఉపనిషదాది సకలవేదాంతసిద్ధాంతరూప తత్త్వమస్యాదిమహావాక్యములచే లక్షణావృత్తిజన్యజ్ఞానమును

గలుగఁజేసి, అజ్ఞానాంధకారమును దొలఁగించి, శిష్యులకు పర మాత్మను గోచరింపఁజేయువాఁడును, జితేంద్రియుఁడును, బ్రహ్మై క్యనిష్ఠవలన సదా పరమానందస్వరూపుఁడును అగు గోవింద భగవత్పాదాచార్యులనుగూర్చి నమస్కరించుచున్నాను,

విష్ణుపరము. ఉపనిషదాది ప్రస్థానసిద్ధాంతరూప తత్త్వ మస్యాది మహావాక్యములకు గోచరుండును—అనఁగా లక్షణా వృత్తిజన్యజ్ఞానమునకు విషయుఁడును, స్వయంప్రకాశస్వరూపుఁ డగుటచే తత్ప్రతిబింబచిదాభాసునకు అవిషయుఁడు—అనఁగా అవాఙ్మానసగోచరుఁడును,పరమానందస్వరూపుఁడును, ("గుకార శ్చాంధకారస్తు రుకారస్తన్నిరోధకృత్" అనెడి గురుశబ్దము యొక్క వ్యుత్పత్తినిబట్టి) అజ్ఞానాంధకారమునకు భాస్కరుఁ డును అగు గోవిందశబ్దవాచ్యనిర్గుణబ్రహ్మమునకు నమస్కరించు చున్నాను.

అవతారిక. మోక్షప్రాప్తికి మనుష్యశరీరముయొక్క ఆవశ్యకతను ప్రశస్తత్వమును జెప్పుచున్నారు:—

జన్తూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా
తస్మాద్వైదికధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్,
ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తిర్నో శతకోటిజన్మ సుకృతైః పుణ్యైర్వినాలభ్యతే.

తా. సకల స్థావరజంగమరూపభూతములలో మనుష్య జన్మము దుర్లభము. ఆ నరజన్మమందు పురుషశరీరప్రాప్తి దుర్ల భము. పురుషశరీరము కలిగినను బ్రాహ్మణత్వ విశిష్టపురుషశరీ రము దుర్లభము. బ్రాహ్మణత్వవిశిష్టపురుషశరీరము గలిగినను వేదప్రతిపాద్యాధ్యయనాధ్యాపనాది షట్కర్మమార్గ సనాతన

ధర్మపరాయణత కలుగుట దుర్లభము, వైదికధర్మాచరణము గలిగి యున్నను విద్వత్త్వము (పరోక్షజ్ఞానము) కలుగుట దుర్ఘటము. పరోక్షజ్ఞానము కలిగినను ఆత్మానాత్మవివేచనము (నిత్యానిత్యవస్తు వివేకము) కలుగుట కష్టము. అట్టి వివేకము కలిగినను ఆత్మ యొక్క యథార్థజ్ఞానము (అపరోక్షజ్ఞానము, అనఁగా ఆత్మానుభవము) కలుగుట కడు దుర్ఘటము. ఆత్మానుభవము కలిగినను బ్రహ్మరూపమును బొంది నిరంతరము నిరంతరాయముగ ఆత్మస్థితుఁడై సంపూర్ణజీవన్ముక్తావస్థ నుండుట అత్యంత దుర్లభము. నూరుకోట్లజన్మములందుఁ జేసికొనిన పుణ్యపరిపాకవశముననఁగాని మోక్షము లభింపదు.

వివరణము. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి, జ్ఞానీ త్వాత్మైవమే మతమ్," "జ్ఞానీ చ విశిష్యతే," ఇత్యాది శ్రుతిస్మృతి పురాణవాక్యములు ప్రత్యగభిన్న బ్రహ్మసాక్షాత్కారముగల బ్రహ్మవేత్తయే సర్వోత్కృష్టుఁ డని ఘోషించుచున్నవి. మనుష్యునకు ప్రాపణీయము భవబంధనివర్తక మగు మోక్షము. మోక్షప్రాప్తికై యత్నింపని నరజన్మము వ్యర్థము. బ్రాహ్మణేతరుఁడైనను బ్రహ్మసాక్షాత్కారముఁగల పురుషుఁడు కృతకృత్యుఁడు. బ్రాహ్మణత్వము లేని అజాతశత్రు జనకాదిక్షత్రియులును, విదురాదిశూద్రులును, ఉపనయనసంస్కారము లేని గార్గీ మైత్రేయీ సులభాదికస్త్రీలును, రైక్వాదివర్ణాశ్రమాజాతలును, కపాలాది వైశ్యులును, ఇంద్రాది దేవతలును, ప్రహ్లాదాది రాక్షసులును బ్రహ్మజ్ఞానముఁచేతనే ముక్తులై కృతకృత్యులైనట్లు శ్రుతిస్మృతీతిహాసములవలనఁ దెలియుచున్నది. ఇట్లు శ్రీమదరవిందానందయతీశ్వరుని హిందీవ్యాఖ్యానమందు

వక్కాణింపఁబడినది. దీనివలన ఆత్మజ్ఞానఫలమగు మోక్షము కులభేదముతోను స్త్రీపురుషభేదముతోను నిమిత్తము లేకయే అందఱకును సమానమైన దని సూచింపఁబడినది. కావున మోక్ష ప్రాప్తి దుర్ఘటమయినదనిగాని, బ్రాహ్మణుఁడై వేదాధ్యయనాది షట్కర్మనిరతుఁడై నంగాని వేదాంతవిచారమున కర్హత కలుగ దనిగాని ముముక్షువులు నిరాశఁజెందరాదు. పూర్వజన్మవాసనను బట్టియు సద్గురుకరుణాకటాక్షమునను అమనస్కరాజయోగా రూఢులగువార లనేకులు విద్యాగంధము లేనివార లయ్యును, మోక్షసామ్రాజ్యసుఖము ననుభవించువార లనేకులు గలరు. "చెలువుగఁ బువ్వులు జీరుటకంటెన్, బోలువుగఁ గన్నవ మూయుటకంటెన్, నలువగు నీయమనస్కపదంబే, సులభము సౌఖ్యము సూక్ష్మము వత్సా" అని సీతారామాంజనేయ సంవాదమునందు శ్రీరామచంద్రుఁడు అంజనీసుతున కుపదేశించెను. గురుకటాక్షము లేనివారలకును, వైరాగ్యబోధోపరతులు గలుగనివారలకును వింధ్యపర్వతమును పూలచెండువలె నెత్తుట యెటుల కలలోనివార్తయో అటుల సాధ్యము కాదు.

మఱియు, "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా" అనెడి గీతావచనముప్రకారము పిపీలికాది బ్రహ్మపర్యంతమును గల సకలోపాధులందును కూటస్థుఁడుగా నుండి, జీవరూపమున దేహాదిసర్వప్రపంచమును నడిపించు సూత్రధారుండు సర్వవ్యాపి యగు పరమాత్మయే. కనుక సకలజీవులును తమ నిజస్వరూపమును దెలిసికొని పరమాత్మయం దైక్యమగుటకు (ముక్తినొందుటకు) అర్హులే. ఆత్మజ్ఞానమును బడయుటకు జాతిభేదముతోను

స్త్రీపురుష భేదముతోను నిమిత్తము లేదు. పరమార్థదృష్టియందు సర్వము నొకటియే. అయినను సత్త్వరజస్తమోగుణములయొక్క న్యూనాధిక్య భేదమువలన జ్ఞానమార్గము నవలంబింప నందఱకును సాధ్యము కాదు. సత్త్వగుణ ప్రధాను లగువారలకు ఆత్మజ్ఞాన ప్రాప్తి సుసాధ్యము. రజోగుణప్రధానులకు కష్టసాధ్యము. తమోగుణప్రధానులకు అసాధ్యము. పూర్వజన్మమందు బ్రహ్మజ్ఞానవిషయమై కృషిసల్పి ఫలప్రాప్తి లేకయే జన్మాంతరమును బొందినవారలు ఏజాతివారలైనను జన్మారభ్య బ్రహ్మనిష్ఠులైయుండి తరింతురు. అట్టివారలు బ్రాహ్మణేతరులలోనే కాక మహమ్మదీయులలోను పంచములలోను గల రనుట ప్రసిద్ధము. జనబాహుళ్యములో రజస్సత్త్వగుణోపేతులగువారలు కొందఱు మాత్రమే సద్గురూపదేశమున ఆత్మతత్త్వమును దెలిసికొనఁగలరు. అనేకులకు తమోగుణాధిక్యమువలన జ్ఞానమార్గమందుఁ బ్రవేశమే కలుగదు. కాఁబట్టి సర్వజనులకును భక్తియే తరణోపాయము. భక్తికి స్త్రీపురుషభేదముతోఁగాని, వర్ణాశ్రమాది ధర్మములతోఁగాని, విద్యతోగాని నిమిత్తము లేదు. సంపూర్ణ వైరాగ్యముగలిగి, ఆరూఢభక్తితో నామస్మరణభజనాది రూపమున ఇష్టదైవము నారాధింతురేని పరమేశ్వరానుగ్రహము వలన జ్ఞానోత్పత్తియై తద్ద్వారా ముక్తులగుటకు సంశయము లేదు. "చిత్తే సత్త్వోత్పత్తౌ తటిదివ బోధోదయో భవతి, తర్హ్యేవ స స్థిరః స్యాద్యది చిత్తం శుద్ధి ముపయాతి." అని శ్రీశంకరాచార్యవచనము. కావున, అందఱకును పరమేశ్వరభక్తి గలిగియుండుట శ్రేయఃప్రద మగును. భక్తిజ్ఞానవైరాగ్యములచేఁ గొందఱు పుణ్యాత్ము లొకజన్మమందే తరింతు రనియు, అజ్ఞాన

బీజము నశించి, జ్ఞానమనెడి బీజము నాటుకొనినయెడల నాజ్ఞాన బీజము ఉత్తరజన్మమందు అంకురించి మహావృక్షమై కైవల్య ఫలము నిచ్చు ననియు విజ్ఞులు నుడువుదురు.

దుర్లభం త్రయమేవైతద్ దైవానుగ్రహహేతుకమ్,
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః. 3

తా. మనుష్యశరీరప్రాప్తియు, మోక్షేచ్ఛయు, మహాపురుష (సద్గురు) సేవయు నను నీమూఁడును దుర్లభమైనవి. దైవానుగ్రహమునఁగాని లభింపవు.

అవ. ప్రాప్తనరజన్ముఁడై భవబంధవిముక్తికై యత్నింపని వాఁడు ఆత్మఘాతకుఁడని చెప్పుచున్నారు:—

లబ్ధ్వా కథంచి న్నరజన్మదుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్,
యః స్వాత్మముక్త్యై న యతేత మూఢధీః
స ఆత్మహా స్వం వినిహన్త్యసద్గ్రహాత్. 4

తా. పూర్వజన్మార్జిత పుణ్యవశమును దైవానుగ్రహము వలనను దుర్లభమగు మనుష్యజన్మము ప్రాప్తించి, పురుషశరీరమును దాల్చి, సాంగవేదపారగుఁడయ్యును ఏమూఢుఁడు తన ముక్తికొఱకు ప్రయత్నింపక, అనిత్యమగు పుత్రకళత్రవిత్తాది సంగ్రహాలోలుఁడగునో, వాఁడు దేహాభిమానముచే తనను దానే చంపుకొనునట్టి ఆత్మఘాతకుఁ డగును.

ఇతః కో న్వస్తి మూఢాత్మా యస్తు స్వార్థే ప్రమాద్యతి,
దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషమ్. 5

తా. దుష్ప్రాప్యమగు మనుష్యశరీరము ప్రాపించి, వేదాంతశాస్త్రవిచారాది యోగ్యమగు పురుషత్వము గలిగియు,

అవశ్యకర్తవ్య మగు బంధమోచనవిషయమై యుపేక్షించి ప్రమాదమును బొందువానికంటె మూఢుఁ డెవఁడు? అనఁగా మోక్షమునకై యత్నింపని మనుష్యుఁడు ద్విపాదపశు వనఁ బడును.

పఠన్తు శాస్త్రాణి యజన్తు దేవాన్
కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః,
ఆత్మైక్యబోధేన వినా విముక్తి
ర్న సిధ్యతి బ్రహ్మశతాన్తరేఽపి. 6

తా. షట్ శాస్త్రములను వ్యాఖ్యానసహితముగఁ బఠింతురుగాక, యజ్ఞాదికర్మలవలన నింద్రాదిదేవతలను తృప్తి నొందింతురుగాక, కామ్యకర్మల నెల్లను జేయుదురుగాక, శివకేశవాదిదేవతల భజియింతురుగాక, వీనివలనఁ బ్రయోజన మేమి? ఇవి యన్నియు కామ్యములగుటవలన మోక్షదములు కావు. 'జ్ఞానాదేవ తు కైవల్యమ్' అని ఆత్మజ్ఞానము దక్క నితరోపాయముల వలన మోక్షప్రాప్తి లేదు. కావున ఆత్మైక్యజ్ఞానము కలుగనిదే నూఱు బ్రహ్మకల్పములకైనను ముక్తి సిద్ధింపదు.

అవ. ఉక్తాంశమునే స్థిరీకరించుచున్నారు:—

అమృతత్వస్య నాశాస్తి విత్తేనేత్యేవ హి శ్రుతిః,
బ్రవీతి కర్మణో ముక్తేర హేతుత్వం స్ఫుటం యతః. 7

తా. విత్తమువలనఁగాని విత్తసాధ్యమగు యజ్ఞాదికర్మల వలనఁగాని అమృతత్వము (ముక్తి) లభింపదని "అమృతత్వస్యతు నాశాస్తి విత్తేన" అనెడి శ్రుతివాక్యము చెప్పుచున్నది. కావున ఆత్మైక్యజ్ఞానమువలననేకాని కర్మవలన ముక్తి కలుగదు. మఱియు, "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ

మానశుః," అనెడి శ్రుతియు అమృతత్వ మనఁగా జన్మమరణ రూపప్రవాహావర్జిత మగుముక్తి (స్వస్వరూపావస్థితి) స్వరూప తత్త్వజ్ఞానబలమున అహంకార మమకారత్యాగమువలననే లభించునుగాని, యాగాదిపుణ్యకర్మలవలనఁగాని, గుణవదాయుష్మత్పుత్రప్రాప్తివలనఁగాని, దానభోగసహిత ధనప్రాప్తివలనఁగాని లభింప దని చెప్పుచున్నది.

అవ. మోక్షోపాయమును జెప్పుచున్నారు:—

అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్
సంన్యస్తబాహ్యార్థసుఖస్పృహః సన్,
సన్తం మహాన్తం సముపేత్య దేశికం
తేనోపదిష్టార్థసమాహితాత్మా. 8

తా. కాఁబట్టి నిత్యానిత్యవస్తువివేకశాలియగు ముముక్షువు స్థూలశబ్దాదిక బాహ్యవిషయసంసర్గ లేనివాఁడును, అంతరంగమందు సర్వదా ఆనందాకారవృత్తియందే (బ్రహ్మమునందే) ఇచ్ఛగలవాఁడును, ప్రాతిభాసికవిక్షేపరహిత శాంతచిత్తుఁడును, ఉదారాత్ముఁడును అగు పరతత్త్వబోధనసమర్థుఁడగు దేశికుని (గురువును) శరణుపొంది, ఆయన యుపదేశించు మహావాక్యాది తత్త్వబోధను సమాహితచిత్తముతో విని మననము సేయుచు బంధవిముక్తికొఱకు అధికప్రయత్నము చేయవలెను.

అవ. అటు గురూపదేశమును బొందుచు ఆత్మోద్ధార మెటులఁ జేసికొనవలెనో చెప్పుచున్నారు:—

ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నం సంసారవారిధౌ,
యోగారూఢత్వమాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా. 9

తా. చిత్తనిరోధరూప యోగారూఢభావమునుబొంది, తత్త్వసాక్షాత్కారనిష్ఠతో (ఆత్మసాక్షాత్కారము కావలెననెడి పట్టుదలతో) సంసారసాగరనిమగ్నుఁడయ్యును, తనను తానే ఉద్ధరించుకొనవలెను.

వి. ఇచట "ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్, ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః." అనెడి గీతావాక్యము ప్రమాణము. జ్ఞానమార్గము నవలంబించి ముక్తి నొందుటకును, ఉపేక్షచే నధఃపతనమును జెందుటకును మనస్సే కారణము గనుక, ముందుగ మనస్సును వశపఱచుకొనవలెనని అభిప్రాయము. "యోగశ్చిత్తవృత్తినిరోధః" అనెడి పాతంజల సూత్రప్రకారము చిత్తవృత్తినిరోధమే యోగము.

అవ. కామ్యకర్మత్యాగము తత్త్వజ్ఞానహేతు వని చెప్పుచున్నారు:—

సంన్యస్య సర్వకర్మాణి భవబంధవిముక్తయే,
యత్యతాం పండితై ర్ధీరై రాత్మాభ్యాస ఉపస్థితైః. 10

తా. (రాగద్వేషాదులతోడను, కర్తృత్వభోక్తృత్వాద్యభిమానముతోడను గూడిన) సంసారబంధము నివృత్తికావలెనని కోరు ధీరుఁడగు పండితుఁడు చిత్తనిరోధరూప యోగాభ్యాసమునందు వ్యవధానరహితనిరంతరస్థితి గలిగి, (కాయిక వాచిక మానసిక) సర్వకామ్యకర్మలను బూర్తిగఁ ద్యజించి, నిరంతరము వేదాంతవిచారము చేయవలెను. [ధీరుఁ డన శీతోష్ణాది ద్వంద్వములను సహించుచు సదా బ్రహ్మనిష్ఠ గలవాఁడు. పండితుఁ డనఁగా నిత్యానిత్యవస్తు వివేకము గలవాఁడు.]

అవ. "వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాऽనాశకేనేతి," అనెడి శ్రుతి యజ్ఞదానతపస్సులవలనను, అనశనాదివ్రతములచేతను, వేదాధ్యయనాదికర్మలవలనను తత్త్వజ్ఞానము కలుగు నని చెప్పుచుండఁగా కర్మత్యాగము జ్ఞానప్రాప్తిహేతు వెట్లగును? అనెడి శంకకు సమాధానము:—

చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే,
వస్తుసిద్ధి ర్విచారేణ న కించిత్కర్మకోటిభిః. 11

తా. శ్రుతియందుఁ జెప్పఁబడినకర్మలు చిత్తశుద్ధికొఱకే కాని, ప్రత్యగభిన్నబ్రహ్మోపలబ్ధి (అపరోక్షజ్ఞానము) కలుగు నని కాదు. పరమార్థబ్రహ్మరూపవస్తుసిద్ధి తత్త్వవిచారముచేతనే యగునుగాని, వేదాధ్యయన యజ్ఞ దాన తప వ్రతాది కోటి కర్మలు చేసినను సిద్ధింపదు.

వి. "ధర్మరజ్జ్వా వ్రజేదూర్ధ్వం పాపరజ్జ్వా వ్రజేదధః, ద్వయం జ్ఞానాసినా ఛిత్త్వా విదేహః శాన్తిమృచ్ఛతి, కర్మణా బధ్యతే జన్తుర్విద్యయా చ విముచ్యతే, తస్మాత్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః." కర్మచే బంధము కలుగుననియు, జ్ఞానమువలన బంధవిముక్తి యగు ననియు శ్రుతి చెప్పుచున్నది కనుక దూరదృష్టి గలయతులు కర్మను త్యజింతురు.

అవ. సమ్యగ్విచారణచే సంసారభ్రాంతి తొలఁగు ననుట కుదాహరణము:—

సమ్యగ్విచారతః సిద్ధా రజ్జుతత్త్వావధారణా,
భ్రాన్త్యోదితమహాసర్పభయదుఃఖవినాశనీ. 12

తా. త్రాడును జూచి యది సర్పమని భీతిఁజెందినవాఁడు భయకంపాదులుగలిగి దుఃఖించును. (హితోపదేశమువలన) అది

సర్పము కాదు త్రాడు మాత్రమేయని రజ్జువుయొక్క యథార్థ స్వరూపజ్ఞానము కలుగఁగనే వాని భయకంపాదులు తొలంగును. ఆప్రకారమే (గురూపదేశమువలన) జన్మమరణరూపసంసారము యొక్క యథార్థస్థితిని సమ్యగ్విచారణచేఁ దెలిసికొనఁగా, సంసార దుఃఖము తొలఁగి బ్రహ్మసాక్షాత్కార మగును.

అవ. స్నానదానాదిబహిరంగసాధనములు తత్త్వనిశ్చయ మున కుపకరింప వని చెప్పుచున్నారు:—

అర్థస్య నిశ్చయో దృష్టో విచారేణ హితోక్తితః,
న స్నానేన న దానేన ప్రాణాయామశతేన వా. 13

తా. సద్గురూపదిష్టతత్త్వమస్యాది మహావాక్యార్థమును విచారణవలన నిశ్చయింపఁగా అపరోక్షజ్ఞానము కలుగును. గంగాదినదులయందు మునుఁగుటవలనఁగాని, గో భూ హిరణ్యాది దానములు చేయుటవలనఁగాని, దీర్ఘకాలము ప్రాణాయామము సేయుటవలనఁగాని తత్త్వనిశ్చయము (అపరోక్షజ్ఞానము) కలుగదు.

వి. ఇచట ప్రమాణము:— "వ్రతాని దానాని తపాంసి యజ్ఞః సత్యం చ తీర్థాశ్రమ కర్మయోగాః, స్వర్గార్థమేవాశుభ మధ్రువం చ జ్ఞానం ధ్రువం శాన్తికరం మహార్థమ్." వ్రతములు, దానములు, తపస్సు, యజ్ఞములు, సత్యవ్రతము, తీర్థయాత్రలు, ఆశ్రమస్వీకారము మొదలగు బాహ్యకర్మలు పునర్జన్మహేతువు లగుటచే అనిత్యమును నశుభమును నగు స్వర్గప్రాప్తికే కాని ముక్తికొఱకుఁ గావు. సర్వతాపోపశమనకరమగు మోక్షమును ధ్రువముగఁ గూర్చునది జ్ఞానమే.

అవ. సాధనసంపన్నుఁడే తత్త్వోపదేశమున కధికారియని చెప్పుచున్నారు:—

అధికారిణ మాశాస్తే ఫలసిద్ధి ర్విశేషతః,
ఉపాయా దేశకాలాద్యాః స న్త్యస్మి న్సహకారిణః. 14

తా. బ్రహ్మజ్ఞానఫలప్రాప్తికి సాధనసంపన్నుఁడే అధికారి. ఈయధికారిత్వమునకు దేశకాలాదులు సహకారులు. అనఁగా, జ్ఞానసిద్ధికై యత్నించు ముముక్షువు యమ నియమాద్యంతరంగ సాధనసంపత్తియు, వైరాగ్యమును, అత్యంతాసక్తియుఁ గలిగి యుండవలెను. ప్రతిబంధరహితమగు నిర్మలప్రదేశము, బ్రాహ్మ ముహూర్తాది యుక్తకాలమును సహకారులగు నని యభి ప్రాయము.

అవ. ఈప్రకార మధికారి యగు ముముక్షువు బ్రహ్మ వేత్తయగు గురువు నాశ్రయింపవలె నని చెప్పుచున్నారు:—

అతో విచారః కర్తవ్యో ముముక్షో రాత్మవస్తునః,
సమాసాద్య దయాసిన్ధుం గురుం బ్రహ్మవిదుత్తమమ్. 15

తా. కావున, ఆత్మవస్తువును దెలియఁగోరు ముముక్షువు దయాసముద్రుఁడును బ్రహ్మవేత్తయు నగు ఉత్తమగురువు నాశ్రయించి, తద్గురూపదిష్టమార్గమున తత్త్వవిచారము సేయ వలెను.

అవ. తత్త్వోపదేశమున కర్హుఁడగు ముముక్షువుయొక్క లక్షణములు:—

మేధావీ పురుషో విద్వా నూహాపోహావిచక్షణః,
అధికా ర్యాత్మవిద్యాయా ముక్తలక్షణలక్షితః. 16

తా. పూర్వోక్తలక్షణములు గలిగి ధారణాశక్తిగల వాఁడును, శాస్త్రపఠనమందు నిపుణుఁడును, ఊహాపోహ (తర్క వితర్క) సమర్థుఁడును నగు పురుషుఁడు ఆత్మవిద్యోపదేశమున కధికారి.

వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః,
ముముక్షో రేవహి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతా మతా. 17

తా. మఱియు, సారాసారవిచక్షణుఁడు, వైరాగ్యసంపన్నుఁడు, శమాదిషట్కసంపత్తి గలవాడును నగు ముముక్షువే బ్రహ్మోపదేశమున కర్హుఁడు.

అవ. సాధనచతుష్టయమును వివరించుచున్నారు:—

సాధనాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః,
యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిద్ధ్యతి. 18

తా. బ్రహ్మోపాసనకు నాలుగుసాధనములు చెప్పఁబడినవి. ఈసాధనచతుష్టయసంపన్నుఁడే బ్రహ్మవిద్య కధికారి. అది లేని వానికి బ్రహ్మనిష్ఠ సిద్ధింపదు.

ఆదౌ నిత్యాఽనిత్యవస్తువివేకః పరిగణ్యతే,
ఇహాముత్రఫలభోగవిరాగ స్తదనన్తరమ్. 19

తా. ఆసాధనచతుష్టయములో మొదటిది 'నిత్యానిత్యవస్తువివేకము,' రెండవది 'ఇహాముత్రఫలభోగవిరాగము,' అని చెప్పఁబడును.

శమాదిషట్కసంపత్తి ర్ముముక్షుత్వ మితి స్ఫుటమ్,

తా. మూఁడవది శమాదిషట్కసంపత్తి. నాల్గవది ముముక్షుత్వము. ఈనాల్గును సాధనచతుష్టయ మనఁబడును. శమము,

దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము ననునవి శమాది షట్కము. మోక్షమునం దత్యంతాసక్తి ముముక్షుత్వము.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యేత్యేవం రూపో వినిశ్చయః. 20
సోఽయం నిత్యానిత్యవస్తువివేకః సముదాహృతః,

తా. త్రికాలాబాధ్యము, దేశకాలవస్తుకృతపరిచ్ఛేదరహితము, సర్వాధిష్ఠానము నగు బ్రహ్మము సత్యము. బ్రహ్మాతిరిక్తమగు సకలప్రపంచము మిథ్య యనెడి నిశ్చయజ్ఞానము 'నిత్యానిత్య వస్తువివేక' మనఁబడును.

తద్వైరాగ్యం జిహాసా యా దర్శనశ్రవణాదిభిః. 21
దేహాదిబ్రహ్మపర్యన్తే హ్యనిత్యే భోగ్యవస్తుని,

తా. దేహము మొదలు బ్రహ్మపర్యంతమునుగల అనిత్యములకు సమస్తభోగ్యవస్తువులయొక్క దర్శనశ్రవణాభోగములం దిచ్ఛ లేకుండుట 'వైరాగ్య' మనఁబడును.

విరజ్య విషయవ్రాతాద్దోషదృష్ట్యా ముహుర్ముహుః. 22
స్వలక్ష్యే నియతావస్థా మనసః శమ ఉచ్యతే,

తా. తాపత్రయహేతుభూతములగు విషయములందుఁగల దోషములను మాటిమాటికిఁ దలంచి, వానియందు విరక్తిఁ జెంది, మనోబుద్ధిచిత్తాహంకారము లనెడి అంతరింద్రియములను వానివృత్తులయందుఁ బ్రవేశింపనీయక సర్వదా వానిని బ్రహ్మలక్ష్యమందే నిలుపుట 'శమ' మనఁబడును.

విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోళకే. 23
ఉభయేషా మిన్ద్రియాణాం స దమః పరికీర్తితః,

తా. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను వానివాని వ్యాపారములందుఁ బ్రవేశింపనీయక వానిని పరబ్రహ్మమునందు ఐక్యమొనరించుట 'దమ' మనఁబడును.

వి. జ్ఞానేంద్రియములు. 5—శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ ములను గ్రహించు శ్రోత్రము, త్వక్కు, నయనము, జిహ్వ, ఘ్రాణము ననునవి.

కర్మేంద్రియములు 5—వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ.

బాహ్యానాలంబనం వృత్తే రేషోపరతి రుత్తమా. 24

తా. చంచల మగుమనస్సును నిశ్చలముగఁ జేసి బాహ్య విషయములనుండి మఱలించి.సర్వదా బ్రహ్మలక్ష్యమందే నిలుపుట 'ఉపరతి' యనఁబడును.

సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వకమ్,
చిన్తా విలాపరహితం సా తితిక్షా నిగద్యతే. 25

తా. శీతోష్ణక్షుత్పిపాసా మానావమానాదిద్వంద్వముల వలనఁ గలుగు దుఃఖముల నోర్చుచు, పరులవలన సంభవించు దుఃఖమునకు స్వయముగ శరీరబుద్ధిదార్ఢ్యములు గలిగియుండియు, ప్రతీకారము సేయక, చిత్తవ్యాకులముగాని వాక్ప్రారుష్యము గాని లేకుండ సహించియుండుట 'తితిక్ష' యనఁబడును.

శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యావధారణా,
సా శ్రద్ధా కథితా సద్భి ర్యయా వస్తూపలభ్యతే. 26

తా. శాస్త్రమును గురువాక్యమును, సత్యమనెడి నిశ్చయబుద్ధితో నమ్మియుండుట 'శ్రద్ధ' యనఁబడును. అట్టి

శ్రద్ధవలన అద్వయానందప్రత్యగ్బోధస్వరూపాత్మ ఉపలభ్య మగును (పొందఁబడును), అనఁగా 'అహం బ్రహ్మాస్మి' యనెడి నిశ్చయజ్ఞానము కలుగును.

సమ్యగాస్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా,
తత్సమాధానమిత్యుక్తం న తు చిత్తస్య లాలనమ్. 27

తా. ప్రత్యగభిన్న పరబ్రహ్మమునందు సర్వదా బుద్ధిస్థాపనము (ఏకాగ్రలక్ష్యముతో బుద్ధిని నిలుపుట) 'సమాధాన' మనఁబడును. చిత్తలాలనము, అనఁగా హఠయోగమునందువలె చిత్తమును ఆయాచక్రములందు నిలుపుట సమాధానము కాదు. గురు వుపదేశించినదియు, వేదాంతశాస్త్రమందుఁ జెప్పఁబడినదియు నొక్కటే యని నిశ్చయించుకొని శ్రుత్యుక్త్యనుభవములచేత మనస్సును లక్ష్యవస్తువు (బ్రహ్మము) నందే నిరంతరము నిలుపుట సమాధానము.

అహంకారాదిదేహాన్తాన్ బన్ధానజ్ఞానకల్పితాన్,
స్వస్వరూపావబోధేన మోక్తుమిచ్ఛా ముముక్షుతా. 28

తా. అజ్ఞానకల్పితము లగు అహంకారాదిదేహాంతము వఱకునుగల బంధములలోఁ జిక్కి, అగ్నిచేఁ గాల్పఁబడుచున్న వానివలె పరితపించుచు, సద్గురుబోధవలన నట్టి బంధమునుండి విముక్తుఁ డగుటకుఁ గలిగెడి తీవ్రేచ్ఛ 'ముముక్షుత్వ' మనఁబడును.

అవ. ఇట్లు సాధనచతుష్టయమును వివరించి, ముముక్షువులలో అధికారిభేదమును దెలుపుచున్నారు:—

మందమధ్యమరూపాపి వైరాగ్యేణ శమాదినా,
ప్రసాదేన గురోః సేయం ప్రవృద్ధా సూయతే ఫలమ్. 29

తా. పూర్వోక్తలక్షణవిశిష్టముముక్షుత్వము వైరాగ్యముచేతను, శమాదిషట్కసంపత్తిచేతను న్యూనాధిక భేదముచే మందము మధ్యము ఉత్తమము నని త్రివిధము. ఈముముక్షుత్వము సద్గురుకటాక్షమున దృఢమై, అజ్ఞాననివృత్తిపూర్వకముగ పరమానందరూప మహాఫలము నిచ్చును.

వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే,
తస్మిన్నేవార్థవన్తః స్యుః ఫలవన్తః శమాదయః. 30

తా. ఏ పురుషునకు వైరాగ్యమున్ను ముముక్షుత్వమున్ను తీవ్రమై (దృఢతరమై) యుండునో, వానికే శమాదులు సార్థకములై శీఘ్రఫలము నొసఁగును.

ఏతయోర్మన్దతా యత్ర విరక్తత్వముముక్షయోః,
మరౌ సలిలవత్తత్ర శమాదేర్భాసమాత్రతా. 31

తా. ఏపురుషునకు వైరాగ్యమున్ను మోక్షేచ్ఛయు మందముగ నుండునో, వానియొక్క శమాదులు మరుభూమియందు జలమువలె బాహ్యమునకుఁ గనుపించునేకాని వాస్తవముగ ఫలవంతములు కాఁజాలవు. అనఁగా బాహ్యమునకు శమాదిషట్కసంపన్నుఁడైనట్లు నటించుచు, అంతరమున విషయాసక్తుఁ డగువానికి జ్ఞానోత్పత్తి కాఁజాల దని యభిప్రాయము.

అవ. మోక్షసాధనములలో భక్తియే ప్రధానమని చెప్పుచున్నారు.—

మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ,
స్వస్వరూపానుసన్ధానం భక్తిరిత్యభిధీయతే. 32

తా. మోక్షకారణసాధనములలో శమాదులతోఁగూడిన అంతరంగభక్తి శ్రేష్ఠము. "యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః" అనఁగా, ఈశ్వరునియందు ఆచార్యునియందును దృఢభక్తి గలమహాత్మునకు మహావాక్యార్థము ప్రకాశమై ఫలప్రద మగును. మఱియు, ప్రత్యభిన్న పరబ్రహ్మమునందు నిరంతరచింతన భక్తి యనఁబడును. ఆ నిరంతరచింతన యెట్లుండవలె ననఁగా, "సర్వజ్ఞోఽహ మనన్తోఽహం సర్వేశః సర్వశక్తిమాన్, ఆనన్దసత్యబోధోఽహమితి బ్రహ్మానుచిన్తనమ్" అనఁగా, నేను సర్వజ్ఞుఁడను, త్రివిధపరిచ్ఛేదరహితుఁడను, సర్వశక్తిమంతుఁడను, సచ్చిదానందస్వరూపుఁడను, అని బ్రహ్మభావముతో తలంచుచుండుటయే బ్రహ్మానుచింతన.

అవ. అట్టిభక్తి దృఢమగుటకు స్వార్థమతానుసార మగు నింకొకలక్షణమును జెప్పుచున్నారు:—

స్వాత్మతత్త్వానుసంధానం భక్తి రిత్యపరే జగుః,

తా. వ్యవధానరహితముగ 'అహం బ్రహ్మాస్మి', బ్రహ్మైవాహమ్' అని బ్రహ్మైకత్వానుసంధానము భక్తి యని అహంగ్రహోపాసకులు వచియింతురు.

(అహంగ్రహోపాసన యన 'సోఽహ' మ్మని బ్రహ్మానుసంధాన చింతన.)

అవ. పూర్వోక్తసాధనసంపన్నుఁ డగు అధికారి సద్గురువు నాశ్రయించు విధానమును జెప్పుచున్నారు:—

ఉక్త సాధనసంపన్న స్తత్త్వజిజ్ఞాసురాత్మనః। 33
ఉపసీదేద్గురుం ప్రాజ్ఞం యస్మాద్బన్ధవిమోక్షణమ్,

తా. పూర్వోక్తవివేకాదిసాధనసంపన్నుఁడగుముము క్షువు ఆత్మస్వరూపమును దెలియ నిచ్ఛగలవాఁడై, బ్రహ్మనిష్ఠుఁడగు ఆచార్యు నాశ్రయించి, తనకు సంసారబంధవిముక్తి యెట్లగునో తెలిసికొనవలయును.

వి. "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమితి"(ఆత్మతత్త్వమును దెలిసికొనఁగోరు ముముక్షువు సమిత్పాణియై బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడగు ఆచార్యుని నాశ్రయింపవలెను) అని శ్రుతి చెప్పుచున్నది. (సమిత్తనఁగా పుష్పాద్యుపహారము.)

అవ. ఆచార్యుని విశేషణములను జెప్పుచున్నారు:—

శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః,
బ్రహ్మణ్యుపరతః శాన్తో నిరిన్ధన ఇవానలః,
అహేతుకదయాసిన్ధుర్బన్ధు రానమతాం సతామ్. 35

తా. వేదవేదాంతములయొక్క యథార్థజ్ఞానముగలవాఁడు, కిల్బిషరహితుఁడు, తృష్ణాశూన్యుఁడు అనఁగా మనోజయము గలిగి వాసనాశూన్యుఁడై తత్త్వవిదుఁడగుటచే నెట్టి కోరికలు లేనివాఁడు, బ్రహ్మవేత్తలలో నుత్తముఁడు, నిరంతరము బ్రహ్మాకారవృత్తితో నుండుటవలన నిర్ధూమాగ్నిసదృశుఁడగు శాంతమూర్తి, అహేతుకజాయమానకృపాసముద్రుఁడు, వినమ్రులగు శిష్యులకు బంధుసమానుఁడును అగు (ముందుశ్లోకముతో నన్వయము.)

తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వప్రశ్రయసేవనైః,
ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛేద్ జ్ఞాతవ్య మాత్మనః. 36

తా. అట్టి సద్గురువును భక్తితో నారాధించి, వాగ్రూపము నను, శుశ్రూషవల్లను వినయభయభక్తులతోను సేవఁజేసి, ఆయ నను బ్రసన్నునిగఁ జేసికొని, తాను తెలిసికొనవలసిన ఆత్మజ్ఞాన విషయమై ప్రశ్నింపవలెను.

అవ. శిష్యుఁడు గురువును బ్రార్థింపవలసినవిధానము;—

స్వామిన్నమస్తే నతలోకబన్ధో
కారుణ్యసిన్ధో పతితం భవాబ్ధౌ,
మా ముద్ధరాత్మీయకటాక్షదృష్ట్యా
ఋజ్వా౽తికారుణ్యసుధాభివృష్ట్యా. 37

తా. స్వామీ! మీచరణారవిందములకు నమస్కారము. తమకు నమ్ర లగువారలకు జననీజనకులయట్లు బంధువుఁడవును, దయాసముద్రుఁడవు నగు స్వామీ! నేను సంసారసాగర నిమగ్నుఁడ నయితిని. తమ కరుణామృతవర్ష ధారలచేతను, సరళ కటాక్షవీక్షణముచేతను నన్ను నుద్ధరింప వేఁడుచున్నాను.

దుర్వారసంసారదవాగ్నితప్తం
దోధూయమానం దురదృష్టవాతైః,
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః
శరణ్య మన్యం యదహం న జానే. 38

తా. గురుస్వామీ! నేను దుర్వారసంసారదవానల ములోఁ జిక్కి పరితపించుచు, ప్రారబ్ధవాయువుచేఁ గంపింపఁ బడుచు, మృత్యువువలన భీతిచెంది తమకు శరణాగతుఁడ నయితిని. నన్ను రక్షింపుఁడు. తమకంటె శరణాగతరక్షకుల నితరుల నెవరిని నే నెఱుంగను.

శాన్తా మహాన్తో నివసన్తి సన్తో
వసన్తవల్లోకహితం చరన్తః,
తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనా
న హేతునాన్యానపి తారయన్తః. 39

తా. (ఇంద్రియవ్యాపారము నుపశమింపఁజేసి వాసనా శూన్యులై) ప్రశాంతచిత్తులగు (తమవంటి) మహాత్ములు, (పత్ర పుష్పఫలభరితమై లోకమునకు హితకారి యగు) వసంతఋతువు వలె లోకోపకార మొనరించుచు, భయంకరమగు సంసారార్ణవమునుండి తాము స్వయముగ తరించి, నిర్హేతుకకటాక్షముతో నితరులను సయితము తరింపఁజేయుచుందురు.

వి. 'మహాన్తః' అనఁగా, "భిద్యతేహృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః, క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే." అనెడి ముణ్డకశ్రుతివచనానుసారముగ, అవిద్యావాసనా రూపహృదయగ్రంథి నశించి, జ్ఞేయవిషయమునుగూర్చిన సర్వవిధ సంశయములు నివర్తించి, ఆగామిసంచితకర్మజాలమంతయు నశించి, కారణస్వరూపముచేత పరుఁడనియు, కార్యాత్మక స్వరూపముచేత అపరుఁడనియు గ్రహింపఁబడుచుండుటచేత 'పరావరుఁ' డనంబడు 'బ్రహ్మమే నేను' అని తెలిసికొనిన మహనీయులు.

అవ. మహాత్ములయొక్క స్వభావసిద్ధకరుణారసమునకు దృష్టాంతమును బ్రకటించుచున్నారు:—

అయం స్వభావః స్వత ఏవ యత్పర
శ్రమాపనోదప్రవణం మహాత్మనామ్,

సుధాంశురేషః స్వయమర్కకర్కశ
ప్రభాభితప్తామవతి క్షితిం కిల. 40

తా. ఇతరులయొక్క శ్రమను నివారించుటయే, అనఁగా అజ్ఞానజన్యతాపత్రయముచే పరితపించుచుండువారలయొక్క పరితాపమును మహావాక్యోపదేశద్వారా స్వస్వరూపానందమును గలుగఁజేయుటవలనఁ బోఁగొట్టుటయే, యీ మహాత్ములయొక్క సహజస్వభావము. ఎట్లనఁగా, సూర్యునియొక్క ప్రచండకిరణములచేత తపింపఁబడిన భూమిని శీతకరుఁడు తన అమృతకిరణములచేత రక్షించునుగదా. సంసారతాపతప్తులగుజనుల నుద్ధరించుటయే మహాత్ములస్వభావము.

బ్రహ్మానన్దరసానుభూతికలితైః పూతైః సుశీతైర్యుతై
ర్యుష్మద్వాక్కలశోజ్ఝితైఃశ్రుతిసుఖైర్వాక్యామృతైఃసేచయ
సంతప్తం భవతాపదావదహనజ్వాలాభిరేనం ప్రభో
ధన్యాస్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః. 41

తా. ఓ ప్రభూ! గురువతంసా! ఆధ్యాత్మికాది తాపత్రయముతోఁగూడిన సంసారదుఃఖరూప దావానలజ్వాలలచేఁ బీడితుఁడనై మీకు శరణుచొచ్చినాఁడను. బ్రహ్మానందరసానుభవముచే నొప్పినదై పవిత్రమై అత్యంతశీతలమై యొప్పెడి శ్రుతిసుఖవాక్యామృతధారలను మీవాక్కలశమునుండి నాపై వర్షించి నాతాపము నుపశమింపఁజేయుఁడు. ప్రభూ! ఎవనిపై మీకటాక్షవీక్షణ మొకక్షణమైనను ప్రసరించునో, వాఁడు ఉపదేశపాత్రుఁడై మీయంగీకారమును బడసినవాఁడై ధన్యుఁడగును.

కథం తరేయం భవసిన్ధుమేతం
కా వా గతిర్మే కతమోఽస్త్యుపాయః,
జానే న కించిత్కృపయాఽవ మాం ప్రభో
సంసారదుఃఖక్షతి మాతనుష్వ. 42

తా. మహాత్మా! నే నీ సంసారసాగరమును తరించుట కుపాయ మెద్ది? నాకు గతి యేమి? ఏయుపాయముచేత నే నీ సంసారసముద్రమును దాఁటఁగలను? స్వామీ! నాకేమియుం దెలియదు. నాయం దనుగ్రహించి రక్షించి, యీజన్మమృత్యు రూపసంసారదుఃఖమును బోఁగొట్టుఁడు.

అవ. శిష్యుఁ డిట్లు ప్రార్థింపఁగా విని ఆచార్యులు శరణాగతుఁ డయిన శిష్యునిపై కరుణించి యిట్లభయ మివ్వ వలె నని చెప్పుచున్నారు:—

తథా వదన్తం శరణాగతం స్వం
సంసారదావానలతాపతప్తమ్,
నిరీక్ష్య కారుణ్యరసార్ద్రదృష్ట్యా
దద్యాదభీతిం సహసా మహాత్మా. 43

తా. సంసార మనెడి దావాగ్నిచేఁ దపింపఁబడి పరితపించుచు, దీనుఁడై శరణాగతుఁడయి యిట్లు ప్రార్థించు శిష్యుని కరుణారసార్ద్రదృష్టితోఁ గనుంగొని మహాత్ముఁడగు గురువు వాని కభయదాన మొసంగును.

విద్వాన్ స తస్మా ఉపసత్తిమీయుషే
ముముక్షవే సాధు యథోక్తకారిణే,
ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ
తత్త్వోపదేశం కృపయైవ కుర్యాత్. 44

తా. అనంతరము శిష్యుని సమీపించి, మోక్షమం దధికేచ్ఛగలవాఁడును, గురువాక్యపరిపాలనము సేయు వాఁడును నిర్మలచిత్తుఁడు అనఁగా రాగద్వేషాదిదోషరహితుఁ డును, శమదమాదిసాధనసంపన్నుఁడును, ఉత్తమాధికారియు నగు శిష్యునకు దయతో తత్త్వోపదేశము చేయవలెను.

మా భైష్ట విద్వం స్తవ నా స్త్యపాయః
సంసారసిన్ధో స్తరణేఽస్త్యుపాయః,
యేనైవ యాతా యతయోఽస్య పారం
తమేవ మార్గం తవ నిర్దిశామి. 45

తా. ఓయీ! విద్వాంసుఁడా! భయపడకుము. నీ కపాయ మెద్దియు లేదు సంసారసాగరమును దాఁటుట కుపా యము కలదు. యతులు (వివిదిషాసన్న్యాసులును విద్వత్స న్న్యాసులును) ఏయుపాయముచేత సంసారసముద్రముయొక్క పారమును బొందిరో, అనఁగా సంసారదుఃఖమునుండి విముక్తు లయి పరబ్రహ్మస్వరూపమును బొందిరో, అట్టి యుపాయ మును నీకుఁ దెలిపెద.

వి. ఈశ్లోకమందు 'యతయః' అనెడి శబ్దము వివిదిషా సన్న్యాసులను విద్వత్సన్న్యాసులను సూచించుచున్నది. వివిదిషా సన్న్యాస మనఁగా తత్త్వజ్ఞానమును సంపాదింపవలె ననెడి దృఢ నిశ్చయముతోఁగూడిన ఇచ్ఛచేఁ జేయఁబడుసన్న్యాసము. విద్వ త్సన్న్యాస మనఁగా తత్త్వజ్ఞానము కలిగినతరువాతఁ జేయఁ బడుసన్న్యాసము. వివిదిషాసన్న్యాసమునకు ఫలము విదేహ ముక్తి; విద్వత్సన్న్యాసమునకు ఫలము జీవన్ముక్తి. సన్న్యా సమునకు ముఖ్యకారణము పూర్ణవైరాగ్యము. సంసారియైనను

సన్న్యాసియైనను సంపూర్ణవైరాగ్యము కలుగనిదే అవిద్యా నిశ్శేషవినాశపూర్వక పరమానందరూపస్వాత్మప్రాప్తి యను మోక్షము సిద్ధింప దని సూచింపఁబడినది.

అవ. మోక్షసాధన మగు జ్ఞానవిషయమై ప్రశంసించుచున్నారు:—

అస్త్యుపాయో మహాన్కశ్చిత్సంసారభయనాశనః,
తేన తీర్త్వా భవాంభోధిం పరమానన్దమాప్స్యసి. 46

తా. ఓయీ! ఈ సంసారభయమును బోఁగొట్టుటకు మహత్తర మగు నుపాయము కలదు. ఆయుపాయ మెద్ది యన "న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే," (జ్ఞానమునకంటె పవిత్రమైన దెద్దియును లేదు) అని భగవద్వచనము. అట్టి జ్ఞానమువలన భవసాగరమును తరించి పరమానందమును బొందఁగలవు.

వేదాన్తార్థవిచారేణ జాయతే జ్ఞానముత్తమమ్,
తేనాత్యన్తికసంసారదుఃఖనాశో భవత్యను. 47

తా. ఉపనిషదాది వేదాంతవాక్యములను సద్గురుముఖమున విని మహావాక్యార్థవిచారము చేయఁగా సర్వోత్కృష్ట మగు అపరోక్ష (బ్రహ్మాత్మైక్య) జ్ఞానము కలుగును. అట్టిజ్ఞానము వలన సంసారదుఃఖము తప్పక నివర్తించును.

వి. వేదాంతార్థవిచార మెట్లుండవలె ననఁగా, "న దద్యాదవసరం కించిత్ కామాదీనాం మనాగపి, ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాన్తచిన్తయా" అని శాస్త్రాంతర ప్రసిద్ధి.

అవ. శ్రద్ధాభక్తిధ్యానయోగములు ముక్తిహేతువులని చెప్పుచున్నారు:—

శ్రద్ధాభక్తిధ్యానయోగా న్ముముక్షో
ర్ముక్తే ర్హేతూన్వక్తి సాక్షాచ్ఛ్రుతేర్గీః,
యో వా ఏతేష్వేవ తిష్ఠత్యముష్య
మోక్షోఽవిద్యాకల్పితా ద్దేహబన్ధాత్. 48

తా. అన్యప్రమాణాపేక్షారహితముగ వేదవాణి ముముక్షువులకు అజ్ఞానతత్కార్యనివృత్తిద్వారా పరమానందప్రాప్తిరూపమోక్షప్రాప్తికి పరంపరావిచారోపయోగములగు నాలుగు సాధనములను బ్రత్యక్షముగఁ జెప్పుచున్నది. ఆ సాధనము లెవ్వి యన శ్రద్ధాభక్తిధ్యానయోగములు. 'శ్రద్ధ' యనఁగా గురువేదాంతవాక్యములందు విశ్వాసము. 'భక్తి' యనఁగా స్వస్వరూపానుసంధానము. 'ధ్యాన' మనఁగా నిరంతరము ధ్యేయాకారవృత్తియందు ప్రవాహరూపచింతన. 'యోగ' మన ననాత్మవృత్తినిరోధము. అధికారి యగు ముముక్షువునకు నీసాధనాభ్యాసమందు నిరంతరస్థితి నిరంతరాయముగఁ గలిగె నేని, నానాశరీరసంబంధరూపబంధము (అనాత్మయం దాయధ్యాసము) వీడి, పరమానందప్రాప్తిరూపముక్తి కలుగును

అవ. కారణాధ్యాసద్వారా కార్యాధ్యాసము, అనఁగా ఆత్మజ్ఞానమువలన అజ్ఞానకార్యము నశించు నని చెప్పుచున్నారు:—

అజ్ఞానయోగాత్పరమాత్మన స్తవ
హ్యనాత్మబన్ధ స్తత ఏవ సంసృతిః,

తమో ర్వివేకోదితబోధవహ్ని
రజ్ఞానకార్యం ప్రదహేత్సమూలమ్. 49

తా. శిష్యా! నీవు స్వతఃసిద్ధముగ శుద్ధ బుద్ధముక్తస్వభావ పరమాత్మవే. కాని, అవిద్యాశ్రయముచే నీకు తాదాత్మ్యాధ్యాసము (శరీరమే నేను అనెడి అధ్యాసము) కలిగినది. అందువలన 'నేను కర్తను నేను భోక్తను' అను నీమొదలగు శరీరసంబంధరూపసంసారము కలిగినది. ఆత్మానాత్మవివేకమువలనఁ గలుగు అపరోక్షజ్ఞాన మనెడి అగ్నిచే అజ్ఞానకార్యమును మూలాఽవిద్యాసహితముగ దహింపవలెను. అనఁగా నెపుడు స్వస్వరూపాపరోక్షజ్ఞానము కలుగునో, యపుడు అజ్ఞానతత్కార్య నివృత్తిపూర్వక పరమానందప్రాప్తిరూపమోక్షము స్వతఃసిద్ధమగు నని భావము.

అవ. ఆచార్యు లిట్లు బోధింపఁగా విని వినయముతో శిష్యుఁడు ప్రశ్నించును:—

శిష్య ఉవాచ:—

కృపయాశ్రూయతాం స్వామిన్ ప్రశ్నోఽయం క్రియతేమయా,
యదుత్తరమహం శ్రుత్వా కృతార్థః స్యాం భవన్ముఖాత్. 50

తా. శిష్యుఁడు చెప్పుచున్నాఁడు.—స్వామీ! గురువరా! నే నొక ప్రశ్నము చేయుచున్నాను. కృపతో నాకర్ణించి, మీముఖాంబుజమునుండి ప్రత్యుత్తర మొసంగుదురేని నేను కృతార్థుఁడ నయ్యెద.

కోనామ బన్ధః కుత ఏష ఆగతః
కథం ప్రతిష్ఠాఽస్య కథం విమోక్షః,

శ్లో॥ఽసావనాత్మా పరమః స్వ ఆత్మా
తయోర్వివేకః కథమేతదుచ్యతామ్. 51

తా. స్వామీ! బంధ మన నేమి? అది యెట్లు కలిగినది? దానిస్థితి యెట్టిది? ఆబంధముయొక్క విముక్తి యెట్లు? అనాత్మ యన నేమి? పరమాత్మ యన నేమి? స్వస్వరూపజీవాత్మ యెవరు? ఆజీవాత్మ పరమాత్మలను దెలిసికొనువిధాన మెద్ది? కృపయుంచి యీప్రశ్నమున కు త్తర మొసంగుఁడు.

అవ. శిష్యుఁడిట్లు విన్నవింపఁగానాచార్యు లుత్తరమిచ్చు చున్నారు:—

గురు రువాచ:—

ధన్యోఽసి కృతకృత్యోఽసి పావితం తే కులం త్వయా,
యదవిద్యాబన్ధముక్త్యా బ్రహ్మీభవితు మిచ్ఛసి. 52

తా. గురువు చెప్పుచున్నాఁడు.—శిష్యా! అజ్ఞానబంధ నివృత్తిద్వారా బ్రహ్మరూపమును పొందఁగోరుచున్నావు. కనుక నీవు ధన్యుఁడవును, కృతకృత్యుఁడవును, నీమూలమున నీకులము (మాతృపిత్రాదివంశావళి) పవిత్రమైనది.

ఋణమోచనకర్తారః పితుః సన్తి సుతాదయః,
బన్ధమోచనకర్తాతు స్వస్మాదన్యో న కశ్చన. 53

తా. వత్సా! (శ్రాద్ధాదికర్మలవలన) పితరుల ఋణమును పుత్రాదులు తీర్పఁగలరు. కాని ఎవని భవబంధము వాఁడే విముక్తిఁజేసికొనవలెఁగాని యితరులు చేయఁజాలరు. కనుకనీబంధ మోచనమునకు నీవే యత్నింపవలెను.

మస్తకన్యస్తభారాదేర్దుఃఖమన్యైర్నివార్యతే.
క్షుధాదికృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్. 54

తా. నీశిరస్సుపై నుండుభారమువలనఁగలుగుదుఃఖ మితరులాభారమును దొలఁగింపఁగా నివారణ మగును. క్షుత్పిపాసల వలనఁ గలుగు నీదుఃఖము నీవు స్వయముగ భుజియించినఁగాని నివృత్తి కాదు.

పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా,
ఆరోగ్యసిద్ధి ర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా. 55

తా. వ్యాధిగ్రస్తుఁడు తాను స్వయముగ నౌషధమును సేవించి పథ్యముచేసినయెడల వాని కారోగ్యము కలుగును. వానికై యితరులు ఔషధసేవయు పథ్యమును జేసినయెడల రోగియొక్క రోగము కుదురునా? కుదురదు.

అవ. పూర్వోక్తదృష్టాంతత్రయమునకు అన్యదృష్టాంత సహితముగ దార్ష్టాంతమును నిరూపించుచున్నారు:—

వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా
స్వేనైవ వేద్యం న తు పణ్డితేన,
చన్ద్రస్వరూపం నిజచక్షుషైవ
జ్ఞాతవ్య మన్యైరవగమ్యతే కిమ్. 56

తా. చంద్రునియొక్క స్వరూపము స్వయముగఁజూచిన యెడల తెలియఁగలదు గాని, తనకొఱకు నితరులు చూచిన యెడల తెలియునా? ఎంతమాత్రము దెలియదు. ఆప్రకారమే ఆత్మస్వరూపము స్వకీయనిర్మలజ్ఞానచక్షువునకు గోచరించును గాని, పండితునకు అనఁగా శాస్త్రజన్యజ్ఞానమువలన గోచరింపదు.

వి. ఈచెప్పఁబడిన దృష్టాంతముల ఫలితార్థ మేమనఁగా, క్షుత్పీడితుఁడు స్వయముగ భుజియించినఁ గాని వానియాకలి

తీరనియట్లును, రోగపీడితుఁడు స్వయముగ నౌషధమును సేవించి పథ్య మొనరించినఁగాని వానిరోగము కుదురనియట్లును, చంద్రునిరూపము స్వయముగఁ జూచినఁగాని తెలియనియట్లును, సంసారబంధనివృత్తికొఱకు పరతత్త్వమును దెలియఁగోరు ముముక్షువు పూర్వోక్తసాధనసంపన్నుఁడయి, సద్గురువు నాశ్రయించి తత్త్వరహస్యములఁ దెలిసికొని స్వయముగ శ్రద్ధాభక్తిధ్యానయోగములచే నిరంతరము నిరంతరాయముగ బ్రహ్మనిష్ఠాపరుఁడయినం గాని ప్రయోజనము కలుగదు. దీనిచే, ఉపనిషదాది వేదాంతశాస్త్రముల నెంత చదివినను స్వానుభవములేని చదువు నిరర్థక మగు నని సూచింపఁబడినది.

అవిద్యాకామకర్మాది పాశబన్ధం విమోచితుమ్,
కః శక్నుయా ద్వినాత్మానం కల్పకోటిశతైరపి. 57

తా. జన్మహేతువు లగు అవిద్యాకామకర్మాదిపాశముల వలనఁ గలిగెడి ప్రతిబంధము ఆత్మజ్ఞానమువల్లనే విమోచనము కావలెనుగాని, జ్ఞానోదయము కానియెడల శతకోటికల్పముల కయినను బంధముక్తి కాఁజాలదు.

వి. అవిద్య (అజ్ఞానము), కామము (కోరిక), కర్మము (సుకృతదుష్కృతములు), పృథివ్యాదిపంచతన్మాత్రలు నను నీయెనిమిదియు 'అష్టవసువు' లనఁబడును. ఒకశరీరమును విడిచి మఱియొకశరీరమును ధరించునపుడు పూర్వప్రజ్ఞచే నీ అష్టవసువులతోడను శరీరారంభ మగును. పూర్వప్రజ్ఞచేతనే ముక్తుఁడ ననెడి జ్ఞానము కలుగును. అట్టి ఆత్మజ్ఞానము కలుగుపర్యంతము జన్మమృత్యురూపసంసారమునకు విముక్తి కలుగదు.

"ఘృణా లజ్జా భయం శంకా జుగుప్సా చేతి పంచమీ, కులం శీలం చ జాతిశ్చేత్యష్టౌ పాశాః ప్రకీర్తితాః" ఈఘృణాదులు అష్టపాశము లనఁబడును. ఈపాశములు బంధహేతువు లని విజ్ఞులు చెప్పుదురు.

న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా,
బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షః సిధ్యతి నాన్యథా. 58

తా. హఠాదియోగాభ్యాసమువలనఁగాని, సాంఖ్యశాస్త్రరీత్యా ప్రకృతిపురుషవివేచనవలనఁగాని, యజ్ఞాదికర్మాచరణవలనఁగాని, తర్కమీమాంసాదిశాస్త్రాధ్యయనమువలనఁగాని పూర్వోక్తబంధవిముక్తిపూర్వకముగ పరమానందప్రాప్తిరూపమోక్షము సిద్ధింపదు. బ్రహ్మాత్మైకత్వజ్ఞానమువలననే మోక్షప్రాప్తి యగును. ఇంతకంటె సాధనాంతరము లేదు.

అవ. తత్త్వజ్ఞానమునకు లౌకికచతుర్దశవిద్యలు ననుపయోగము లని చెప్పుచున్నారు :—

వీణాయా రూపసౌన్దర్యం తన్త్రీవాదనసౌష్ఠవమ్,
ప్రజారంజనమాత్రం త న్న సామ్రాజ్యాయ కల్పతే. 59

తా. వీణాదిసాధనములయొక్క రూపసౌందర్యములును, తంతువులను మీటుచు పాడెడినైపుణ్యమున్ను పాటను వినునట్టి ప్రజలను రజింపఁజేయుటకేకాని మోక్షసామ్రాజ్యమును గూర్పఁజాలవు.

అవ. తర్కమీమాంసాద్యష్టాదశవిద్యలును భుక్తికొఱకేకాని ముక్తికొఱకు కా దని చెప్పుచున్నారు :—

వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్,
వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే. 60

తా. ఆప్రకారమే పండితులయొక్క వాక్చాతుర్యమున్ను, అనర్గళలలిత ప్రయోగకౌశలమున్ను, శాస్త్రముల కనేకవిధముల వ్యాఖ్యాన మొనరించునేర్పున్ను, పాండిత్యమున్ను, భుక్తికొఱకేకాని ముక్తికొఱకు కాదు. అనఁగా సంగీతసాహిత్యాదిసమస్తవిద్యలు మోక్షమును గూర్పఁజాలవని యభిప్రాయము.

అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా,
విజ్ఞాతేఽపి పరేతత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా. 61

తా. పరమాత్మకంటె ప్రతిబింబుఁడగు జీవాత్మ వేఱుగాక పరమాత్మయే యని గురుప్రసాదమువలనను మననాదికమువలనను దృఢబోధ కలిగినఁగాని, కేవల తర్కవ్యాకరణాది శాస్త్రపఠనమువలనఁ బ్రయోజనములేదు. వంట సిద్ధమైనపిమ్మట కట్టెలతోఁ బనిలేనియట్లు, జీవబ్రహ్మైక్యజ్ఞానము దృఢమయిన పిమ్మట శాస్త్రాధ్యయనముతోఁ బ్రయోజనము లేదు. అనఁగా శాస్త్రాధ్యయనముతోపాటు పరతత్త్వజ్ఞానాభ్యాసము గూడ నుండవలెననియు, పరబ్రహ్మాఖండాకారవృత్తిగలిగినంతట శాస్త్రముతో నిమిత్తముండ దనియు నభిప్రాయము.

వి. "జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః, నైవాస్తి కించిత్కర్తవ్యమస్తిచేన్న సతత్త్వవిత్," (జ్ఞానామృతమువలన తృప్తినొంది కృతకృత్యుఁడగుయోగికి తత్త్వజ్ఞానముకొఱకుఁ జేయఁదగిన ప్రయత్న మెద్దియును లేదు. ప్రయత్నము చేయవలసియుండెనేని యతఁడు తత్త్వవేత్తయే కాఁడు).

మఱియు, "లోకవాసనయాజన్తోఃశాస్త్రవాసనయాఽపిచ, దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే" స్వనిష్ఠగుణములను బ్రకటించుటకొఱకు నగులోకవాసనయు, శాస్త్రపఠనము కర్మానుష్ఠానము ననెడి శాస్త్రవాసనయు, శరీరభరణపోషణార్థమై నిరంతరసంకల్పమనెడి దేహవాసనయు నను నీవాసనాత్రయము తత్త్వజ్ఞానప్రాప్తి కవరోధక మగును.

శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారణమ్,
అతః ప్రయత్నాజ్జ్ఞాతవ్యం తత్త్వజ్ఞాత్తత్త్వమాత్మనః. 62

తా. వ్యాకరణాది శబ్దసముదాయము మహారణ్యము వంటిది. మహారణ్యములో చిక్కుపడినవానికి దారి తెలియకను, క్రూరజంతువులవలని భయమువల్లను ఎట్లు చిత్తభ్రమము కలుగునో యట్లే, శాస్త్రపరిశోధనవలన చిత్తభ్రమము కలుగును. ఏలయనఁగా, శాస్త్రమునం దొకశబ్దమున కనేకార్థము లుండును. ఒకవాక్యమున కనేకభావము లుండును. అందువలన ననేకసంశయములు కలుగును. ఇదమిత్థ మ్మని నిశ్చయింప శక్యముకాదు. కనుక బుద్ధిమంతుఁడగువాఁడు శాస్త్రవాసనలోఁ జిక్కి వృథా కాలక్షేపము సేయక, బ్రహ్మవేత్తయగు సద్గురువు నాశ్రయించి అత్యంతప్రయత్నముతో ఆత్మతత్త్వమును దెలిసికొనవలెను.

అజ్ఞానసర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా,
కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మన్త్రైః కిమౌషధైః. 63

తా. అజ్ఞాన మనెడి సర్పముచేఁ గఱవఁబడినవానికి బ్రహ్మజ్ఞానరూప దివ్యౌషధము దక్క నితరప్రయత్నములు నిష్ఫలము లగును. వేదాధ్యయనము, శాస్త్రపఠనము, గాయత్రీ

మహామృత్యుంజయాదిమంత్రోపాసన, వృద్ధిసిద్ధి మొదలగు దివ్యౌషధములు అజ్ఞానసర్పదష్టమువలనఁ గలుగు మృత్యువును మఱలింపఁజాలవు. అనఁగా సర్పదష్టుఁడైనవానిని మణిమంత్రౌషధములవలన బ్రతికింపవచ్చునుగాని అజ్ఞానమువలనఁ గలుగు మృత్యువును నివారింపఁజాలవు. కనుక జన్మమృత్యురూపసంసారము నశించుటకు బ్రహ్మజ్ఞానమే దివ్యౌషధము, అని యభిప్రాయము.

అవ. అపరోక్షజ్ఞానమువలననే అజ్ఞాననివృత్తి యగునని శ్లోకత్రయముచే వ్యతిరేకరూపదృష్టాంతములతో విశదీకరించుచున్నారు:—

న గచ్ఛతి వినా పానం వ్యాధిరౌషధశబ్దతః,
వినాఽపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే. 64

తా. రోగపీడితుఁడు ఔషధమును సేవింపనిదే ఔషధముయొక్క పేరును విని నంతమాత్రాన వానిరోగము కుదురదు. ఆప్రకారమే అజ్ఞానమువలన భవబంధమునఁ జిక్కియున్నవానికి బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారము కలుగనిదే, 'అహం బ్రహ్మాస్మి' యని నోట పల్కినమాత్రాన మోక్షము లభింపదు.

అకృత్వా దృశ్యవిలయమజ్ఞాత్వా తత్త్వమాత్మనః,
బాహ్యశబ్దైః కుతో ముక్తిరుక్తిమాత్రఫలైర్నృణామ్. 65

తా. బ్రహ్మాత్మైక్యవృత్తిగల జ్ఞానికి దృశ్యప్రపంచము స్ఫురింపదు. ఆప్రకారము సర్వదృశ్యమును విలయమగునట్లు ఆత్మతత్త్వజ్ఞానముకలుగనిదే, గురూపదేశములోని శాస్త్రావలోకనమువలనఁ గలిగిన అర్థజ్ఞానముచే 'అహం బ్రహ్మ అహం బ్రహ్మ'

యని శబ్దోచ్చారణముఁ జేసినంతమాత్రాన ముక్తిసిద్ధింపదు. అది బ్రహ్మశబ్దోచ్చారణమాత్రమే యగును. పెట్టెలో 'మణియున్నది మణి యున్నది' యని నోట నుచ్చరించినమాత్రాన యామణి చేఁజిక్కునా? బాహ్యమున బ్రహ్మశబ్దోచ్చారణమును నట్టిదే.

అకృత్వా శత్రుసంహారమగత్వాఽఖిలభూశ్రియమ్,
రాజాహమితి శబ్దాన్నో రాజా భవితు మర్హతి. 66

తా. శత్రువుల నిశ్శేషముగసంహరించి, అఖిలభూమండలాధిపత్యమును వహించినవాఁడే రాజగునుగాని 'నేను రాజును, నేను రాజును, అని చెప్పినంతమాత్రాన వాఁడు రాజు కాఁజాలఁడు.

వి. కామక్రోధాది శత్రువర్గమును సంహరించి, మనోరాజ్యమును జయించి స్వాయముగ పరబ్రహ్మమై విలసిల్లువాఁడే బ్రహ్మవేత్త యగునుగాని 'నేను బ్రహ్మవేత్తను' అని చెప్పికొనినమాత్రమున వాఁడు బ్రహ్మవేత్త కాఁడని భావము.

అవ. అవిద్యాతత్కార్యమువలన మఱుఁగుపడియున్న ఆత్మవస్తువును దుర్యుక్తులచేఁ దెలియశక్యము కాదని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

ఆప్తోక్తిం ఖననం తథోపరి శిలాద్యాకర్షణం స్వీకృతిం
నిక్షేపః సమపేక్షతే న హి బహిః శబ్దైస్తు నిర్గచ్ఛతి,
తద్వద్బ్రహ్మవిదోపదేశమననధ్యానాదిభిర్లభ్యతే
మాయాకార్యతిరోహితం స్వమమలం తత్త్వం న దుర్యుక్తిభిః.

తా. భూమిలో ధనము పాతిపెట్టఁబడియున్నదని తెలిసినప్పుడు, ఆనిధి యెచటనున్నదో ధ్రువముగఁ జెప్పఁగల ఆప్తుని

వలనఁ దెలిసికొని, ఆచోట త్రవ్వి పైమట్టినిఁ దొలఁగించి, ఱాళ్లను పెల్లగించి తీసివేసి, పిమ్మట ధనమును గనుఁగొని దానినిఁ దీసికొనవలెను. ఖననాదిక్రియలను నోట నుచ్చరించినమాత్రాన, అనఁగా నిచట నిధియున్నదని యనుకొనినంత మాత్రమున నానిధి లభింపదు. ఆప్రకారమే ఆత్మవస్తువు లభింపవలెననిన, సద్గురూపదిష్టమార్గమున ఆత్మానాత్మవివేచనపూర్వకముగ పంచకోశములను శోధించి, మన నిదిధ్యాసనాదులవలన మాయా తత్కార్యములగు అహంకారాదులచే మూటుపడియున్న నిర్మలాత్మతత్త్వమును గ్రహింపవలెను. తర్కసాంఖ్యాదియుక్తుల వలన ఆత్మతత్త్వము లభింపదు.

వి. అవిద్యారూప భూమియందు, ప్రత్యగభిన్నాద్వయానందమనెడి పెన్నిధి పంచకోశములనెడి ఱాళ్లచేతను, రాగద్వేషాదులనెడి మట్టిచేతను గప్పఁబడియున్నది. అన్వయ వ్యతిరేకయుక్తులవలన ఉభయపదార్థశోధనము ఖననము, భాగత్యాగలక్షణచే నుభయోపాధిత్యాగమే శిలాపాకర్షణము. ఏతద్దృష్టాంతరీత్యా ప్రతిబంధనివృత్తిద్వారా నిరావరణస్వరూపానందము ననుభవించువాఁడే బ్రహ్మవేత్త యని భావము.

తస్మాత్సర్వప్రయత్నేన భవబన్ధవిముక్తయే,
స్వైరేవ యత్నః కర్తవ్యో రోగాదావివ పండితైః. 68

తా. ఇట్టి కారణములవలన, కర్తృత్వభోక్తృత్వరూప సంసారబంధనివృత్తికొఱకు, శ్రవణమననాదిసకలోపాయముల చేతను, సదసద్విచారశీలుఁడగుపండితుఁడు, రోగి, స్వయముగ నౌషధమును సేవించి ఆరోగ్యవంతుఁడయినట్లు, స్వప్రయత్నము

వలన ఆధ్యాత్మికాదితాపత్రయమును బోఁగొట్టుకొని బ్రహ్మా నందసుఖము ననుభవింపవలెను.

అవ. ఇఁకను శిష్యుఁ డారంభమందు చేసినప్రశ్నము విషయమై ప్రశంసించుచున్నారు:—

యస్త్వయాద్య కృతః ప్రశ్నో వరీయాఞ్ఛాస్త్రవిన్మతః,
సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్యశ్చ ముముక్షుభిః. 69

తా. శిష్యా! నీచే నిపుడు చేయఁబడిన ప్రశ్నము ఉత్తమ మైనదియు, శాస్త్రసమ్మతమయినదియు, సూత్రప్రాయమైనది యును, ముముక్షువులు తెలిసికొనఁదగిన గూఢార్థముగలదియు నై యున్నది.

శృణుష్వావహితో విద్వాన్ యన్మయా సముదీర్యతే,
తదేతచ్ఛ్రవణాత్సద్యో భవబన్ధాద్విమోక్ష్యసే. 70

తా. ఓయి విద్వాంసుఁడా! నాచేఁ జెప్పఁబడు విషయ మును సావధానముగ వినుము. ఆవిషయమును వినుటవలన నిప్పుడే భవబంధవిముక్తుఁడ వగుదువు.

అవ. పూర్వోక్తప్రశ్నమున కుత్తరముగా మోక్ష హేతువును జెప్పుచున్నారు:—

మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే
వైరాగ్యమత్యన్త మనిత్యవస్తుషు,
తతః శమశ్చాపి దమస్తితిక్షా
న్యాసః ప్రసక్తాఖిలకర్మణాం భృశమ్. 71

తా. మోక్షహేతువులు మొదట చెప్పఁబడును. అవి యెవ్వియనఁగా:—1. అనిత్యవస్తువులయందు సంపూర్ణ వైరా

గ్యము, 2. శమము, 3. దమము, 4. తితిక్ష, 5. సమస్తకామ్య కర్మపరిత్యాగము. (21, 22, 23, 24, 25 శ్లోకములలో వైరాగ్యము, శమము, దమము, తితిక్షయు వివరింపఁబడినవి).

తతః శ్రుతిస్తన్మననం స్వతత్త్వ
 ధ్యానం చిరం నిత్యనిరన్తరం మునేః,
తతోఽవికల్పం పరమేత్యవిద్వా
 న్నిహైవ నిర్వాణసుఖం సమృచ్ఛతి. 72

తా. దృఢవైరాగ్యము గలిగి శమాదుల నభ్యసించిన పిమ్మట, 6 గురుముఖమున వేదాంతవాక్యశ్రవణము ["షడ్విధయుక్తిభిర్వేదాన్తవాక్యానా మద్వితీయబ్రహ్మణి తాత్పర్యనిశ్చయః శ్రవణమ్," అనఁగా ఉపక్రమోపసంహారాది షడ్విధలింగములచేత బ్రహ్మవిషయమయిన తాత్పర్యనిశ్చయము శ్రవణము]. 7. మననము, ["శ్రుతస్యార్థస్యోపపత్తిభిశ్చిన్తనం మననమ్"—వినినదానియర్థమును శ్రుత్యనుకూలయుక్తులచేతఁ బలుమాఱు చింతించుట మననము], 8. నిధిధ్యాసనము, అనఁగా జీవన్ముక్తిసుఖప్రాప్తికొఱకు పరోక్షజ్ఞానముగలిగి, అనవచ్ఛిన్నముగ ఆత్మధ్యానముసేయుట ["విజాతీయప్రత్యయతిరస్కారేణవిజాతీయ ప్రత్యయే మనసః ప్రవాహీకరణం నిధిధ్యాసనమ్"], పిమ్మట, 9. సంకల్పవికల్పరహితముగ అద్వయానందరూపానుభవము. ఈప్రకార మభ్యసించి ఆత్మానందము ననుభవించు జ్ఞాని ఇహమందే నిర్వాణ (జీవన్ముక్తి) సుఖము పొందును.

వి. షడ్విధలింగములు.— "ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతాఫలం, అర్థవాదోపపత్తిశ్చ లింగం తాత్పర్యనిర్ణయే," అనఁగా 1. ఉపక్రమోపసంహారములు, 2. అభ్యాసము

3. అపూర్వత్వము, 4. ఫలము, 5. అర్థవాదము, 6. ఉపపత్తి అనునవి. ఈలింగములచేత నుపనిషద్వాక్యములకు తాత్పర్య నిర్ణయము సేయుటవలన బ్రహ్మము అసంగమనియు, మాయికుఁడయిన ఈశ్వరుఁడు జగత్తును సృష్టించుచున్నాఁడనియుఁ దెలియఁబడును. లీనమర్థం 'గమయతీతి లింగం' అని నిర్వచనము.

యదోబ్ధవ్యం తవేదానీమాత్మానాత్మవివేచనమ్,
తదుచ్యతే మయా సమ్యక్ ఛ్రుత్వాత్మన్యవధారయ. 73

తా. శిష్యా! ఇపుడు నీవు తెలిసికొనవలసిన ఆత్మానాత్మ వివేచనమును జెప్పుచున్నాను. శ్రద్ధతో విని లెస్సగ మననము సేయుము.

అవ. స్థూలశరీరనిరూపణము:—

మజ్జాస్థిమేదఃపలరక్తచర్మ
త్వగాహ్వయైర్ధాతుభిరేభిరన్వితమ్,
పాదోరువక్షోభుజపృష్ఠమస్తకై
రంగైరుపాంగైరుపయుక్తమేతత్. 74

తా. ఈస్థూలశరీరము మజ్జ ఎముకలు మెదడు మాంసము రక్తము చర్మము త్వక్కు ననెడి సప్తధాతువులతోఁగూడి, పాదములు తొడలు ఱొమ్ము భుజములు వీపు శిరము ననెడి అవయవములతోడను, నేత్రాద్యుపాంగములతోడను గూడి యున్నది.

అహం మమేతి ప్రథితం శరీరం
మోహాస్పదం స్థూలమితీర్యతే బుధైః,

నభోనభస్వద్దహనాంబుభూమయః
సూక్ష్మాణి భూతాని భవన్తితాని, 75

పరస్పరాంశై ర్మిలితాని భూత్వా
స్థూలాని చ స్థూలశరీరహేతవః,

మాత్రా స్తదీయా విషయా భవన్తి
శబ్దాదయః పంచ సుఖాయ భోక్తుః. 76

తా. "నేను, నాది' యనెడి ప్రసిద్ధి కలిగి మోహాస్పద మయిన యీశరీరము స్థూలదేహమని విజ్ఞులు చెప్పెదరు. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి యనెడి సూక్ష్మభూతములు పంచీకరణమువలన నితరేతరభాగములతోఁ గూడి స్థూలభూతములై స్థూలశరీరహేతువు లగుచున్నవి. వాని అంశములే శబ్దాదివిషయాకారములై భోక్తయగు జీవునకు సుఖదుఃఖములను గూర్చుచున్నవి.

వి. పంచీకరణ మనఁగా పృథివ్యాదిపంచభూతములను రెండేసిభాగములుగఁ జేసి, తక్కిన అర్ధభాగములను నాలుగేసి భాగములుగఁజేసి, ఒక్కొక్కభూతముయొక్క అర్ధభాగమునకు తక్కినభూతములయొక్క అష్టభాగమును (సగములో నాల్గవ భాగమును) జేర్పఁగా నేర్పడిన భూతసమ్మేళనము:—

| | పృథివి | | జలము | | అగ్ని | | వాయువు | | ఆకాశము | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పృథివి | $\frac{1}{2}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | = | 1 |
| జలము | $\frac{1}{2}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | = | 1 |
| అగ్ని | $\frac{1}{2}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | = | 1 |
| వాయువు | $\frac{1}{2}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | = | 1 |
| ఆకాశము | $\frac{1}{2}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | + | $\frac{1}{8}$ | = | 1 |

స్థూలశరీరములోపల సూక్ష్మశరీరమును, సూక్ష్మశరీరములో కారణశరీరమును గలవు. ఈశరీరత్రయవిషయమై ముందుగ్రంథములో వివరింపఁబడుచున్నది. విశేషముగఁ దెలియఁ గోరువారలు శ్రీవేదాంతపంచదశిలోని తత్త్వవివేకప్రకరణమును జూడవలెను.

య ఏషు మూఢా విషయేషు బద్ధా
రాగోరుపాశేన సుదుర్దమేన,
ఆయాన్తి నిర్యాన్త్యథ ఊర్ధ్వముచ్చైః
స్వకర్మదూతేన జవేన నీతాః. 77

తా. ఏమూఢమానవులు శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయపంచకమం దనురాగ మనెడి దుర్దమ మగు పాశముచే బంధింపఁబడుదురో; వారలు కర్మ మనెడి దూతచేత వేగముగ నూర్ధ్వలోకములకు గెంటికొని పోఁబడి, మఱల నీలోకమునకు వచ్చుచున్నారు. అనఁగా ననేక యోనులందుఁబుట్టుచుఁ జచ్చుచు భవసాగరమున పడుచున్నారు. రాగపాశబద్ధు లగువారలకు జన్మరాహిత్యము కానేరదు.

శబ్దాదిభిః పంచభిరేవ పంచ
పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః,
కురంగ మాతంగ పతంగ మీన
భృంగా నరః పంచభిరంచితః కిమ్. 78

తా. కురంగము, కరి, మిడుత, మత్స్యము, తుమ్మెద యనునవి శబ్దాదివిషయములలో నొక్కొక్కవిషయమందు మాత్రమే రాగాధిక్యముగలిగి మరణము నొందుచున్నవి. ఎట్ల

నఁగా, లేడి వేణుగానమునకు భ్రమపడి పరుగిడిపోయి కిరాతుని వలలోఁజిక్కి శ్రవణేంద్రియముచేత మోసపోవుచున్నది. కరి (మగయేనుఁగు) కరిణి(ఆడయేనుఁగు)యొక్కకరస్పర్శకు భ్రమసి దానితోఁ బోయి గర్తములోఁబడి స్పర్శేంద్రియమువలన మోసపోవుచున్నది. మిడుత అగ్నిజ్వాలకు భ్రమజెంది మంటలోఁ బడి నయనేంద్రియముచేత మోసపోవుచున్నది. మీనము ఎఱలకు ఆశపడి గాలమునఁ జిక్కి రసనేంద్రియముచేత మోసపోవుచున్నది. భృంగము చంపకపుష్పపరిమళమున కాసజెంది ఘ్రాణేంద్రియమువలన ప్రాణములఁ గోల్పోవుచున్నది.శబ్దాదిపంచవిషయములచేతను ప్రేరేపింపఁబడు మనుష్యునిగతి యిఁక నే మని చెప్పవలెను ?

[అడవిలో క్రొత్తయేనుఁగును బట్టుటకు, లోఁతగు గర్తమును త్రవ్వి,దానిపై నివెదుళ్లను ఆకులలములు వేసి కప్పియుంచి, మచ్చికపడిన ఆడయేనుఁగును వదలిపెట్టుదురు. ఈ ఆడయేనుఁగును జూచి మగ యేనుఁగు దానితుండమును బట్టుకొనగా నాడయేనుఁగు గర్తము కేసి పరుగిడును మగయేనుఁగు దానిని వెంబడించి గర్తములో పడిపోవును.]

దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి,
విషం నిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షుషాప్యయమ్. 79

తా. శబ్దాదివిషయములు కాలసర్పవిషముకంటెను తీవ్రమయినవి. ఏలయనఁగా, సర్పవిషము దానిని తినినవానినే చంపును. శబ్దాదివిషయములన్ననో కంటితోఁ జూచినమాత్రముననే హతమొనరించును. అనఁగా విషయలోలత్వమువలన నజ్ఞానము నశింపక బంధహేతువగునని యభిప్రాయము.

విషయాశామహాపాశాద్యో విముక్తః సుదుస్త్యజాత్,
స ఏవ కల్పతే ముక్త్యై నాన్యః షట్ శాస్త్రవేద్యపి. 80

తా. విషయేచ్ఛ యనెడి ఛేదింప శక్యముగాని పెను త్రాటినుండి ఏపురుషుఁడు విముక్తుఁడగునో, వాఁడే మోక్షమున కర్హుఁడు. ఈవిషయపాశమునుండి విడిపించుకొనఁజాలని వాఁడు (విషయలోలుఁడు) షట్ శాస్త్రపండితుఁడయినను వానికి ముక్తి లభింపదు.

ఆపాతవైరాగ్యవతో ముముక్షూ౯
భవాబ్ధిపారం ప్రతియాతుముద్యతా౯,
ఆశాగ్రహో మజ్జయతేఽన్తరాళే
నిగృహ్య కణ్ఠే వినివర్త్య వేగాత్. 81

తా. మందవైరాగ్యముగల పురుషుఁడు భవసాగరమును దాటుటకు యత్నించునేని ఆశయనెడి మొసలి వానికంఠమును బట్టుకొని భవసాగరములో ముంచివేయును. అనఁగా సంపూర్ణ వైరాగ్యము కలుగనివానికి ముక్తిలేదని భావము.

వి. కొందఱు దారపుత్రాదులవల్లను, ఇతరకష్టముల వల్లను, సంసారబాధల కోర్వఁజాలక సన్న్యసింతురు, కాని వారల నాశాపిశాచము విడువదు. కొంద ఱుదరపోషణమునకును స్వనిష్ఠగుణప్రకటనకొఱకును నత్యంతవిరాగులవలె నటింతురు. ఇట్టివారలకు ముక్తివార్త శ్రవణమాత్రమే యగునని భావము.

విషయాఖ్యగ్రహో యేన సువిరక్త్యసినా హతః,
స గచ్ఛతి భవాంభోధేః పారం ప్రత్యూహవర్జితః. 82

తా. పరిపూర్ణవైరాగ్యమనెడి ఖడ్గముచే విషయవాసన యనెడి పెద్దమొసలిని ఎవఁడు నరికివేయఁగలఁడో వాఁడే సంసారసాగరమును నిర్విఘ్నముగ దాఁటఁగలఁడు.

విషమవిషయమార్గే గచ్ఛతోఽనచ్ఛబుద్ధేః
ప్రతిపదమభిఘాతో మృత్యురప్యేషవిద్ధి,
హితసుజనగురూక్త్యా గచ్ఛతః స్వస్య యుక్త్యా
ప్రభవతి ఫలసిద్ధిః సత్యమిత్యేష విద్ధి. 83

తా. శిష్యా! ఎవఁడు మందబుద్ధివలన కష్టసాధ్యమగు విషయరూపమార్గమునఁ బోవునో (విషయముల ననుభవించుచునే ముక్తికొఱకు యత్నించునో) వాఁడు అడుగడుగునను విపత్తులపాలై మృత్యువువాతఁబడును. తనమేలుగోరు సజ్జనుల యొక్కయు సద్గురూపదేశముల ననుసరించియు, స్వయముఁగ యోచించియు, విషయవాసనల మొదలంట నశింపఁజేసి జ్ఞానమార్గమునఁ బోవువాఁడు తప్పక ఫలసిద్ధి గాంచును. ఇది సత్యమని తెలిసికొనుము.

మోక్షస్య కాంక్షా యది వైతవాస్తి
త్యజాతిదూరాద్విషయాన్ విషం యథా,
పీయూషవత్తోషదయాక్షమార్జవ
ప్రశాన్తి దాన్తీన్ భజ నిత్యమాదరాత్. 84

తా. శిష్యా! సర్వానర్థములను దొలఁగించి నిత్యసుఖమునుగూర్చు మోక్షమునందు నీకు నిచ్ఛగలదేని, అనర్థదాయకమగు విషము నెటుల పరిహరింతువో యటులనే భవబంధహేతువులగు దేహాదివిషయములయం దాసక్తిని బూర్తిగ విడు

పుము. మఱియు, సంతోషము దయ క్షమ ఆర్జవము ప్రశాంతి దాంతి యను వీనిని అమృతమువలె నత్యంతాదరముతో భజింపుము.

వి. దేహము మొదలు అహంకారపర్యంతముగల దృ వస్తువులన్నియు విషయములే కనుక వీనిని విషమువలె పరిహరింపవలెను. అనఁగా విషయవాసన పూర్తిగ నశింపవలెను.

తోష మనఁగా నిత్యసంతోషము. దుఃఖమునకు వగపక నెల్లప్పుడు బ్రహ్మానందమందే మనస్సు లగ్నమై యుండుట.

దయ యనఁగా, భూతదయ. నిర్హేతుకముగ నెల్లపుడు సమస్తప్రాణులయొక్క హితమును గోరుచుండుట.

క్షమ యన సర్వసహనము.

ఆర్జవ మనఁగా ఋజుభావము. కుటిలతలేని సత్ప్రవర్తనము.

ప్రశాంతి యన కామక్రోధాదివృత్తులు ఉపశమించి సదా శాంతచిత్తముతో నుండుట.

దాంతి యన అంతరింద్రియబాహ్యేంద్రియనిగ్రహము గలిగి బ్రహ్మచర్యాదితపఃక్లేశముల నోర్చియుండుట.

అనుక్షణం యత్పరిహృత్య కృత్య
మనాద్యవిద్యాకృతబన్ధమోక్షణమ్,
దేహః పరార్థోఽయమముష్య పోషణే
యః సజ్జతే సః స్వమనేన హన్తి. 85

తా. అనాదియగు అవిద్యవలనఁ గలిగిన కర్తృత్వ భోక్తృత్వరూపబంధమునుండి విముక్తుఁడగుటకొఱకు, 'దేహ మెట్టిది? నే నెవఁడను? దేహమునకు నాకునుంగల సంబంధ

మెట్టిది?' అని విచారించి, దేహాభిమానమును విడిచి, ప్రతిక్షణ మును బ్రయత్నింపవలసిన బంధమోక్షోపాయము నుపేక్షించి, అనాత్మయగు దేహమును బోషించుకొనుటయందే ఆసక్తుఁడగు వాఁడు తనను తానే చంపుకొన్న వాఁడగును.

శరీరపోషణార్థీ సన్ య ఆత్మానం దిదృక్షతే,
గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి. 86

తా. ఏపురుషుఁడు శరీరపోషణాతత్పరుఁడై ఆత్మసాక్షా త్కారమును గోరునో వాఁడు మొసలిని తెప్పకొయ్యగాఁ బట్టుకొని నదిని దాటుటకు యత్నించు మూఢునివలె మోస పోవును.

మోహ ఏవ మహామృత్యు ర్ముముక్షో ర్వపురాదిషు,
మోహో వినిర్జితో యేన స ముక్తిపద మర్హతి. 87

తా. మోక్షార్థియగు పురుషునకు స్వశరీరమందును తత్సం బంధి దారపుత్రాదులయందునుగలమోహమే మహామృత్యువు. ఇట్టిమోహము నెవఁడు జయించునో వాఁడే ముక్తిపదమున కర్హుఁడు

మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు,
యం జిత్వా మునయో యాన్తి తద్విష్ణోః పరమం పదమ్.

తా. దేహమందును దారపుత్రాదులయందును గలుగు మోహమే మహామృత్యువు. కనుక నట్టిమోహమును జయింప వలెను. అట్టి మోహమును జయించియే మునులు విష్ణువు యొక్క పరమపదమును బొందుచున్నారు, అనఁగా ముక్తులగు చున్నారు. "విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః,

సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్." (బుద్ధి సారథిగను, మనస్సు పగ్గములుగను, తాను (సంసారి) తెరువరి గను నెవఁడుండునో వాఁడు కైవల్యమును బొందును) అని కఠోపనిషద్వాక్యము.

అవ. స్థూలశరీర గర్హణము:—

త్వఙ్మాంసరుధిరస్నాయుమేదోమజ్జాస్థిసంకులమ్,
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నింద్యమిదం వపుః.

తా. చర్మము, మాంసము, రక్తము, నరములు, మెదడు, మజ్జ, ఎముకలతోడను గూడి,మూత్రపురీషములతో నిండియుండు ఈస్థూలశరీరము మిక్కిలి హేయమయినది.

పంచీకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా;
సముత్పన్నమిదం స్థూలం భోగాయతనమాత్మనః.
అవస్థా జాగరస్తస్య స్థూలార్థానుభవో యతః. 90

తా. పృథివ్యాది పంచస్థూలభూతములయొక్క పంచీకరణమువల్లను బూర్వజన్మకృతకర్మవశమున నుత్పన్నమై, జీవాత్మకు భోగసాధనమయినది యీస్థూలదేహము. ఈస్థూలదేహాభిమానియగు జీవాత్మవిశ్వుఁ డనఁబడును. స్థూలార్థానుభవము గలిగిన యిది జాగ్రదవస్థ.

బాహ్యేన్ద్రియైః స్థూలపదార్థసేవాం
స్రక్చన్దనస్త్ర్యాదివిచిత్రరూపామ్,
కరోతి జీవః స్వయమేతదాత్మనా
తస్మాత్ప్రశస్తిర్వపుషోఽస్య జాగరే. 91

తా. జీవాత్మ యీస్థూలశరీరముతో తాదాత్మ్య భావము నొంది, చక్షురాది బాహ్యేంద్రియములద్వారా పుష్పమాలలు చందనము స్త్రీ మొదలగు ననేకస్థూలపదార్థములను సేవించు చుండును. అందువలన నీస్థూలదేహమునకు జాగ్రదవస్థయనెడి ప్రసిద్ధి కలిగినది.

సర్వోఽపి బాహ్యసంసారః పురుషస్య యదాశ్రయః,
విద్ధి దేహమిదం స్థూలం గృహవద్గృహమేధినః. 92

తా. శిష్యా! గృహస్థుఁడు గృహములో నివసించుచు బాహ్యసంసారము నెట్లు నిర్వర్తించునో, యట్లే జీవుఁ డీస్థూల శరీరము నాశ్రయించి, 'నేను చూచుచున్నాను వినుచున్నాను' అను నీ మొదలగు బాహ్యవ్యవహారమును జరుపుచుండునని తెలిసికొనుము.

అవ. స్థూలశరీరధర్మములను నిరూపించుచున్నారు:—

స్థూలస్య సంభవజరామరణాని ధర్మాః
స్థౌల్యాదయో బహువిధాః శిశుతాద్యవస్థాః,
వర్ణాశ్రమాదినియమా బహుధామయాః స్యుః
పూజావమానబహుమానముఖా విశేషాః. 93

తా. జన్మజరామరణములు, పెరుగుట చిక్కుట మొదలగునవియు, బాల్యయౌవనకౌమారవార్ధకావస్థలును, వర్ణాశ్రమాదినియమములును, నానావిధరోగానుభవము, ఇతరులచే పూజింపఁబడుట అవమానింపఁబడుట యీ మొదలగు విశేషములన్నియు స్థూలశరీరధర్మములు.

అవ. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ నిరూపణము:—

బుద్ధీన్ద్రియాణి శ్రవణం త్వగక్షి
ఘ్రాణం చ జిహ్వా విషయావబోధనాత్,
వాక్పాణి పాదా గుదమప్యుపస్థః
కర్మేన్ద్రియాణి ప్రవణేన కర్మసు. 94

తా. శ్రోత్రము, త్వక్కు, అక్షి, జిహ్వా, ఘ్రాణము ననెడి పంచేంద్రియములు క్రమముగ శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ననెడి పంచవిషయములను గ్రహించునుగనుక నివి జ్ఞానేంద్రియము లనఁబడును. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ యనునవి క్రమముగ వచన, దానాఽదాన, గమన, నిసర్గ, ఆనందాదికర్మప్రవృత్తము లగుట వలన కర్మేంద్రియము లనఁబడును.

అవ. అంతఃకరణవివరణము:—

నిగద్యతేఽన్తఃకరణం మనో ధీ
రహంకృతిశ్చిత్తమితి స్వవృత్తిభిః,
మనస్తు సంకల్పవికల్పనాదిభి
ర్బుద్ధిః పదార్థాధ్యవసాయధర్మతః. 95
అత్రాభిమానాదహమిత్యహంకృతిః
స్వార్థానుసంధానగుణేన చిత్తమ్. 96

తా. అంతఃకరణము వృత్తిభేదము ననుసరించి మనస్సు బుద్ధి అహంకారము చిత్తము నని నాల్గువిధములుగఁ జెప్పఁబడును. సంకల్పవికల్పములు మనోధర్మములు, పదార్థనిశ్చయము బుద్ధిధర్మము, నేను నాది యనెడి అభిమానము అహంకార ధర్మము, విషయచింతనము చిత్తధర్మము.

అవ. ప్రాణపంచకనిరూపణము:—

ప్రాణాపానవ్యానోదానసమానా భవత్యసౌ ప్రాణః,
స్వయమేవ వృత్తిభేదా ద్వికృతేర్భేదాత్సు వర్ణసలిలమివ. 97

తా. శరీరమంతకును ముఖ్యప్రాణము ఒక్కటే. అది వృత్తిభేదమునుబట్టియు, వికృతిభేదమునుబట్టియు, హృదయ స్థానమం దుండి ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమున 'ప్రాణ' మనియు, పాయుస్థానమందుండి మలమూత్రవిసర్జనముగావింపుచు 'అపాన' మనియు, శరీరమంతటను వ్యాపించినదై కన్నులు, చెవులు, కాలి మడమలు, పిఱుదులు, ముక్కు నను నీస్థానములయందుండి ప్రాణాపానవాయుసంచారమును గలుగఁజేయుచు 'వ్యాన' మనియు, కంఠస్థానమం దుండి వాయుకర్షణాఽకర్షణక్రియఁ గావించుచు 'ఉదాన' మనియు, నాభిప్రదేశమందుండి భుక్త పీతాన్నజలములను దేహమందంతటను సమముగ పంచుచు 'సమాన' మనియు నిట్లు పంచవిధములై, స్వర్ణము కటకకుండ లాదులుగ మాఱినట్లును, జలము భిన్నభిన్నప్రదేశముల భిన్న భిన్నరుచులు గలిగియుండునట్లును పరిణమించును.

అవ. ఇంతవఱకు స్థూలశరీరతద్ధర్మములను నిరూపించిరి. ఇఁకను సూక్ష్మశరీరతద్ధర్మములను నిరూపించుచున్నారు:—

వాగాదిపఞ్చ శ్రవణాదిపఞ్చ
ప్రాణాదిపఞ్చాభ్రముఖాని పఞ్చ
బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ
పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః. 98

తా. 1. వాగాది కర్మేంద్రియపంచకము, 2. శ్రవణాది జ్ఞానేంద్రియపంచకము, 3. ప్రాణాదివాయుపంచకము, 4. ఆకా

శాదిభూతపంచకము, 5. అంతఃకరణచతుష్టయము, 6. అవిద్య, 7. కామము, 8. కర్మము నను నీయెనిమిదియును గూడి పురశ్చష్టక మనఁబడును. ఇదియె సూక్ష్మశరీరము. (విశేషముగఁ దెలియఁ గోరువారు శ్రీవేదాంతపంచదశి, తత్త్వవివేక ప్రకరణమును జూడ వగును).

ఇదం శరీరం శ్రృణు సూక్ష్మసంజ్ఞితం
లింగం త్వపంచీకృతభూతసంభవమ్,
సవాసనం కర్మఫలానుభావకం
స్వాజ్ఞానతోఽనాదిరుపాధిరాత్మనః. 99

తా. శిష్యా! వినుము. ఈ సూక్ష్మశరీరము అపంచీకృతపంచభూతసమ్మేళనమువలన నుత్పన్నమై, పూర్వవాసనా (సంస్కార) సహితమై, సుఖదుఃఖరూపకర్మఫలముల ననుభవించునదియై అజ్ఞానమువలన, అనఁగా బ్రహ్మభావమును బొందకపోవుటచేత, జీవునకు ప్రవాహరూపాఽనాద్యుపాధి యగుచు లింగశరీర మనియుఁ జెప్పఁబడును.

స్వప్నో భవత్యస్య విభక్త్యవస్థా
స్వమాత్రశేషేణ విభాతి యత్ర
స్వప్నే తు బుద్ధిః స్వయమేవ జాగ్ర
త్కాలీననానావిధవాసనాభిః,
కర్త్రాదిభావం ప్రతిపద్య రాజతే
యత్ర స్వయం భాతి హ్యయం పరాత్మా. 100
ధీమాత్రకోపాధిరశేషసాక్షీ
న లిప్యతే తత్కృతకర్మలేపైః,

యస్మాదసంగ స్తత ఏవ కర్మభి
ర్న లిప్యతే కించిదుపాధినా కృతైః. 101

తా. జీవునియొక్క యీవిభక్త్యవస్థ (సూక్ష్మశరీరావస్థ) స్వప్న మనఁబడును. ఈస్వప్నావస్థయందు సూక్ష్మశరీరము మాత్రమే శేషించియుండి ప్రకాశించుచుండును. స్వప్నమందు బుద్ధి జాగ్రదవస్థయం దనుభవించిన విషయములయొక్క నానా ప్రకారసంస్కారములచే కర్తృత్వాదిభావములను జెంది స్వయముగ ప్రకాశించును. ఆసమయమందు ప్రత్యగాత్మ (ఇతర ప్రకాశాపేక్ష లేకయే) స్వయంప్రకాశుఁడై, బుద్ధిమాత్రమే యుపాధిగాఁ గలిగి సమస్తభావమునకు సాక్షీభూతుఁడై, ఉపాధికృత కర్మములచేఁ దాకఁబడఁడు. ఈ హేతువువలన ఆత్మ అసంగుఁడు, ఉపాధి (బుద్ధి) కృతకర్మ లేశములచే నెంతమాత్రము లిప్తుఁడు కాఁడు.

సర్వవ్యాపృతికరణం లింగమిదం స్యాచ్చిదాత్మనః పుంసః,
వాస్యాదికమివ తక్ష్ణస్తేనై వాత్మా భవత్యసంగోఽయమ్. 102

తా. వడ్రంగికి బాడిస మొదలగు పనిముట్లవలె, చిదాత్మ (ప్రత్యగాత్మ) కు దర్శనశ్రవణాదిసర్వవ్యాపారములందును లింగశరీరము సాధనము కనుక జీవసాక్షి యగు ఆత్మ అసంగుఁడు.

అన్ధత్వమన్దత్వపటుత్వధర్మాః
సౌగుణ్యవైగుణ్యవశాద్ధి చక్షుషః,
బాధిర్యమూకత్వముఖా స్తథైవ
శ్రోత్రాదిధర్మా నతు వేతురాత్మనః. 103

తా. అంధత్వము, మందదృష్టి, స్ఫుటదృష్టి యనునవి నేత్రములయొక్క దోషాదోషములతో సంబంధించినవిగాని ఆత్మకుసంబంధించినవి కావు. అలాగుననే బాధిర్యమూకత్వాదులు శ్రోత్రాదులయొక్క దోషములతో సంబంధించినవిగాని ఆత్మ వికారములు కావు. ఆత్మ నిస్సంగుఁడు గనుక నింద్రియాదివ్యాపారములతో ఆత్మకు సంబంధము లే దని భావము.

ఉచ్ఛ్వాసనిశ్శ్వాసవిజృంభణక్షు
త్ప్రస్పన్దనాద్యుత్క్రమణాదికాః క్రియాః,
ప్రాణాదికర్మాణి వదన్తి తజ్ఞాః
ప్రాణస్య ధర్మావశనాపిపాసే. 104

తా. ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు, ఆవులింతలు, ఆఁకలి, కదలుట, లేచుట మొదలగు క్రియలును ప్రాణాదిపంచవాయువుల యొక్క వ్యాపారములని పండితులు చెప్పెదరు. ఆఁకలి దప్పియు ప్రాణధర్మములు.

అంతఃకరణమేతేషు చక్షురాదిషు వర్ష్మణి,
అహమిత్యభిమానేన తిష్ఠత్యాభాసతేజసా. 105
అహంకారః స విజ్ఞేయః కర్తా భోక్తాభిమాన్యయమ్,
సత్వాదిగుణయోగేనావస్థాత్రితయమశ్నుతే. 106

తా. అంతఃకరణము స్థూలశరీరమందును చక్షురాదీంద్రియములందును అహం ద్రష్టా, అహం శ్రోతా, అహం గంతా (నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను, నేను పోవుచున్నాను) ఇత్యాద్యభిమానముతో కూటస్థాత్మాభాస వలన ప్రకాశించుచున్నది. అనఁగా కూటస్థాభాసలేని కేవల

భౌతికాంతఃకరణము జడ మగుటచే స్వయముగఁ బ్రకాశింపఁజాలదు. అందువలన ఆత్మాభాసలేని కేవలభౌతికాంతఃకరణము అంతఃకరణమనియు, ఆత్మాభాసగల అంతఃకరణము ప్రమాత యనియుఁ జెప్పఁబడును. (ఇట్లు శ్రీమదాచార్యుల వారి పరిభాష).

కర్తృత్వ భోక్తృత్వాభిమాని యగు నా ప్రమాతయే అహంకారశబ్దవాచ్యుఁడు. ఆ ప్రమాత సత్త్వరజస్తమోగుణ సంబంధమువలన (తాదాత్మ్యాధ్యాసమువలన) అవస్థాత్రయమును బొందుచున్నాఁడు. అనఁగా, జాగ్రదవస్థయందు సత్త్వగుణము ప్రధానముగఁగలిగి, విశ్వుఁడనఁబడి స్థూలశబ్దాదివిషయములను భోగించును. స్వప్నావస్థయందు రజోగుణము ప్రధానముగఁ గలిగి, తైజసుఁ డనఁబడి మనఃకల్పితశబ్దాదివిషయములను భోగించును. సుషుప్త్యవస్థయందు తమోగుణము ప్రధానముగఁ గలిగి, ప్రాజ్ఞుఁ డనఁబడి అవిద్యావృతస్వరూపానందము ననుభవించును.

విషయాణామానుకూల్యే సుఖీ దుఃఖీ విపర్యయే,
సుఖం దుఃఖం చ తద్ధర్మః సదానన్దస్య నాత్మనః. 107

తా. అనుకూలవిషయప్రాప్తివలన 'అహం సుఖీ' (నేను సుఖిని) అనియు, ప్రతికూలవిషయసంబంధమువలన 'అహం దుఃఖీ' (నేను దుఃఖితుఁడను) అనియు వ్యవహరించును. సుఖదుఃఖములు అంతఃకరణధర్మములు. నిత్యానందస్వరూపుఁడగు ఆత్మకు సుఖదుఃఖములు లేవు.

ఆత్మార్థత్వేన హి ప్రేయాన్విషయో న స్వతః ప్రియః,
స్వత ఏవ హి సర్వేషామాత్మా ప్రియతమో యతః. 108

తా. విషయములయందు ఆత్మీయబుద్ధి కలిగినపుడావిష యములు ప్రియముగఁ దోఁచును. విషయములను ప్రేమించుట ఆత్మకొఱకేకాని విషయములు తమంతట స్వరూపముచేతఁ బ్రియమైనవికావు. ఆహేతువువలన నెల్లరకు స్వరూపమగు ఆత్మయే ప్రియతమము. (ఇచట "న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయపతిః ప్రియో భవతి," ఇత్యాదిశ్రుతులు ప్రమాణము. విశేషముగఁ దెలియఁగోరువారలు శ్రీవేదాంతపంచదశిలోని ఆత్మానందప్రకరణమును జూడవలెను.)

తత ఆత్మా సదానన్దో నాస్య దుఃఖం కదాచన,
యత్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానన్దోఽనుభూయతే.
శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానం చ జాగ్రతి. 109

తా. ఆహేతువువలన ఆత్మ సర్వదా ఆనందస్వరూపుఁడు. వానికి ఆధ్యాత్మికాదితాపములతో నెప్పుడును సంబంధము లేదు. సుషుప్త్యవస్థయందు సర్వవిషయశూన్యమై సుఖవిశేషానుభవము కలుగుచున్నది. అదియే ఆత్మానందము. ఇట్టి ఆత్మానందస్వరూపమును ప్రత్యక్షముచేతను, ఐతిహ్యమువలనను, అనుమానప్రమాణముచేతను దెలియనగు నని శ్రుతి చెప్పుచున్నది.

వి. గాఢనిద్రయందు సకలేంద్రియ వ్యాపారశూన్యమై జీవుఁడు కారణశరీరమందు అజ్ఞానావృతస్వరూపానందము ననుభవించును. కావుననే నిద్రనుండి మేల్కొనినవాఁడు 'నిదురలో నేనేమియు నెఱుఁగను. హాయిగా నిదురించితిని' అని చెప్పును. ఇందువలన సుషుప్తియందు నిర్విషయానందము గల దనియు,

విషయములు ప్రియములు కావనియుఁ దేలుచున్నది. ఇది ప్రత్యక్షప్రమాణము.

ఒక వటవృక్షముమీఁద బ్రహ్మరక్షస్సు గలదని పితృపితామహులనాటనుండియు ప్రతీతియుండుటవలన ఆవటవృక్షము దరికి నెవ్వరును బోవరు. అట్లే వృద్ధపరంపరగా సుషుప్తియందు సుఖము గలదని తెలిసికొనుట ఐతిహ్యము.

నిదురపోయి మేలుకొనినవాఁడు హాయిగా నిదురించితి నని చెప్పుట సర్వజనానుభవమే. కనుక నిదురయం దానందము గల దని తెలిసికొనుట అనుమానప్రమాణము.

అవ. మాయాస్వరూపమును వివరించుచున్నారు:—

అవ్యక్తనామ్నీ పరమేశశక్తి
రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా,
కార్యానుమేయా సుధియైవ మాయా
యయా జగత్సర్వమిదం ప్రసూయతే. 110

తా. అవ్యక్త మనుపేరుగల పరమేశ్వరుని శక్తి (మూలప్రకృతి) మాయ యనియు అవిద్య యనియుఁ జెప్పఁబడును. ఇది అనాదియైనదై, కార్యవర్గమునకు పరమైనదై, సత్త్వరజస్తమోగుణవిశిష్టమై, తత్త్వజ్ఞులవలన కార్యమునుబట్టి యూహింపఁబడఁదగినది. ఈమాయనుండియే చరాచరరూపమగు సర్వప్రపంచము నుత్పన్నమగుచున్నది.

వి. మూలప్రకృతి బ్రహ్మముతోఁగూడినపుడు మాయ యనఁబడి సత్త్వగుణప్రధానయై జ్ఞానసాధనమగును. జీవునితోఁ గూడినపుడు అవిద్య యనఁబడి రజస్తమోగుణప్రధానయై సంసారకారణ మగును. అని తత్త్వజ్ఞులు నుడువుదురు.

సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో
భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో,
సాంగాప్యనంగాప్యుభయాత్మికా నో
మహాద్భుతా నిర్వాచనీయరూపా. 111

తా. ఈమాయాస్వరూప మెట్టిది యన, అది సద్రూప మునుగాదు అసద్రూపమునుగాదు. అనఁగా నిజముగా నున్న దియుంగాదు లేనిదియునుగాదు. ఏలయన, అజ్ఞానులకుఁ గనఁబడు చున్నను జ్ఞానదృష్టిచే లేనిదే యగుచున్నది. మఱియు సదసద్రూప మును గాదు. చైతన్యముకంటె వేఱైనదియుఁ గాదు. చైతన్యా భిన్నమునుగాదు. అనఁగా నీమాయ జడత్వము-చిద్రూపత్వము, ఆనందత్వము-అనానందత్వము, సద్వితీయత్వము-అద్వితీయత్వము, ఇత్యాదికధర్మములుగల భేదాభేదరూపము గలది. భిన్నాఽభిన్న రూపమునుగాదు. అవయవజన్యరూపముగలదియుఁగాదు. అంగ రహితమైనదియుఁగాదు. ఉభయమునుగాదు. కావున నీమాయ మహాద్భుతమగు అనిర్వాచనీయరూపము గలది.

అవ. అవిద్యానివర్తనోపాయమును దృష్టాంతపూర్వక ముగ సూచించుచున్నారు:—

శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ్యా
సర్పభ్రమో రజ్జువివేకతో యథా,
రజస్తమః సత్త్వమితి ప్రసిద్ధా
గుణాస్తదీయాః ప్రథితైః స్వకార్యైః. 112

తా. కనుచీఁకటివేళ త్రాటినిఁ జూచి యది సర్పమనుకొని భ్రమఁ జెందినపుడు దీపసహాయమున-అది సర్పము కాదు త్రాడు మాత్రమే యని తెలిసికొనఁగా సర్పభ్రాంతి తొలఁగును.

ఆ ప్రకారముననే సద్గురూపాదిష్టమార్గమున అవిద్యామలరహిత మగు అద్వితీయబ్రహ్మవస్తువును అపరోక్షజ్ఞానమువలనఁ దెలిసికొనఁగా మాయనశించును. సత్త్వరజస్తమములు మాయయొక్క గుణములు. తెలుపు ఎఱుపు నలుపు వర్ణములుగల నూలుదారములతో నేఁబడిన త్రాటివలె మాయ యీత్రిగుణములతో మిశ్రమై యుండును. వానివాని కార్యముల ననుసరించి యీత్రిగుణములును దెలియఁబడును. ఎట్లనఁగా, ప్రసన్నచిత్తముగలిగి శాంతముతో నుండునపుడు సత్వగుణము ప్రధానముగ నుండి రజస్తమములు తగ్గియుండును. చంచలచిత్తముతో క్రోధాది వికారములు గలిగియుండునపుడు రజోగుణము ప్రకట మగును. నిద్రాలస్యాది దోషములతోఁ గూడియుండునపుడు తమోగుణము ప్రధానమైయుండి తక్కినగుణములు తగ్గియుండును.

అవ. అవిద్యావిభాగనిరూపణము. విక్షేపశక్తివివరణము:—

విక్షేపశక్తీ రజసః క్రియాత్మికా
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ,
రాగాదయోఽస్యాః ప్రభవన్తి నిత్యం
దుఃఖాదయో యే మనసో వికారాః. 113

తా. ఈ త్రిగుణములలో క్రియారూపమును దాల్చునది రజోగుణము. ఇది మాయయొక్క 'విక్షేపశక్తి' యనఁబడును. ఇది అనాదియై దీనినుండియే సకలసృష్టియు, మనుష్యులకుఁ బ్రవృత్తియు గలుగును. మనోవికారములగు రాగద్వేషాదులును సుఖదుఃఖాదులును విక్షేపశక్తియొక్క కార్యములు.

కామః క్రోధో లోభ దంభాభ్యసూయాఽ
హంకారేర్ష్యామత్సరాద్యాస్తు ఘోరాః,
ధర్మా ఏతే రాజసాః పుంప్రవృత్తి
రస్మాదేత త్తద్రజో బన్ధహేతుః. 114

తా. కామము (విషయవాసన), క్రోధము, లోభము, దంభము, అసూయ, అహంకారము, ఈర్ష్య, మత్సరము నను నీ మొదలగుభయానకవృత్తులు రజోగుణధర్మములు. దీనికి వశుఁడగు పురుషునకు ప్రవృత్తి కలుగును, కనుక రజోగుణము బంధహేతువు.

అవ. అవిద్యయొక్క ఆవరణశక్తిని నిరూపించుచున్నారు:—

ఏషావృతిర్నామ తమోగుణస్య
శక్తిర్యయా వస్త్వవభాసతేఽన్యథా
సైషా నిదానం పురుషస్య సంసృతే
ర్విక్షేపశక్తేః ప్రసరస్య హేతుః. 115

తా. మాయయొక్క తమోగుణము 'ఆవరణశక్తి' యనఁబడును. వస్తువుయొక్క యథార్థరూపమును మాటుపఱిచి దానిని మఱియొకరూపముగఁ దోఁచునట్లుచేయుట ఆవరణశక్తియొక్క కార్యము. ఇదియే జీవునకు సంసారకారణమున్ను, విక్షేపశక్తి (కామక్రోధాదులతో ప్రవాహరూపముగ) వ్యాపించుటకుఁ గారణమున్ను అగును.

ప్రజ్ఞావానపి పణ్డితోఽపి చతురోఽప్యత్యన్తసూక్ష్మార్థదృ
గ్వ్యాలీఢస్తమసా నవేత్తి బహుధా సంబోధితోఽపిస్ఫుటమ్,

భ్రాన్త్యారోపితమేవ సాధు కలయత్యాలంబతే తద్గుణా-
హన్తాసౌ ప్రబలా దురన్త తమసః శక్తిర్మహత్యావృతిః.

తా. తమోగుణప్రధాన యగు ఆవరణశక్తియొక్క ప్రభావ మే మని చెప్పవచ్చును? ఎంతబుద్ధిశాలియైనను,ఎంతపండితుఁడయినను, విద్యయం దెంత చతురుఁడైనను, ఎంత సూక్ష్మదృష్టిగలవాఁ డయినను తమోరూపావరణశక్తిచే నాచ్ఛాదింపఁబడినవాఁడు(తమోగుణరహితుఁడుగానివాఁడు) పలుమాఱు శ్రుతి, స్మృతి, యుక్తి, అనుభవములచేత స్ఫుటముగ బోధింపఁబడియు, స్వస్వరూపము నెఱుఁగఁజాలక, భ్రాంతిచే నారోపింపఁబడిన అసద్వస్తువే (దేహాదిప్రపంచమే) సత్య మని నమ్మి దానిగుణములనే అవలంబించును. అందువలన వానికి ఆత్మజ్ఞానము కలుగదు; సంసారదుఃఖమును వదలదు. దురంత మగు నీయావరణశక్తి మిగుల ప్రబల మయినది.

అభావనా వా విపరీతభావనా
సంభావనావిప్రతిపత్తిరస్యాః,
సంసర్గయుక్తం న విముఞ్చతి ధ్రువం
విక్షేపశక్తిః క్షపయత్యజస్రమ్. 117

తా. కూటస్థుఁడు లేఁ డనుకొనుట, దేహమే ఆత్మయనుకొనుట, గురూపదిష్టార్థమం దవిశ్వాసము ననునవి ఆవరణశక్తి కార్యములు. ఈయావరణశక్తి సత్యవస్తువును గప్పిపుచ్చగా విక్షేపశక్తి అసద్వస్తువులందు మోహము గలిగించి సంసారదుఃఖమునఁ గూల్చును.

వి. సత్యవస్తువు లేదనుకొనుట అభావన, అసత్యవస్తువును సత్యవస్తువుగ భావించుట విపరీతభావన, గురూపదిష్టసత్యవస్తు

జ్ఞానమగు సంభావన ఇట్లగునో కాదో యని శంకించుట సంభావ నావిప్రతిపత్తి (అసంభావన). ఈమూఁడును ఆవరణసంసక్తిగలవానిని విడువవు. ఈదోషత్రయముతోఁగూడిన ఆవరణశక్తిచేఁ గప్పఁబడినవానిని విక్షేపశక్తి సంసారదుఃఖమునఁ గూల్చును.

అజ్ఞానమాలస్యజడత్వనిద్రా
ప్రమాదమూఢత్వముఖా స్తమోగుణాః,
ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కించి
న్నిద్రాలువత్ స్తంభవదేవ తిష్ఠతి. 118

తా. అవివేకము, బద్ధకము, జడత్వము, నిద్ర, అజాగ్రత, మూఢత్వము మొదలగునవి తమోగుణధర్మములు. ఈగుణములు గలవానికి జ్ఞాన మెంతమాత్రమును గలుగదు. అట్టివాఁడు నిద్రించువానివలెను స్తంభమువలెను జడుఁడై యుండెను.

అవ. "సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్" అనెడి భగవద్వచనానుసారముగ లింగశరీరగత సత్త్వగుణప్రభావరూపమువలన సర్వాత్మజ్ఞానమున్ను పదార్థజ్ఞానమున్ను అవశ్యముగఁగలుగు నని చెప్పుచున్నారు:—

సత్త్వం విశుద్ధం జలవత్తథాపి
తాభ్యాం మిళిత్వా శరణాయ కల్పతే,
యత్రాత్మబింబః ప్రతిబింబితః సన్
ప్రకాశయత్యర్క ఇవాఖిలం జడమ్. 119

తా. శుద్ధజలమువంటి సత్త్వగుణము ప్రధానముగ(విశేషముగ) నుండి స్వల్పముగ రజస్తమోగుణమిశ్రమైయుండినను అది లింగశరీరయోగ్య మగును. అట్టి సత్త్వగుణప్రధాన మగు

బుద్ధియందు ప్రతిఫలించిన ఆత్మబింబము, సూర్యుఁ డఖిలజగత్తును బ్రకాశింపఁజేయునటుల, జడములగు సకలవృత్తులను బ్రకాశింపఁజేయును.

అవ. మిశ్రసత్త్వగుణ ధర్మములను వివరించుచున్నారు:-

మిశ్రస్య సత్త్వస్య భవన్తి ధర్మాః
స్త్వమానితాద్యా నియమా యమాద్యాః,
శ్రద్ధా చ భక్తిశ్చ ముముక్షుతా చ
దైవీ చ సంపత్తిరసన్నివృత్తిః. 120

తా. స్వమానిత్వము అనఁగా స్వనిష్ఠగుణముల నితరులు ప్రశంసించునపుడు అభిమానము లేకుండుట, అహింసాదిపంచనియమములు, యమనియమాదులు, శ్రద్ధ, భక్తి, ముముక్షుత్వము, అహింసా సత్యాక్రోధాది దైవీసంపద్గుణములు, అసన్నివృత్తి - అనఁగా మాయాకల్పితదేహేంద్రియాదికము ఆత్మకా దని యుపేక్షించుట, యనునివి రజస్తమోగుణమిశ్రమగు సత్త్వగుణధర్మములు.

అవ. శుద్ధసత్త్వగుణములను విశదీకరించుచున్నారు:—

విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః,
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా సదానన్దరసం సమృచ్ఛతి. 121

తా. (రజస్తమోగుణమిశ్రముగాని) శుద్ధసత్త్వగుణము లెవ్వి యనఁగా ప్రసన్నత, స్వాత్మానుభవము (అహం బ్రహ్మాస్మి యనెడి అపరోక్షజ్ఞానము), పరమప్రశాంతి, నిత్యసంతోషము,

[నిత్యతృప్తి], ప్రహర్షము [పరమాత్మసాక్షాత్కారమువలనఁ గలిగిన నిరతిశయానందము], పరమాత్మనిష్ఠ యనునవి వీనివలన నుత్కృష్ట మగు సచ్చిదానందసానుభవము కలుగును.

౹౹వ. కారణశరీరనిరూపణము, కారణ సూక్ష్మశరీరము లకుఁగల తారతమ్యము:—

అవ్యక్తమేతత్త్రిగుణైర్నిరుక్తం
తత్కారణం నామ శరీరమాత్మనః,
సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా
ప్రలీనసర్వేన్ద్రియబుద్ధివృత్తిః. 122

తా. సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థ 'అవ్యక్త' మనఁబడును. ఈ అవ్యక్తమే ప్రకృతి యనఁబడి ఆత్మకు కారణశరీర మగును. కారణశరీరముయొక్క మానసేంద్రియాదిరహితావస్థ సుషుప్తి యనఁబడును. అనఁగా, సుషుప్తి యందు సకలేంద్రియములును బుద్ధివృత్తులును ప్రలీనమై కారణ రూపస్థితినిఁ బొందియుండును.

సర్వప్రకారప్రమితిప్రశాన్తి
ర్బీజాత్మనాఽవస్థితి రేవ బుద్ధేః,
సుషుప్తిరస్త్రాస్య కిల ప్రతీతిః
కించిన్న వేద్మీతి జగత్ప్రసిద్ధేః. 123

తా. సర్వవిధజ్ఞానమున్ను ప్రశాంతినిఁబొంది, బుద్ధి బీజ రూపముగ నణఁగి యుండుటయె సుషుప్తి యనఁబడును. దీనికిఁ బ్రమాణ మే మనఁగా, నిద్రనుండి మేల్కొనినవాఁడు 'నా కేమియుఁ దెలియదు, సుఖముగ నిదురించితి' నని చెప్పుచుండుట లోకానుభవమే.

అవ. అనాత్మవస్తునిరూపణము:—

దేహేన్ద్రియప్రాణమనోఽహమాదయః
సర్వే వికారా విషయాః సుఖాదయః,
వ్యోమాదిభూతాన్యఖిలం చ విశ్వ
మవ్యక్తపర్యన్త మిదం హ్యనాత్మా. 124

తా. స్థూలశరీరము, దశేంద్రియములు, పంచప్రాణములు, అహంకారము, మనస్సు, బుద్ధి, సుఖదుఃఖాదివిషయములు, అంతఃకరణపరిణామము లగు రాగేచ్ఛాదులు, పృథివ్యాది పంచభూతములు, సమష్టివ్యష్టిరూపసకల ప్రపంచము, అవ్యక్తము [మూలావిద్య] మొదలు స్థూలదేహపర్యంతమును గల సర్వదృశ్యవస్తువులును అనాత్మవస్తువులు అని తెలిసికొనవలెను.

మాయా మాయాకార్యం సర్వం మహదాదిదేహపర్యన్తమ్,
అసదిదమనాత్మకం[1] త్వం విద్ధి మరుమరీచికాకల్పమ్. 125

తా. శిష్యా, మహత్తు మొదలు దేహపర్యంతమును గల మాయాకల్పిత మగు సకలప్రపంచమున్ను మాయయు, అసత్తనియు [మిథ్య యనియు], అనాత్మక మనియుఁ దెలిసికొనుము. ఎండమావులందు జలము లేనిదే జల మున్నట్లు ఎట్లగపడుచున్నదో, అట్లే పరిపూర్ణాత్మయందు మాయవలనఁ గల్పింపఁబడిన యీజగము మిథ్య యయ్యును భ్రాంతివలన నున్నట్లే తోఁచుచున్నది.

అవ. ఇఁకను స్వాఽభిన్నరూపజ్ఞేయవస్తువును నిరూపించుచున్నారు:—

1 అనాత్మతత్త్వం విద్ధి.

అథ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః,
యద్విజ్ఞాయ నరో బన్ధాన్ముక్తః కైవల్యమశ్నుతే. 126

తా. శిష్యా! ఇట్లనాత్మస్వరూపమును నిరూపించి యుంటిమి. ఇఁకను పరమాత్మస్వరూపమును బోధించుచున్నాము. ఆపరమాత్మస్వరూపమును యథార్థముగఁ దెలిసికొనిన నరుఁడు బంధవిముక్తుఁడై కైవల్యమును పొందును.

అస్తి కశ్చిత్ స్వయం నిత్యమహంప్రత్యయా[1]లంబనః,
అవస్థాత్రయసాక్షీ సన్ పంచకోశవిలక్షణః. 127

తా. అహంప్రత్యయముచే [నేను అని) తెలియఁబడుచు, నిత్యమై, జాగ్రదాద్యవస్థలకు సాక్షియై, అన్నమయాదిపంచకోశములకు విలక్షణుఁడై, సర్వప్రకాశకుఁడగు పరమాత్మ యొకఁడు గలడు.

యో విజానాతి సకలం జాగ్రత్స్వప్నసుషుప్తిషు,
బుద్ధితద్వృత్తి సద్భావమభావమహమిత్యయమ్. 128

తా. ఆ అహంప్రత్యయగోచరుఁ డగు పరమాత్మ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందు బుద్ధియొక్కయు బుద్ధివృత్తుల యొక్కయు సద్భావములను అభావములను అహం [నేను] అని తెలిసికొనుచున్నాఁడు.

యః పశ్యతి స్వయం సర్వం యం న పశ్యతి కశ్చన,
యశ్చేతయతి బుద్ధ్యాది న తు యం చేతయత్యయమ్. 129

తా. ఆయాత్మ సర్వమునుస్వయముగఁ జూచుచున్నాఁడు. వాని నెవ్వఁడును జూడఁజాలఁడు. వాఁడే బుద్ధ్యాదిసకలజడపదార్థములకు చైతన్యమును గలిగించి వానిని వ్యవహారక్షమ

1 గోచరః.

ముగఁ జేయుచున్నాఁడు. ఇతర మెద్దియు నాస్వయంప్రకాశా త్మకుఁ జైతన్యమును గలిగింపఁజాలదు.

యేన విశ్వమిదం వ్యాప్తం యన్న వ్యాప్నోతి కించన,
ఆభారూపమిదం సర్వం యం భాన్త మనుభాత్యయమ్. 130

తా. వానిచైతన్యముచేతనే సర్వప్రపంచము వ్యాపింపఁబడియున్నది. వాని నెద్దియు వ్యాపింప (ప్రకాశింప)ఁ జేయఁజాలదు. నామరూపాత్మకమగు నీసర్వప్రపంచము ఆభారూపము, అనఁగా ప్రకాశింపఁబడఁదగినదిగాని స్వయముగ ప్రకాశింపఁజాలదు. కనుక నీప్రపంచము ఆత్మప్రకాశముచేతనే ప్రకాశింపఁబడుచు తాను ప్రకాశించుచున్నది.

వి. ఆత్మ ఉపాదనము, ప్రపంచ ముపాదేయము నని భావము. ఇచట "అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్," "మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా," "మత్థ్సాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః" అనెడి స్మృతులును, "తేనేదం పూరితం పురుషేణ సర్వమ్," ఇత్యాది శ్రుతులును ప్రమాణము.

యస్య సన్నిధిమాత్రేణ దేహేన్ద్రియమనోధియః,
విషయేషు స్వకీయేషు వర్తన్తే ప్రేరితా ఇవ. 131

తా. ఆయాత్మయొక్క సన్నిధిమాత్రాన దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి యనునవి వానివానివిషయములందు (వ్యాపారములందు)ఁ బ్రేరింపఁబడినవానివలె ప్రవర్తించుచున్నవి.

అహంకారాదిదేహాన్తా విషయాశ్చ సుఖాదయః,
వేద్యన్తే ఘటవద్యేన నిత్యబోధస్వరూపిణా. 132

తా. నిత్యబోధ (జ్ఞాన) స్వరూపుఁడగు నాసచ్చిదానంద రూపపరమాత్మయొక్క కృపచేత (జడములగు) అహంకారాది దేహపర్యంతముగల సర్వవిషయములును సుఖాదికవిషయము లును ఘటములవలెఁ దెలియఁబడుచున్నవి. అనఁగా దేహాదిసర్వ విషయములును జడములు గనుక పరమాత్మయొక్క ప్రకాశ ముచేఁ బ్రకాశింపఁబడి చక్షురాదీంద్రియములవలనఁ దెలియఁ బడుచున్నవి.

ఏషోఽన్తరాత్మా పురుషః పురాణో
నిరన్తరాఖణ్డసుఖానుభూతిః,
సదైకరూపః ప్రతిబోధమాత్రో
యేనేషితా వాగసవశ్చరన్తి. 133

తా. ఈ అంతరాత్మ నిరంతరాఖండసుఖానుభవస్వరూ పుఁడు. పురాణపురుషుఁడు. ఏమార్పులులేని బోధస్వరూపుఁడు. జడములగుమనోవాగింద్రియములు ఈయాత్మసాన్నిధ్యమువలన స్వస్వవ్యాపారములను జేయఁగలుగుచున్నవి.

అత్రైవ సత్త్వాత్మని ధీగుహాయా
మవ్యాకృతాకాశ ఉరుప్రకాశః,
ఆకాశ ఉచ్చై రవివత్ప్రకాశతే
స్వతేజసా విశ్వమిదం ప్రకాశయన్. 134

తా. సత్త్వగుణరూప బుద్ధిగుహయందు చిదాకాశము (సూక్ష్మాకాశము) ఉజ్జ్వలముగఁ బ్రకాశించుచుండును. అనఁగా మనస్సు నిర్మలమై బుద్ధి రజస్తమోగుణరహితమై కేవలసత్త్వ గుణప్రధానమై చిదాకాశమాత్రస్థితి గలిగి యుండునపుడు

ఆత్మ కూటస్థుఁ డనియు సాక్షి యనియుఁ జెప్పఁబడును. చిదాకాశోపరిభాగమున నీకూటస్థుఁడు (ప్రత్యగాత్మ) ఆకాశమందు సూర్యునివలె, స్థావరజంగమరూపసకలప్రపంచమును తన తేజస్సుచేఁ బ్రకాశింపఁజేయుచుఁ దానును ప్రకాశించుచుండును. ఇచట, "తస్య భాసా సర్వమిదం విభాతి," "జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే." ఇత్యాది శ్రుతిస్మృతివాక్యములు ప్రమాణము.

> జ్ఞాతా మనోఽహంకృతివిక్రియాణాం
> దేహేన్ద్రియప్రాణకృతక్రియాణామ్,
> అయోఽగ్నివత్తాననువర్తమానో
> న చేష్టతే నో వికరోతి కించన. 135

తా. ఆపరమాత్మ మనోఽహంకారములయొక్క సకల వికారములను, దేహము, ఇంద్రియములు, ప్రాణాదివాయువులును జేయుచుండు సర్వవ్యాపారములను దెలిసికొనుచుండును. ఇనుమునంటిన అగ్నివలె జడములగు దేహేంద్రియాదులతోఁ గూడి వానిని వ్యవహారక్షమములుగఁ జేయుచు, తాను నిష్క్రియుఁడై, అసంగుఁడగుటవలన తానేలాటి వికారములను జెందక తటస్థుఁడయి యుండును.

అవ. ఆత్మ షడ్భావవికారరహితుఁ డని చెప్పుచున్నారు:—

> న జాయతే నో మ్రియతే న వర్ధతే
> నక్షీయతే నో వికరోతి నిత్యః,
> విలీయమానేఽపి వపుష్యముష్మిన్
> న లీయతే కుంభ ఇవాంబరం స్వయమ్. 136

తా. ఆత్మకు పుట్టుట, చచ్చుట, పెరుగుట, క్షీణించుట, పరిణామాదివికారములను జెందుట యనునవి (షడ్భావవికారములు) లేవు. నిత్యుఁడు, అనఁగా నాశరహితుఁడు. ఈశరీరములో విలీయమానుఁ డయినను (సంబంధము గలిగియున్నను) ఘటాకాశమునకు నాశములేనియట్టులనే ఆత్మ కెన్నఁడును నాశము లేదు.

వి. షడ్భావవికారములు:—జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతీతి.

ప్రకృతివికృతిభిన్నః శుద్ధబోధస్వభావః
సదసదిదమశేషం భాసయన్నిర్విశేషః,
విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా
స్వహమహమితి సాక్షాత్సాక్షిరూపేణ బుద్ధేః. 137

తా. ప్రకృతి యనఁగా ప్రపంచమున కుపాదానకారణమగు అజ్ఞానము. వికృతి యనఁగా ప్రకృతికార్యమగు ప్రపంచము. పరమాత్మ యీ రెండింటికిని అధిష్ఠాన (ప్రకాశ) రూపముగ నుండినను వానికంటె భిన్నుఁడు. జ్ఞానమాత్రస్వరూపుఁడునై సదసదాత్మకమగు సర్వమును ప్రకాశింపఁజేయుచు, జాగ్రత్స్వప్నములయందు వ్యవహరించుబుద్ధికిని, సుషుప్తియందు లీనమగుబుద్ధ్యభావమునకును సాక్షిమాత్రుఁడై 'అహమహమ్' (నేను నేను) అని ప్రకాశించుచుండును. 'అహం' శబ్దవాచ్యుఁడు పరమాత్మయే కాని దేహము కాదని భావము.)

నియమితమనసాऽముం త్వం స్వమాత్మానమాత్మ
న్యయమహమితి సాక్షాద్విద్ధి బుద్ధిప్రసాదాత్,

జనిమరణతరంగాపారసంసారసింధుం
ప్రతర భవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః. 138

తా. ఓయీ! శిష్యా! నీబుద్ధిని నిర్మలము గావించి ఏకాగ్రచిత్తముతో నీలో నీయాత్మను (అహంశబ్దముచేఁ దెలియఁబడువస్తువును) గనుఁగొనుము. సూక్ష్మశరీరావభాసకరూపమునఁ బ్రకాశించుచుండువస్తువే 'నేను' (అహం బ్రహ్మాస్మి) అని నీబుద్ధిప్రసాదమునఁ దెలిసికొని, జన్మమరణరూపతరంగములతోఁ గూడి దరిలేని యీసంసారసాగరమును దాఁటి, బ్రహ్మరూపమున సుస్థితుఁడవై (నీవే బ్రహ్మమవై) కృతకృత్యుఁడవుకమ్ము.

అవ. సంసారబంధహేతువును జెప్పుచున్నారు:—

అత్రానాత్మన్యహమితి మతిర్బన్ధ ఏషోఽస్య పుంసః
ప్రాప్తోఽజ్ఞానా జ్జననమరణక్లేశసంపాతహేతుః,
యేనైవాయం వపురిదమసత్సత్యమిత్యాత్మబుద్ధ్యా
పుష్యత్యుక్షత్యవతి విషయై స్తన్తుభిః కోశకృద్వత్.

తా. అనాత్మయగు 'దేహమే నేను' అనుకొనెడి బుద్ధి పురుషునకు బంధమగును. ఈదేహాత్మబుద్ధి అజ్ఞానమువల్లఁ గలిగినదై జన్మమరణరూపసంసారమునకు హేతువగును. ఈకారణమువల్ల జీవాత్మ యీమిథ్యాశరీరమందు ఆత్మబుద్ధితో శబ్దాదివిషయములందుఁ దగిలి శరీరమును పోషించుచు దానిసేవఁ జేయుచు దానిని రక్షించుచున్నాఁడు. సాలెపురుగు తనతంతువులతోఁ దానే గూటి నల్లుకొని దానియందుఁ జిక్కుకొనునట్లు, పురుషుఁడు దేహాత్మబుద్ధివలన తనకు బంధమును తానే కలిగించుకొనుచున్నాఁడు.

అవ. పూర్వశ్లోకమందుఁ జెప్పఁబడిన అజ్ఞానమూలకమగు బంధమునకు హేతువగు అధ్యాసరూపము సదృష్టాంతముగ విశదీకరించుచున్నారు:—

అథాస్మిం స్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా
వివేకాభావాద్వై స్ఫురతి భుజగే రజ్జుధిషణా,
తతో౽నర్థవ్రాతో నిపతతి సమాదాతురధిక
స్తతో యో౽సద్గ్రాహః సహి భవతి బన్ధః శృణు సఖే.

తా. సఖుఁడవగు శిష్యా! మూఢునకు అజ్ఞానమువలన అతద్వస్తువునందు తద్బుద్ధి కలుగును. అనఁగా నొకవస్తువును జూచి యది మఱియొకవస్తు వనుకొనును. అందువలన అనర్థము వాటిల్లును. ఎట్లనఁగా, సర్పమును జూచి యవివేకముచే నది త్రాడనుకొని దానిని బట్టుకొనిన, వానికి తప్పక ముప్పు వాటిల్లును. అటులనే, అజ్ఞానమువల్ల అసత్యమును ననాత్మయు నగు దేహాదికమందు సత్యత్వబుద్ధి కలుగుటయే బంధహేతు వగును. దానివలన తాపత్రయాది నానాదుఃఖములు సంభవించును. కనుక దేహాదికమందు ఆత్మబుద్ధి తగ దని భావము.

అఖణ్డనిత్యాద్వయబోధశక్త్యా
స్ఫురన్త మాత్మాన మనన్తవైభవమ్,
సమావృణోత్యావృతిశక్తిరేషా
తమోమయీ రాహురివార్కబింబమ్. 141

తా. అఖండము నిత్యము అద్వితీయమునగు బోధశక్తి (జ్ఞానము)చే స్ఫురించునట్టి అనంతవైభవోపేతమగు ఆత్మను, రాహుగ్రహము సూర్యబింబము నాచ్ఛాదించునట్లు తమో

గుణమయమగు ఆవరణశక్తి ఆవరించుచున్నది. ('కూటస్థుఁడు లేఁడు, ప్రకాశించుటలేదు' అను నీమొదలగునాపాదన ఆవరణ శక్తివల్లఁ గలుగును.)

తిరోభూతే స్వాత్మన్యమలతరతేజోవతి పుమా
నవాత్మానం మోహాదహమితి శరీరం కలయతి,
తతః కామక్రోధః ప్రభృతిభిరముం బన్ధకగుణైః
పరం విక్షేపాఖ్యా రజస ఉరుశక్తిర్వ్యథయతి. 142

తా. అత్యంతవిశుద్ధప్రకాశస్వరూపుఁడగు ఆత్మను మాయయొక్క ప్రబలమగు ఆవరణశక్తి ఆచ్ఛాదింపఁగా, పురుషుఁడు (జీవుఁడు) మోహవశుఁడై అనాత్మయగు శరీరమే తాననుకొని దేహాభిమానియై వ్యవహరించును. అప్పుడు రజోగుణప్రధాన యగు గొప్ప విక్షేపశక్తి కామక్రోధాదిబంధక గుణములచేత పురుషునకు దుఃఖము గలిగించును.

మహామోహగ్రాహగ్రసనగలితాత్మావగమనో
ధియో నానావస్థాం స్వయమభినయంస్తద్గుణతయా
అపారే సంసారే విషయవిషపూరే జలనిధౌ
నిమజ్జ్యోన్మజ్జ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః.

తా. ఆప్రకారము విక్షేపశక్తిప్రేరితుఁడైన పురుషుని యొక్క ఆత్మజ్ఞానము మహామోహమనెడి మొసలిచే మ్రింగి వేయఁబడఁగా, అనఁగా వానికి జ్ఞానము శూన్యమై అవిద్య హెచ్చఁగా, వానిబుద్ధి తమోగుణవిశిష్టమయి, దానివలన వాఁడు నానావస్థలపాలై, విషయములనెడి విషజలముతో నిండిన సంసారసాగరమందు మునిఁగి, జన్మమరణాదిక్లేశములచేఁ బరిభ్రమించుచుండును.

భానుప్రభాసంజనితాభ్రపఙ్క్తి-
ర్భానుం తిరోధాయ విజృంభతే యథా,
ఆత్మోదితాహంకృతిరాత్మతత్త్వం
తథా తిరోధాయ విజృంభతే స్వయమ్. 144

తా. సూర్యకిరణములచే నుత్పన్నమైన మేఘమండలము సూర్యుని మాటుపఱిచి యెట్లు విజృంభించునో, యటుల నాత్మ వలనఁ గలిగిన అహంకారము ఆత్మను గప్పిపుచ్చి తాను విజృంభించును.

కబళితదివనాథే దుర్దినే సాన్ద్రమేఘై-
ర్వ్యథయతిహిమఝంఝావాయురుగ్రోయథైతాన్
అవిరతతమసాత్మన్యావృతే మూఢబుద్ధిం
క్షపయతి బహుదుఃఖైస్తీవ్రవిక్షేపశక్తిః. 145

తా. దట్టమైన మేఘమండలము సూర్యుని మఱుఁగుపఱిచిన దుర్దినమందు శీతలజలకణములతో ప్రబల మగువాయువు వీచుచు లోకమున కెట్లు వ్యథను గలిగించునో, యట్లే యెడతెగని తమోగుణముచే ఆత్మ కప్పఁబడియుండు మూఢులను తీవ్రమగు విక్షేపశక్తి యనేకవిధముల పీడించును.

ఏతాభ్యామేవ శక్తిభ్యాం బన్ధః పుంసస్సమాగతః,
యాభ్యాం విమోహితో దేహంమత్వాత్మానం భవత్యయమ్.

తా. ఈవిక్షేపావరణశక్తుల మూలముననే పురుషునకు బంధముకలుగుచున్నది. వీనిచే మోహితుఁడగువాఁడు దేహమే ఆత్మ యనుకొని వర్ణాశ్రమాద్యధ్యాసను పొందును.

అవ. సంసారరూపమహావృక్షము నభివర్ణించుచున్నారు:—

బీజం సంసృతిభూమిజస్య తు తమో దేహాత్మధీరంకురో
రాగఃపల్లవమంబు కర్మ తు వపుః స్కన్ధోఽసవః శాఖికాః,
అగ్రాణీన్ద్రియసంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహువిధం భోక్తాత్ర జీవః ఖగః. 147

తా. సంసారరూపమహావృక్షమునకు అజ్ఞానము (అవిద్య) బీజము. దేహాత్మబుద్ధి అంకురము (మొలక). (దేహాదికమందు) రాగము చిగురుకొమ్మ. కామ్యకర్మ జలము. దేహమే స్కంధము (మ్రాను). ప్రాణాదిపంచవాయువులు కొమ్మలు. ఇంద్రియసముదాయము ఉపశాఖలు (లేక పైభాగము). శబ్దాది విషయములు పుష్పములు. నానావిధకర్మలవలనఁ గలిగెడి ఆధ్యాత్మికాదిబహువిధదుఃఖసముదాయమే ఫలము. ఈఫలము ననుభవించెడి జీవుఁడే పక్షి.

వి. సంసారవృక్షము అజ్ఞానుల విషయమై యిట్లు వర్ణింపఁబడినది. ఈశ్లోకమందుఁ బ్రయోగింపఁబడిన తుశబ్దము వలన తత్త్వవేత్తలను నిదియే సత్ఫలవృక్షముగా క్రిందిశ్లోకము వలన గ్రహింపఁదగును.

"ఆనందమూలగుణపల్లవతత్వశాఖా
వేదాన్తపుష్పఫలమోక్షరసాదిపూర్ణమ్,
చేతోవిహంగ హరితుంగతరుం విహాయ
సంసారశుష్కవిటపే వద కిం రతోఽసి." 148

అజ్ఞానమూలోఽయమనాత్మబన్ధో
నైసర్గికోఽనాదిరనన్త ఈరితః,
జన్మాప్యయం వ్యాధిజరాదిదుఃఖ
ప్రవాహపాతం జనయత్యముష్య. 149

తా. అజ్ఞానమూలమగు నీయనాత్మబంధము పురుషునకు స్వభావసిద్ధమై ప్రవాహరూపమున ననాదియు ననంతమును నయియున్నదని చెప్పఁబడును. ఈ అనాత్మబంధములోఁ దగులు కొనినపురుషుఁడు జన్మము మరణము వ్యాధి ముదిమి మొదలగుదుఃఖములయొక్క ప్రవాహములోఁ బడిపోవును.

అవ. పూర్వోక్త బంధనివర్తకోపాయముఁ జెప్పుచున్నారు:—

నాస్త్రైర్న శస్త్రైరనిలేన వహ్నినా
ఛేత్తుం న శక్యో న చ కర్మకోటిభిః,
వివేకవిజ్ఞానమహాసినా వినా
ధాతుః ప్రసాదేన సితేన మఞ్జునా. 150

తా. ప్రబలమగు నీ అజ్ఞానరూపబంధము ఈశ్వరానుగ్రహమువలనఁ గలిగిన మంజులమగు వివేకవిజ్ఞాన (ఆత్మజ్ఞాన) మనెడి మహాఖడ్గముచేత ఛేదింపఁబడవలెనేకాని యేయితరోపాయముచేతను ఛేదింపఁబడదు. కారణ మేమనఁగా, అస్త్రములును శస్త్రములును దానిని ఖండింపఁజాలవు, మహావాయువు చలింపఁజేయఁజాలదు, అగ్నియును జలమును దానిని నశింపఁ జేయఁజాలవు. మఱియు కోటికర్మ లయినను నీ అజ్ఞానమును నివారింపఁజాలవు. ఆత్మజ్ఞానము మాత్రమే అజ్ఞానమును నిర్మూలించును.

శ్రుతిప్రమాణైకమతేః స్వధర్మ
నిష్ఠా తయైవాత్మవిశుద్ధిరస్య,
విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం
తేనైవ సంసారసమూలనాశః. 151

తా. వేదప్రమాణమందు నమ్మకముగల పురుషునకు స్వధర్మకర్మానుష్ఠానమందు శ్రద్ధయు భక్తియుఁ గలుగును. అట్టి కర్మానుష్ఠానమువలన బుద్ధి పరిశుద్ధమగును. విశుద్ధబుద్ధివలన 'అహం బ్రహ్మాస్మి' యనెడి అపరోక్ష జ్ఞానము కలుగును. అపరోక్షాత్మజ్ఞానమువలన సంసారము సమూలముగ నశించును. (ఏవశబ్దమువలన కర్మవలన అజ్ఞానము నశింపదనియు, కేవల జ్ఞానమువలననే అజ్ఞానము నశించుననియు గ్రాహ్యము.)

కోశైరన్నమయాద్యైః పంచభిరాత్మా న సంవృతో భాతి,
నిజశక్తిసముత్పన్నైః శైవలపటలైరివాంబు వాపీస్థమ్. 152

తా. దిగుడుబావియందుఁగల నీటివలనఁ బెరిఁగిననాచు నీటిని ఎటుల మాటుపఱుచునో, యటులనే ఆత్మశక్తివలన (అవిద్యచే) నుత్పన్నమైన అన్నమయాదిపంచకోశములు ఆత్మను లెస్సగ నాచ్ఛాదించుటవలన ఆత్మ ప్రకాశింపకున్నది.

తచ్ఛైవాలాపనయే సమ్యక్ సలిలం ప్రతీయతే శుద్ధమ్,
తృష్ణాసన్తాపహరం సద్యః సౌఖ్యప్రదం పరం పుంసః. 153
పంచానామపి కోశానామపవాదే విభాత్యయం శుద్ధః,
నిత్యానన్దైకరసః ప్రత్యగ్రూపః పరం స్వయంజ్యోతిః. 154

తా. బావిలోనినీటిని గప్పియున్ననాచును తొలఁగించిన యెడల దాహముఁగొన్నపురుషునకు దాహశాంతిఁజేసి సౌఖ్యము నిచ్చు అత్యంతనిర్మలమగు జలము బయల్పడును. ఆవిధముననే ఆత్మను మాటుపఱుచుచున్న పంచకోశములను అన్వయవ్యతిరేకములచే నిషేధింపఁగా నిత్యానందైకరసస్వరూపుఁడును,

జన్మాదిరహితుఁడును, స్వయంప్రకాశమానుఁడును నై ప్రత్యగ్రూపముననున్న పరిశుద్ధాత్మ ప్రకాశించును.

వి. అన్వయవ్యతిరేకము లనఁగా వేదాంతశాస్త్రమందు అనువృత్తివ్యావృత్తులు. అనువృత్తి యనఁగా హారములోని దారమువలె నంతటను అనుస్యూతమై (ఎడతెగక) యుండుట. వ్యావృత్తి యనఁగా నొక అవస్థ మఱియొక అవస్థలో లేక పోవుట. ఆత్మ జాగ్రదాద్యవస్థాత్రయమందును అనుగతమై యున్నది. ఇదియే అనువృత్తి. జాగ్రదవస్థ స్వప్నమందు లేదు, స్వప్నావస్థ సుషుప్తియందు లేదు, జాగ్రత్స్వప్నావస్థలు సుషుప్తి యందు లేవు. ఇదియే వ్యావృత్తి. కావున, అన్నమయాదిపంచ కోశములు అనిత్యములు గనుక నిత్యుఁడగు ఆత్మ కాఁజాలవు. జాగ్రదాద్యవస్థాత్రయమందును నీపంచకోశములయందు అను వర్తించు ఆత్మమాత్రమే నిత్యము. కనుక బావిలోని నాచును దొలఁగించినట్లు పంచకోశములను ఉపేక్షించి నిత్యవస్తు వగు ఆత్మను అన్వయవ్యతిరేకములచేఁ దెలిసికొనవలె నని యభి ప్రాయము.

ఆత్మానాత్మవివేకః కర్తవ్యో బన్ధముక్తయే విదుషా,
తేనైవానన్దీ భవతి స్వం విజ్ఞాయ సచ్చిదానన్దమ్. 155

తా. బంధవిముక్తినిగోరు విద్వాంసుఁడు (ముముక్షువు) ఆత్మానాత్మవిచారము చేయవలెను. ఆత్మానాత్మవివేకమువలననే తనయొక్క నిజమగు సచ్చిదానందస్వరూపమును దెలిసికొని పరమానందమును బొందఁగలుగును.

ముంజాదిషీకామివ దృశ్యవర్గాత్
[1]ప్రత్యంచ మాత్మాన[2]మసంగమక్రియమ్,

వివిచ్య తత్ర ³ప్రవిలాప్య సర్వం
తదాత్మనా తిష్ఠతి యః స ముక్తః. 156

తా. ముంజగడ్డినుండి దానిపై పొరలను దీసివేయఁగా నందు గర్భీభూతమై ప్రవృద్ధికారణమగు సూక్ష్మాంకురము మాత్రమే మిగులును. ఆవిధముననే దృశ్యవర్గమునందు [1]సర్వత్రాఽనుస్యూతమై, [2]త్రితయసంబంధరహితుఁడై కర్తృత్వాది ధర్మరహితుఁడై యుండు ఆత్మను పంచకోశములనుండి వేఱు పఱచి, దృశ్యవర్గము సర్వమును [3]లయింపఁజేసి యేపురుషుఁడు స్వస్వరూపమున, అనఁగా, ప్రత్యగభిన్నాద్వయానందబ్రహ్మరూపమున సుస్థితుఁ డగునో వాఁడే ముక్తుఁడు.

అవ. అన్నమయకోశవివరణము:—

దేహోఽయమన్నభవనోఽన్నమయస్తు కోశ
శ్చాన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః,
త్వక్చర్మమాంసరుధిరాస్థిపురీషరాశి
ర్నాయం స్వయం భవితుమర్హతి నిత్యశుద్ధః. 157

తా. ఈస్థూలశరీరము అన్నమువలన నుత్పన్నమై, అన్నమువలన జీవించుచు, అన్నములేనియెడల నశించునది కనుక అన్నమయకోశ మనఁబడును. (ఖడ్గములను ఒఱలాచ్ఛాదించునట్లు ఆత్మనాచ్ఛాదించుటవలన కోశమనఁబడును). ఈదేహము త్వక్కు చర్మము మాంసము రక్తము ఎముకలు పురీషము మున్నగు వానియొక్క సముదాయమై మిక్కిలి హేయమైనది. మఱియు నశ్వరమయినది. కనుక నట్టిదేహము నిత్యుఁడును పరిశుద్ధుఁడును నగు ఆత్మ కాఁజాలదు. (ఆత్మ యనుట కర్హతయే లేదు.)

పూర్వం జనేరపి మృతేరపి నాయమస్తి
జాతక్షణః క్షణగుణో౽నియతస్వభావః,
నైకో జడశ్చ ఘటవత్పరిదృశ్యమానః
స్వాత్మా కథం భావవికారవేత్తా. 158

తా. ఈదేహము ఉత్పత్తికిఁ బూర్వము లేనిది (జననకాలమందు మాత్రము ప్రతీతమై) మరణానంతరము ఉండదు. ప్రతిక్షణమునను మాఱుచుండును. సదా ఏకరూపమున నుండదు. జడమై ఘటమువలె దృష్టనష్టస్వభావముగలది. ఇట్టి నశ్వర శరీరము దానిభావవికారములను దెలిసికొనెడి నిత్యాత్మ యెట్లగును? (కాదనుట).

పాణిపాదాదిమాన్ దేహో నాత్మా వ్యంగే౽పి జీవనాత్,
తత్తచ్ఛక్తేరనాశాచ్చ న నియమ్యో నియామకః. 159

తా. హస్తపాదాద్యవయవములతోఁ గూడిన యీశరీరము కూటస్థాత్మ కాదు. ఏలయన, దేహముయొక్క కొన్ని అవయవములు లోపించినను దేహము జీవించియే యుండును. ఆత్మయొక్క సత్తాస్ఫూర్తులు నశింపవు. కావున దేహము ఆత్మ కాదు, ఆత్మ నియామకుఁడు, శరీరము నియమ్యము.

దేహ తద్ధర్మ తత్కర్మ తదవస్థాదిసాక్షిణః,
స్వత ఏవ స్వతః సిద్ధం తద్వైలక్షణ్యమాత్మనః. 160

తా. స్థూలదేహము, దానియుత్పత్త్యాదిషడ్ధర్మములు, గమనాగమనాదిక్రియలు, బాల్యయౌవనాద్యవస్థలు, వీని నన్నిటినిఁ బ్రకాశింపఁజేయు (సాక్షియగు) ఆత్మకు దేహముకంటె వైలక్షణ్యము సహజముగనే యున్నది.

శల్యరాశిర్మాంసలిప్తో మలపూర్ణోఽతికశ్మలః,
కథం భవేదయం వేత్తా స్వయమేతద్విలక్షణః. 161

తా. ఎమ్ముల ప్రోవును, మాంసలిప్తమును, మలపూర్ణమునై అతికశ్మలమగు నీస్థూలదేహము సర్వజ్ఞాతయగు ఆత్మయె ట్లగును? ఆత్మ మలినమగు నీదేహముకంటె స్వయముగనే విలక్షణుఁడు.

త్వఙ్మాంసమేదోఽస్థి పురీషరాశా
వహంమతిం మూఢజనః కరోతి,
విలక్షణం వేత్తి విచారశీలో
నిజస్వరూపం పరమార్థభూతమ్. 162

తా. త్వక్కు మాంసము మేదస్సు పురీషము ననువాని సముదాయమగు నీదేహమందు మూఢుఁడు (అజ్ఞాని) 'నేను' అని అభిమానించును. కాని వివేకి (జ్ఞాని) దేహమును విలక్షణముగఁ జూచి, ప్రత్యగభిన్నాద్వయరూపమగు తన నిజస్వరూపమును దెలిసికొని ఆనందించును.

దేహోఽహమిత్యేవ జడస్య బుద్ధి
ర్దేహే చ జీవే విదుషస్త్వహంధీః,
వివేకవిజ్ఞానవతో మహాత్మనో
బ్రహ్మాహమిత్యేవ మతిః సదాత్మని. 163

తా. (ఆత్మానాత్మవివేకశూన్యుఁడగు) మూఢుఁడు దేహమే ఆత్మయని తలంచును. శుష్కశాస్త్రజ్ఞానముగలపండితుఁడు చిదాభాసుఁడగు జీవుఁడే ఆత్మ యనుకొనును. దృఢమగు అపరోక్షజ్ఞానముగల మహాత్ముఁడు 'అహం బ్రహ్మాస్మి' యనెడి బుద్ధితో

సదా కూటస్థరూప స్వస్వరూపమే తా ననెడి దృఢనిశ్చయము గలిగియుండును.

వి. ఇందలి రహస్య మే మనఁగా లోకాయతమతవాది స్థూలశరీరమే ఆత్మ యనును. శాస్త్రజ్ఞానముమాత్రమే గలపండితుఁడు, లింగశరీరాభిమానియై కూటస్థజీవుఁడే ఆత్మ యనును. కరామలకమువలె నపరోక్షజ్ఞానముగల మహాత్ముఁడు 'శివోఽహం శుద్ధోఽహం' అని స్మరించును.

అవ. లోకాయతమతనిరాకరణపూర్వకముగ శిష్యునకు తత్త్వార్థమును బోధించుచున్నారు:—

అత్రాత్మబుద్ధిం త్యజ మూఢబుద్ధే
త్వఙ్మాంసమేదోఽస్థిపురీషరాశౌ,
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
కురుష్వ శాన్తిం పరమాం భజస్వ. 164

తా. [లోకాయతికునిఁగూర్చి] ఓమూఢుఁడా! త్వఙ్మాంసమేదోఽస్థి పురీషరాశియగు నీస్థూలశరీరమందు ఆత్మబుద్ధిని విడువుము. సర్వాత్మయగు ప్రత్యగభిన్నపరబ్రహ్మమునందు నిర్వికల్పముగ 'అహం బ్రహ్మాస్మి' యనెడివృత్తిని అవిచ్ఛిన్నతైలధారవలె దృఢపఱిచి పరమశాంతినిఁ బొంది సుఖింపుము.

దేహేన్ద్రియాదావసతి భ్రమోదితాం
విద్వానహన్తాం న జహాతి యావత్,
తావన్న తస్యాస్తి విముక్తివార్తా
ప్యస్త్వేష వేదాన్తనయాన్తదర్శీ. 165

తా. శాస్త్రవేత్త స్థూలదేహము పంచేంద్రియములు పంచప్రాణములు బుద్ధి మొదలగువానిని దెలిసికొని, స్వసత్తా శూన్యములగు నీదేహాదివిషయములందు భ్రాంతిc జెంది నేను మనుష్యుcడను, పండితుcడను, కృష్ణుcడను, బధిరుcడను అను నీ మొదలగు నధ్యాసములు గలిగియుండును. ఈ అహంతామమతలు ఎంతపర్యంతము విడువకుండునో, అంతపర్యంతము మోక్షమనుశబ్దమును వినుటమట్టుకే కాని వానికి ముక్తి యెంత మాత్రము ప్రాప్తింపదు. ఆవిద్వాంసుcడు వేదాంతసిద్ధాంతములను సంపూర్ణముగc దెలిసికొని, వేదాంతవిచారపరుc డయినప్పటికిని, భ్రమబుద్ధి విడువదేని (అపరోక్షజ్ఞానము కలుగదేని) వానికి తత్త్వజ్ఞానప్రాప్తిలేదు. "అధీత్య చతురోవేదాన్సాక్షం బ్రహ్మ న విన్దతి, వేదభారభరాక్రాన్తః స విప్రో గర్దభస్స్మృతః." అని సనత్సుజాతీయసంహితయందుc జెప్పcబడినది.

ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే
యత్స్వప్నదేహే హృది కల్పితాంగే,
యథాత్మబుద్ధిస్తవ నాస్తి కాచి
జ్జీవచ్ఛరీరే చ తథైవ మాస్తు. 165

తా. శిష్యా! నీయొక్క ఛాయాశరీరమందును (నీడయందును), నీటియందు ప్రతిఫలించిన ప్రతిబింబితశరీరమందును, స్వప్నమందుc దోcచు దేహమందును, జాగ్రదవస్థయందు హృదయమందుc గల్పింపcబడిన శరీరమందును ఆత్మబుద్ధి నీ కెటుల కలుగదో, ఆప్రకారమే జాగ్రదవస్థయందు దృశ్యమగు నీస్థూల దేహమందు సయితము ఆత్మబుద్ధి గలుగనీయకుము. ఛాయా

శరీరాదులెట్టుల అసత్యమో ప్రత్యక్షస్థూలదేహమున్ను అటులే అసత్యమని భావము.

అవ. దేహాత్మబుద్ధి విడిచినవానికి ముక్తి సుసాధ్యమని చెప్పుచున్నారు:—

దేహాత్మధీరేవ నృణా మసద్ధియాం
జన్మాదిదుఃఖప్రభవస్య బీజమ్,
యత స్తత స్త్వం జహి తాం ప్రయత్నాత్
త్యక్తే తు చిత్తే న పునర్భవాశా. 166

తా. అసద్బుద్ధి (భ్రాంతి) వలనఁ గలిగెడి దేహాత్మబుద్ధియే నరులకు జన్మమరణాదిదుఃఖములకు బీజము (కారణము). అందు వలన శరీరాధ్యాసముఁగల పురుషునకు జన్మమృత్యువులు (భవ సంసారము) కలుగుచునే యుండును. కాఁబట్టి శిష్యా! సర్వ ప్రయత్నములచేతను దేహాత్మబుద్ధిని విడువుము. నీచిత్తమం దీదేహాత్మబుద్ధిని విడఁతువేని యిఁకను నీకు పునర్జన్మము కలుగు ననెడి ఆశ (భయము) ఎంతమాత్రమును లేదు.

అవ. ఇంతదనుక నన్నమయకోశలు తత్కార్యములు వివ రింపఁబడినవి. ఇఁకను ప్రాణమయకోశ తత్కార్యములను వివరించుచున్నారు:—

కర్మేన్ద్రియైః పంచభిరంచితో౽యం
ప్రాణో భవేత్ప్రాణమయస్తు కోశః,
యేనాత్మవా నన్నమయో౽న్నపూర్ణాత్
ప్రవర్తతే౽సౌ సకలక్రియాసు. 167

తా. వాగాది పంచకర్మేంద్రియములతోఁగూడిన ప్రాణమే ప్రాణమయకోశ మనఁబడును. ఈప్రాణమయకోశ సంశ్రయము

వలన అన్నమయకోశము అన్నపూరితమై, ప్రాణాపానాది వాయుపూరితమై, ఆత్మశబ్దవాచ్యమగు అహంప్రతీతికి విషయమై, ప్రాణయుక్తమగు స్థూలశరీరము గమనాదిసకలక్రియలందును బ్రవర్తింపఁగలుగుచున్నది. ఇట్లు అన్వయవ్యతిరేకములచే విచారింపఁగా అన్నమయకోశమువలెనే ప్రాణమయకోశము సయితము ఆత్మ కాదు, అని అభిప్రాయము.

అవ. స్థూలశరీరము (అన్నమయకోశము) ఆత్మ కాకపోయినను, ప్రాణమయకోశమునకు ఆత్మత్వప్రతీతి కలదు. ప్రాణసంబంధమువలననే జీవనవ్యవహారము కలుగుచున్నది. "అన్యోఽన్తరాత్మా ప్రాణమయః" అనెడిశ్రుతియే ప్రాణమునకాత్మత్వము గల దనుటకుఁ బ్రమాణము. జీవనమరణములు ప్రాణాధీనములు. ఈ హేతువువలన ప్రాణమయకోశమే ఆత్మ అనెడివాదమును నివర్తించుచున్నారు:—

నైవాత్మాపి ప్రాణమయో వాయువికారో
గన్తాగన్తా వాయువదన్తర్బహిరేషః,
యస్మాత్కించిత్క్వాపి న వేత్తీష్టమనిష్టం
స్వం వాన్యం వా కించన నిత్యం పరతన్త్రః. 168

తా. ప్రాణమయకోశముసయితము ఆత్మ కాదు. అది వాయువికారము. "ప్రాణో నాత్మా భవితుమర్హతి వాయువికారత్వాత్," ఈఅనుమానమువలన ప్రాణమునకు అనాత్మత్వము సిద్ధించుచున్నది. మఱియు, ప్రాణము బాహ్యవాయువువలెనే లోపలకు వెలుపలకును గమనాగమనములఁ జేయును. అందువలన ప్రాణము ఆత్మ కాదు. కనుకనే ప్రాణము ఇష్టానిష్టములను ఎంతమాత్రము నెప్పుడును దెలియఁజాలదు. ఆప్రా

రమే తన్నుఁగాని అన్యమునుగాని యెంతమాత్రము నెఱుంగదు. ఎల్లప్పుడును పరతంత్రమైనది; అనఁగా ఆత్మాధీనమై ఆత్మప్రసాదముననే క్రియాసమర్థ మగుచున్నది.

అవ. మనోమయకోశవిచారము—

అయ్యా! అన్నమయకోశమువలెనే ప్రాణమయకోశమున్ను అనాత్మ కావచ్చును. బంధమోక్షములు మనస్సున కధీనములు. బాహ్యప్రవృత్తియందును, బాహ్యవ్యాపారమందును మనస్సునకే స్వాతంత్ర్యము కలదు, కాఁబట్టి మనస్సే ఆత్మ యగును. అనెడి వాదమును పరిహరించుటకుఁగాను ముందుగ మనోమయకోశస్వరూపమును వివరించుచున్నారు:—

జ్ఞానేన్ద్రియాణి చ మనశ్చ మనోమయః స్యాత్
కోశో మమాహమితి వస్తువికల్ప హేతుః,
సంజ్ఞాదిభేదకలనాకలితో బలీయాం
స్తత్పూర్వకోశమభిపూర్య విజృంభతే యః. 169

తా. శ్రోత్రాదిపంచేంద్రియములును మనస్సును గూడి మనోమయకోశ మనఁబడును. ఇందు మనస్సు ప్రధాన మగుటవలన నిది మనోమయకోశమని చెప్పఁబడుచున్నది. ఆత్మను ఆచ్ఛాదించి యుండుటవలన కోశ మనఁబడును. ఈమనోమయకోశము నాది, నాభార్య, నాపుత్త్రుఁడు నను నీ మొదలగు నభిమానములకును, నేను బ్రాహ్మణుఁడను క్షత్రియుఁడ నను నీమొదలగు అహంభావముతోఁగూడిన వస్తుకల్పనకును హేతువగుచున్నది. మఱియు, నామజాత్యాదిభేదకల్పన చేయుచు బలీయమైనదై ప్రాణమయకోశమునందు వ్యాపించి విజృంభించుచున్నది.

అవ. మనోమయకోశము ఆత్మ కా దనుటకు హేత్వంతరమును జెప్పుచున్నారు:—

పంచేన్ద్రియైః పంచభిరేవ హోతృభిః
ప్రచీయమానో విషయాజ్యధారయా,
జాజ్వల్యమానో బహువాసనేన్ధనై
ర్మనోమయాగ్ని ర్దహతి ప్రపంచమ్. 170

తా. పంచేంద్రియములనెడి హోతృపంచకము (యజ్ఞము చేయించు ఋత్విక్కులు) విషయము లనెడి ఆజ్యధారలచే వేల్చఁగా నతిశయించి వృద్ధియగుచు, (ననేకజన్మ) వాసన లనెడి ఇంధనము (సమిధ)లచే నత్యంతప్రచండమై యీమనోమయ కోశరూపాగ్ని ప్రపంచమును దహించుచున్నది.

అవ. అయ్యా! బంధము అవిద్యామూలకము గనుక, అవిద్యవలననే జీవునకు ప్రపంచస్మృతి కలుగుచున్నదిగాని మనస్సువలనఁగాదు. అనెడిశంకకు సమాధానము చెప్పుచున్నారు:—

నహ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా
మనో హ్యవిద్యా భవబన్ధహేతుః,
తస్మిన్వినష్టే సకలం వినష్టం
విజృంభితేఽస్మిన్సకలం విజృంభతే. 171

తా. మనస్సుకంటె అవిద్య వేఱుగలేదు. మనస్సే అవిద్య. అనఁగా మనస్సునుండి అవిద్య పరిణమించి సంసారరూపబంధమునకుఁ గారణ మగుచున్నది. మనస్సు నశించినయెడల కర్తృత్వ భోక్తృత్వరూప సకలబంధమును వినష్ట మగును. మనస్సు

విజృంభించెనేని సకలకర్తృత్వభోక్తృత్వరూపసంసారవిస్తృతి కలుగుచున్నది. "అస్య సంసారవృక్షస్య మనోమూల మవస్థితిః" అని వసిష్ఠవచనము.

అవ. మనస్సు విలయ మయ్యేనేని సర్వమును విలయ మగు నని ప్రకారాంతరముచేఁ జెప్పుచున్నారు:—

స్వప్నేఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా
భోక్త్రాదివిశ్వం మన ఏవ సర్వమ్,
తథైవ జాగ్రత్యపి నో విశేష
స్తత్సర్వమేతన్మనసో విజృంభణమ్. 172

తా. అర్థశూన్యమగు స్వప్నావస్థయందు భోక్తృభోగ్యభోగరూప సమస్తప్రపంచమును మనస్సే స్వశక్తి (విక్షేపశక్తి) వలన సృజించుచున్నది. ఆప్రకారమే జాగ్రదవస్థయందునయి తము సృజించుచున్నది. కాఁబట్టి స్వప్నజాగ్రదవస్థలు రెండును సమానమేకాని విశేషమెద్దియు లేదు. ఈయుభయావస్థలందును స్ఫురించు విశ్వమంతయు మనోవిజృంభణమాత్రమేకాని వాస్తవము కాదు.

సుషుప్తికాలే మనసి ప్ర
నైవాస్తి కించిత్సకలప్రసిద్ధేః,
అతో మనఃకల్పిత ఏవ పుంసః
సంసార ఏతస్య న వస్తుతోఽస్తి. 173

తా. సుషుప్తికాలమందు మనస్సు లయింపఁగా, అనఁగా మనస్సు కారణరూపమును పొందియుండఁగా, ద్వైత మెంత మాత్రమునుస్ఫురింపదు, ఇదిలోకానుభవమే. ఈహేతువువలన

పురుషునకు కర్తృత్వభోక్తృత్వరూపబంధము మనఃకల్పితమే కాని వాస్తవముగ లేదు. ఇట్లు తెలిసికొనిన పురుషునకు సంసార బంధమే లేదని అభిప్రాయము.

అవ. ఈయంశమునే సదృష్టాంతముగ విశదీకరించుచున్నారు:—

వాయునాఽఽనీయతే మేఘః పునస్తేనైవ[1]నీయతే,
మనసా కల్ప్యతే బన్ధో మోక్షస్తేనైవ కల్ప్యతే. 174

తా. వాయువుచే రప్పింపఁబడిన మేఘము మరల నావాయువుచేతనే మఱియొకచోటునకు కొట్టుకొని పోఁబడుచున్నది. ఆవిధముననే సంసారబంధము మనస్సుచేతఁ గల్పింపఁబడి, మఱల నామనస్సుచేతనే విడిపింపఁబడుచున్నది. అనఁగా విషయాసక్తమగు మనస్సు బంధహేతువు, నిర్విషయమగు మనస్సు మోక్షహేతువని భావము.

దేహాదిసర్వవిషయే పరికల్ప్య రాగం
బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన,
వైరస్యమత్ర విషవత్సు విధాయ పశ్చా
దేనం విమోచయతి తన్మన ఏవ బన్ధాత్. 175

తా. మనస్సు దేహాదికసర్వవిషయములందును (ఆది శబ్దమువలన శబ్దాదివిషయములు క్షుదాదిప్రాణవిషయములు నని గ్రహింపవలెను) అనురాగమును గల్పించి, త్రాటిచే పశువును బంధించినట్లు, రాగమనెడిపాశముచే జీవుని బంధించుచున్నది. మఱల నావిషయములందు విషమునందువలె వైరస్య

[1] లీయతే.

మును (నిరసనభావమును) గల్పించి ఆమనస్సే పురుషుని బంధ విముక్తునిగఁ జేయుచున్నది.

తస్మాన్మనః కారణమస్య జన్తో
ర్బన్ధస్య మోక్షస్య చ వా విధానే,
బన్ధస్య హేతుర్మలినం రజోగుణై
ర్మోక్షస్య శుద్ధం విరజస్తమస్కమ్. 176

తా. ఈహేతువువలన జీవుని బంధమునకును మోక్షమునకును మనస్సే కారణము. రజోగుణసంసర్గముచే మలినమై బంధహేతు వగుచున్నది. రజోగుణతమోగుణరహితమై శుద్ధసత్వ ప్రధానమగు మనస్సు మోక్షహేతు వగుచున్నది.

వివేకవైరాగ్యగుణాతిరేకా
చ్ఛుద్ధత్వమాసాద్య మనోవిముక్త్యై,
భవత్యతో బుద్ధిమతో ముముక్షో
స్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్యమగ్రే. 177

తా. పూర్వోక్తవివేకవైరాగ్యాదిగుణములు వృద్ధియగుకొలది మనస్సు పరిశుద్ధమై మోక్షసాధన మగును. కనుక, బుద్ధిమంతుఁడగు ముముక్షువు నిరంతరదృఢాభ్యాసమువల్ల వివేకవైరాగ్యాదులను సమగ్రముగ సంపాదింపవలెను.

మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు,
చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః. 178

తా. ధనవనితాదివిషయప్రపూర్ణమైన మహారణ్యమందు మనస్సనెడి పెద్దపులి సర్వదా సంచరించుచుండును. కావున

మోహాసక్తు లగుసాధువు లావిషయారణ్యమునఁ బ్రవేశింప కుందురుగాక.

మనః ప్రసూతే విషయా నశేషాన్
స్థూలాత్మనా సూక్ష్మతయా చ భోక్తుః,
శరీరవర్ణాశ్రమజాతిభేదాన్
గుణక్రియాహేతుఫలాని నిత్యమ్. 179

తా. మనస్సు జాగ్రదవస్థయందు స్థూలరూపముననుఁ స్వప్నమందు సూక్ష్మరూపమునను భోగించుటకొఱకు సమస్త విషయములను, శరీరభేదమును, వర్ణాశ్రమజాతిభేదములను, తత్తత్క్రియలను, ఆక్రియలకుఁ దగినఫలములను సర్వదా కల్పించుచుండును.

అసంగచిద్రూపమముం విమోహ్య
దేహేన్ద్రియప్రాణగుణైర్నిబధ్య,
అహం మమేతి భ్రమయత్యజస్రం
మనః స్వకృత్యేషు ఫలోపభుక్తిషు. 180

తా. మనస్సు నిస్సంగుఁడగుచిదాత్మను అన్యోన్యాధ్యాస ముచే మోహపెట్టి, దేహేంద్రియప్రాణములచేతను సత్వరజస్తమోగుణములచేతను బంధించి, ఆయాక్రియలందును క్రియాఫలభోగములందును అహం మమాధ్యాసమువలన సర్వదా భ్రమింపఁజేయును.

అధ్యాసదోషాత్పురుషస్య సంసృతి
రధ్యాసబన్ధస్త్వమునైవ కల్పితః,
రజస్తమోదోషవతోఽవివేకినో
జన్మాదిదుఃఖస్య నిదానమేతత్. 181

తా. స్థూలసూక్ష్మ శరీరవిశిష్ట చిదాభాసరూపవిక్షేపము అధ్యాసము. ఈ అధ్యాసదోషమువలన పురుషునకు సంసారము ప్రాపించును. అనంతరము కర్తృత్వభోక్తృత్వరూపాధ్యాస బంధము కలుగును, ఇది మనఃకల్పితము. రాజసతామసగుణము లచే వివేకమును గోల్పోయినపురుషునకు జన్మాదిదుఃఖము కలుగుట కిదియే కారణము.

అతః ప్రాహుర్మనోఽవిద్యాం పణ్డితా స్తత్త్వదర్శినః,
యేనైవ భ్రామ్యతే విశ్వం వాయునేవాభ్రమణ్డలమ్. 182

తా. ఈచెప్పఁబడిన హేతువులవలన మనస్సే అవిద్య యని బ్రహ్మాత్మైక్యజ్ఞానముగల మహాత్ములు చెప్పిరి. వాయువు వలన మేఘమండలము పరిభ్రమించునట్లు మనస్సుచేతనే సమస్త ప్రపంచము భ్రమింపఁబడుచున్నది.

తన్మనఃశోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా,
విశుద్ధే సతి చైతస్మి న్ముక్తిః కరఫలాయతే. 183

తా. కావున మోక్షేచ్ఛ గలపురుషుఁడు మనస్సును శుద్ధ పఱ్చవలెను. మనస్సు పరిశుద్ధ మగునేని ముక్తి హస్తామలకము వలె స్వతస్సిద్ధమగును.

మోక్షైకసక్త్యా విషయేషు రాగం
నిర్మూల్య సన్న్యస్య చ సర్వకర్మ,
సచ్ఛ్రద్ధయా యః శ్రవణాదినిష్ఠో
రజస్స్వభావం స ధునోతి బుద్ధేః. 184

తా. మోక్షమం దత్యంతాసక్తి గలపురుషుఁడు శబ్దాది విషయవాసనలను నిర్మూలించి, సర్వకర్మలను బరిత్యజించి, గురు

వేదాంతవాక్యములందు విశేషశ్రద్ధతో శ్రవణమననాదుల నభ్య సించినయెడల, నట్టివానిబుద్ధి రజోగుణరహితమై పరిశుద్ధ మగును.

అవ. "మనోబ్రహ్మేత్యుపాసీత" అనెడిశ్రుతి మనస్సే బ్రహ్మ మని చెప్పుచున్నది గనుక, మనస్సే బ్రహ్మము కాదా యనెడివాదమునకుఁ బరిహారముఁ జెప్పుచున్నారు:—

మనోమయో నాపి భవేత్పరాత్మా
హ్యాద్యన్తవత్త్వాత్పరిణామభావాత్,
దుఃఖాత్మకత్వా ద్విషయత్వహేతో
ర్ద్రష్టా హి దృశ్యాత్మతయా న దృష్టః. 185

తా. మనస్సు బ్రహ్మమని చెప్పెడి శ్రుతివాక్యము ఉపా సకులకొఱకుఁ జెప్పఁబడినదిగాని సిద్ధాంతము కాదు. మనోమయ కోశము అవాఙ్మానసగోచరమగు పరమాత్మ కాదు. ఏలయన, నది ఆద్యంతములు (ఉత్పత్తివినాశములు) గలది, వృద్ధి క్షయములు గలది. దుఃఖరూపము జడము దృశ్యమునునై ఆత్మకు విష యమైనది. ఆత్మయన్నవో సర్వద్రష్ట; అనఁగా ననాత్మవస్తువుల యొక్క రాకపోకలను జూచువాఁడుగాని దృశ్యము కాఁడు. మనోమయము దృశ్యము. ఆత్మకును మనస్సునకును నిట్టిపరస్పర విలక్షణములు గలవు గనుక మనోమయము ఆత్మ కాదు.

అవ. అయ్యా! మనోమయకోశము ఆత్మ కాదేని విజ్ఞాన మయకోశము ఆత్మ కావలయును. ఏలయన, "తస్మాద్వా ఏతస్మా దన్యోఽన్తరాత్మా" అనుశ్రుతివలన మనోమయకోశముకంటె అంతరమగు విజ్ఞానమయకోశము ఆత్మయని సిద్ధించుచున్నది. అనెడి వాదమునకుఁ బరిహారముఁ జెప్పుచున్నారు:—

బుద్ధిర్బుద్ధీన్ద్రియైః సార్ధం సవృత్తిః కర్తృలక్షణః,
విజ్ఞానమయకోశః స్యాత్పుంసః సంసారకారణమ్. 186

తా. క్షణికవిజ్ఞానరూపమగు బుద్ధి జ్ఞానేంద్రియసహితము గను, వానివృత్తులతోడను, కర్తృత్వాద్యహంకారముతోను గూడి విజ్ఞానమయకోశ మనఁబడును. ఈవిజ్ఞానమయకోశము పురుషునకు జన్మమృత్యురూపబంధహేతువు. కాఁబట్టి ఆత్మ కుపాధియైనను బుద్ధి ఆత్మ కాఁజాలదు.

అనువ్రజచ్చిత్ప్రతిబింబశక్తి
ర్విజ్ఞానసంజ్ఞః ప్రకృతేర్వికారః
జ్ఞానక్రియావా నహమిత్యజస్రం
దేహేన్ద్రియాది ష్వభిమన్యతే భృశమ్. 187

తా. హారమునందలి సూత్రమువలె జాగ్రదాద్యవస్థా త్రయమందును అనుగతమగు చైతన్యముయొక్క ప్రతిబింబము విజ్ఞానమయకోశ మనఁబడును. ప్రకృతివికార మగు నీవిజ్ఞాన మయకోశమే జీవుఁ డనఁబడును. ఈజీవుఁడు 'ఇది శరీరము, ఇది ఘటము' అను నీమొదలగు జ్ఞానము గలిగి 'నేను చేయు చున్నాను, నేను వ్రాయుచున్నాను' అను నీమొదలగుక్రియ లందు కర్తృత్వాభిమానముగలిగి సంసారసుఖదుఃఖముల ననుభవించుచుండును.

అనాదికాలోఽయ మహంస్వభావో
జీవః సమస్త వ్యవహారవోఢా,
కరోతి కర్మాణ్యనుపూర్వవాసనః
పుణ్యాన్యపుణ్యాన్యపి తత్ఫలాని. 188

తా. (చిత్ప్రతిబింబమగు) జీవుఁడు అనాదికాలము (జన్మపరంపరల) నుండి అహంకారస్వభావయుక్తుఁడై (రథసారథివలె) సమస్తవ్యవహారములను జేయుచు, పూర్వవాసనాప్రేరితుఁడై పుణ్యకర్మలను పాపకర్మలను జేయుచు, వానిఫలముల ననుభవించుచుండును.

భుఙ్క్తే విచిత్రాస్వపి యోనిషు వ్రజ
న్నాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేషః,
అస్యైవ విజ్ఞానమయస్య జాగ్ర
త్స్వప్నాద్యవస్థా సుఖదుఃఖభోగః. 189

తా. ఈవిజ్ఞానమయుఁడు పశుపక్ష్యాద్యనంతయోనులందుఁ బుట్టుచు పూర్వకర్మఫలానుభవానంతరము పరలోకమున కేగి మఱల జన్మించుచుండును. వీనికి జాగ్రత్స్వప్నసుషుప్తులవస్థలు, సుఖదుఃఖములు అనుభవము.

దేహాదినిష్ఠాశ్రమధర్మకర్మ
గుణాభిమానః సతతం మమేతి,
విజ్ఞానకోశోఽయమతిప్రకాశః
ప్రకృష్టసాన్నిధ్యవశాత్పరాత్మనః,
అతో భవత్యేష ఉపాధిరస్య
యదాత్మధీః సంసరతి భ్రమేణ. 190

తా. ఈవిజ్ఞానమయకోశము (బుద్ధిగుహ) పరాత్మకు (ప్రత్యగాత్మకు) నత్యంతసన్నిహితమై యుండు కారణమున అతిప్రకాశమానమై, జడములగు దేహేంద్రియాదులను ప్రకాశింపఁజేయుచు, దేహస్థమై వర్ణాశ్రమధర్మములందును,

తత్తత్కర్మలందును, సత్త్వాదిగుణములందును తాదాత్మ్యమును బొంది సర్వదా వర్తించుచుండును. ఈహేతువువలన విజ్ఞానమయకోశము ఆత్మకు ఉపాధి యగును. మఱియు దేహాదికమందు ఆత్మబుద్ధి గలిగి భ్రాంతిచే సంసారమందు పరిభ్రమించును.

యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది 1స్ఫురత్యయం
కూటస్థః సన్నాత్మా కర్తా భోక్తా భవత్యుపాధిస్థః. [జ్యోతిః,

తా. విజ్ఞానమయకోశసంపర్కమువలన స్వయంప్రకాశస్వరూపుఁడగు పరమాత్మయు విజ్ఞానమయుఁడని అజ్ఞానమువలనఁ జెప్పఁబడుచున్నాఁడు. ఈవిజ్ఞానమయుఁడు ప్రాణేంద్రియాంతరకరణములందుఁ బ్రకాశించుచుండును. కూటస్థుఁడే ఉపాధియుక్తుఁడగుటవలన కర్తయు భోక్తయు ననఁబడును.

వి. "మిథ్యాబుద్ధిచిదాభాసే అనంగరూపత్వేన కూటవత్వృత్తి ప్రతీతి కూటస్థః" అని కూటశబ్దమున కర్థము. హృదిపదమందలి 'హృత్' శబ్దమునకు బుద్ధి యని భావము. కారణ మేమన బుద్ధి హృదయకమలమందు ఉపస్థితమై యున్నది. అందువలన హృదయ మనఁగా బుద్ధి యనియుఁ దెలియఁబడుచున్నది. బుద్ధి పరిశుద్ధమై ఆత్మకు సమీపమందుండునపుడు ఆత్మచైతన్యజ్యోతి బుద్ధియందుఁ బ్రతిబింబించును. ఈసంబంధమువలన బుద్ధియందు ఆత్మాభిమానము కలుగును. బుద్ధికి సమీపమున మనస్సున్ను' మనస్సుతో సంబంధించి ఇంద్రియగణమున్ను, ఇంద్రియగణముతో సంబంధించి సర్వశరీరమున్ను ఉండుటచే బుద్ధియందుఁ బ్రతిబింబించిన ఆత్మచైతన్యమే సకలేంద్రియములకు సర్వశరీరమునకును చైతన్యము గలిగించుచున్నది. పర్యవసాన మేమ

1స్ఫురత్స్వయం జ్యోతిః.

నఁగా, సహస్రారముయొక్క కర్ణిక (The Centre of the Brains) యే బుద్ధిగుహ యనియు, దానియందు పరమాత్మ (ప్రత్యగాత్మ) యుండు ననియు, ఆయాత్మచైతన్యము బుద్ధి ద్వారా సర్వత్ర వ్యాపించి దేహేంద్రియాదులను వ్యవహార సమర్థములుగఁ జేయుచుండు ననియు ఆత్మవేత్తలు చెప్పెదరు.

స్వయం పరిచ్ఛేదముపేత్య బుద్ధే
స్తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః,
సర్వాత్మకః సన్నపి వీక్షతే స్వయం
స్వతః పృథక్త్వేన మృదో ఘటానివ. 192

తా. పరమాత్మ స్వయముగ సర్వాత్మకుఁడును సర్వస్వరూపుఁడు నైయుండియు, మిథ్యాత్మబుద్ధివలనఁగలిగిన తాదాత్మ్యదోషముచేత కారణదేహమందు జీవభావమును బొంది, మృత్తు వేఱు, ఘటము వేఱు నని యనుకొనినట్లు, తాను వేఱు, దృశ్యము వేఱు అని యనుకొనుచున్నాఁడు. నిజము విచారింపఁగా (జ్ఞానదృష్టిచే) ఆత్మేతర మెద్దియును లేదు.

ఉపాధిసంబన్ధవశాత్పరాత్మా
హ్యుపాధిధర్మాననుభాతి తద్గుణః,
అయోవికారా నవికారవహ్నివ
త్సదైకరూపోఽపి పరః స్వభావాత్. 193

తా. అవికారి యగువహ్ని కాల్పఁబడిన యినుముయొక్క ఆకృతినిఁ బొంది వికృతిగాఁ గనుబడునట్లు, పరమాత్మ బుద్ధిరూపోపాధియొక్క తాదాత్మ్యసంబంధమువలన కర్తృత్వభోక్తృత్వాది ఉపాధిధర్మవిశిష్టుఁ డయినట్లు తోఁచునే కాని, స్వభావము

చేత సర్వదా ఏకరూపుఁడు. బుద్ధిధర్మము లాయన కెంతమాత్ర మును లేవు.

శిష్య ఉవాచ.—

భ్రమేణాప్యన్యథా వాస్తు జీవభావః పరాత్మనః,
తదుపాధేరనాదిత్వా న్నానాదేర్నాశ ఇష్యతే. 194
అతోఽస్య జీవభావోఽపి నిత్యో భవతి సంసృతిః,
న నివర్తేత తన్మోక్షః కథం మే శ్రీగురో వద. 195

శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:—

తా. మహాత్మా! గురువరా! పరమాత్మకు జీవభావము భ్రాంతివలననే కలుగుఁగాక, మఱి యేయితరకారణముచేతనో కలుగుఁగాక, జీవునకు ఉపాధి యగు అవిద్య అనాదియైనది కనుక నా అవిద్యకు నాశము లేదు. ఆకారణమువలన ఆత్మకు జీవ భావముసయితము నిత్యమే యగును. అందువలన జన్మమృత్యు రూప సంసారసయితము నిత్యమగుటచే నివర్తింపదు. ఇఁకను ఈయనర్థనివృత్తియు, తన్నివృత్తిద్వారా పరమానందప్రాప్తియు నెట్లగునో దయ యుంచి ఆనతీయుఁడు.

శ్రీగురురువాచ.-

సమ్యక్పృష్టం త్వయా వత్స సావధానేన తచ్ఛృణు,
ప్రామాణికీ న భవతి భ్రాన్త్యా మోహితకల్పనా. 196

తా. వత్సా! నీవు మంచిప్రశ్నమునే చేసితివి. నీప్రశ్న మునకు సమాధానముం జెప్పెద. సావధానముగ వినుము. భ్రాంతికల్పిత మగువస్తువు యథార్థము కాదు. భ్రమసిద్ధమగుట వలన నది కల్పనమాత్రమే యగును.

భ్రాన్తిం వినా త్వసంగస్య నిష్క్రియస్య నిరాకృతేః,
న ఘటేతార్థసంబన్ధో నభసో నీలతాదివత్. 197

తా. శూన్యమును రూపరహితము నగు ఆకాశమునల్లగ నున్నదనుట భ్రాంతిమాత్రమే యైనట్లు సంగరహితుఁడును, నిష్క్రియుఁడును, నిరాకారుఁడును అగు పరమాత్మకు విషయ సంబంధమును ఘంటించుట భ్రాంతిమాత్రమే.

స్వస్య ద్రష్టుర్నిర్గుణస్యాక్రియస్య
ప్రత్యగ్బోధానన్దరూపస్య బుద్ధేః,
భ్రాన్త్యా ప్రాప్తో జీవభావో న సత్యో
మోహాపాయే నాస్త్యవస్తు స్వభావాత్. 198

తా. స్వయంద్రష్టయు, నిర్గుణుఁడును, నిష్క్రియుఁడును ప్రత్యగ్బోధానందస్వరూపుఁడును అనఁగా సర్వసాక్షియు కేవలా నందస్వరూపుఁడును అగు ఆత్మకు జీవభావముః బుద్ధిప్రమాదము వల్ల ప్రాప్తించినదిగాని సత్యముకాదు. కనుక భ్రాంతి తొలఁగఁ గనే జీవభ్రాంతియుఁ దొలంగును.

యావద్భ్రాన్తిస్తావదేవాస్య సత్తా
మిథ్యాజ్ఞానోజ్జృంభితస్య ప్రమాదాత్,
రజ్జ్వాం సర్పో భ్రాన్తికాలీన ఏవ
భ్రాన్తేర్నాశే నైవ సర్పోఽపి తద్వత్. 199

తా. త్రాడును జూచి యది సర్ప మనుకొనుట బుద్ధి ప్రమాదము. ఎంతదనుక నీమిథ్యాజ్ఞాన ముండునో అంతవఱకు మాత్రమే సర్పభ్రాంతి యుండును. ఆభ్రాంతి తొలఁగఁగనే సర్పబుద్ధి తొలంగి యథార్థమగు త్రాడుమాత్రమే శేషించును.

ఆవిధమునసే ఎంతకాలపర్యంతము జన్మమరణరూపజీవత్వ ధర్మ ప్రతీతిరూప భ్రాంతి నిలిచి యుండునో అంతపర్యంతము మిథ్యా కల్పితజీవసత్త యుండును. ఆ భ్రాంతి నివారణకాఁగా జీవభావము తొలఁగి ఆత్మసత్త స్ఫురించును.

అనాదిత్వమవిద్యాయాః కార్యస్యాపి తథేష్యతే,
ఉత్పన్నాయాం తు విద్యాయామావిద్యక మనాద్యపి. 200
ప్రబోధే స్వప్నవత్సర్వం సహమూలం వినశ్యతి,

తా. స్వప్నమందుఁ దోఁచు సమస్తవిషయములును మెలఁకువరాఁగా నదృశ్య మగును. ఆ ప్రకారమే, అనాది యగు అవిద్యయు అవిద్యాకార్యమున్ను జ్ఞానోత్పత్తి యైనంతనే నశించును. అనఁగా అవిద్య అనాదియైనను విద్యచే నశించును.

అనాద్యపీదం నో నిత్యం ప్రాగభావ ఇవ స్ఫుటమ్. 201
అనాదేరపి విధ్వంసః ప్రాగభావస్య వీక్షితః,

తా. ప్రాగభావ మనఁగా, ప్రాక్ = పూర్వము, అభావః = లేనిది. ఎట్లన, ఘటము పుట్టకముందు ఘటము లేదుగనుక, అపుడు ఘటాభావము అనాదిగా నున్నది. ఘటము పుట్టినపిమ్మట ఆ అనాది యగు అభావము నశించును. ఆఘటప్రాగభావమువలెనే మాయ (అవిద్య) అనాది యైనను దానికి ప్రతియోగి యగు జ్ఞానము (విద్య) ఉత్పత్తికాఁగా మాయ నశించును. మఱియు, తిమిరమునకు తేజస్సు ప్రతియోగియగుటవలన తేజస్తిమిరములు రెండును ఏకకాలమందు ఉండవు. తేజస్సు లేనప్పుడు తిమిర ముండవచ్చునుగాని, తేజస్సు ఉండఁగా తిమిర ముండుట అసంభవము. అట్లే జ్ఞానోదయమైనపిమ్మట అజ్ఞానము సహజము గనే నశించు నని అభిప్రాయము.

యద్బుద్ధ్యుపాధిసంబంధా త్పరికల్పితమాత్మని. 202
జీవత్వం న తతోఽన్యత్తు స్వరూపేణ విలక్షణః,
సంబన్ధః స్వాత్మనో బుద్ధ్యా మిథ్యాజ్ఞానపురస్సరః. 203

తా. బుద్ధ్యుపాధిసంబంధమువలన పరమాత్మయందు జీవత్వము కల్పింపఁబడుచున్నది. కాని, అది ఆత్మకంటె నన్యముగాదు. అయినను ఆత్మగా నేలస్ఫురింప దనిన, దృగ్రూపమగు ఆత్మకంటె విలక్షణ మగు దృశ్యప్రపంచముగఁ దోఁచుట మిథ్యాత్మకమగు బుద్ధిచేతఁ గల్పింపఁబడినది. ఇచ్చట "నిరంతరంభాసమానేకూటస్థే జ్ఞప్తిరూపతః, తద్భాసా భాస్యమానేయం బుద్ధిర్నృత్యత్యనేకధా." అనెడి వేదాంతపంచదశీవాక్యము ప్రమాణము.

వినివృత్తిర్భవేత్తస్య సమ్యగ్జ్ఞానేన నాన్యథా,
బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సమ్యగ్ జ్ఞానం శ్రుతేర్మతమ్. 204

తా. ఈ మిథ్యాజ్ఞానము సమ్యగ్జ్ఞానమువలనఁ దొలఁగునుగాని కర్మోపాసన మొదలగు నే యితరోపాయముచేతను దొలఁగదు. సమ్యగ్జ్ఞాన మనఁగా బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము అని శ్రుతిసమ్మతము.

తదాత్మానాత్మనోః సమ్యగ్వివేకేనైవ సిధ్యతి,
తతో వివేకః కర్తవ్యః ప్రత్యగాత్మాసదాత్మనోః. 205

తా. ఆసమ్యగ్జ్ఞానము (యథార్థజ్ఞానము) ప్రత్యగాత్మ యొక్కయు అనాత్మయగు దేహాదిదృశ్యప్రపంచముయొక్కయు నిజస్వరూపమును పలుమాఱు లెస్సగ విచారించుటవలన సిద్ధించును. కనుక ప్రత్యగాత్మ అనాత్మలయొక్క యథార్థస్వరూపమును విచారింపవలెను.

అవ. అనాత్మభ్రాంతినివృత్తియు సదాత్మజ్ఞానమును ఎట్లగునో సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

జలం[1]పఙ్కవదస్పష్టం పఙ్కాపాయే జలం స్ఫుటమ్,
యథా భాతి తథాత్మాపి దోషాభావే స్ఫుటప్రభః. 206

తా. బురదతోఁ గూడియున్న నీటిని చిల్లగంధముతో శుద్ధపర్చగా బురద వేఱై శుద్ధజలము లభించును. ఆప్రకారమే బ్రహ్మజ్ఞానప్రసాదమువలన ఆవరణాదిదోషరహితమై ప్రత్యగాత్మ స్ఫుటముగ స్ఫురించును.

అసన్నివృత్తౌ తు సదాత్మనః స్ఫుట
ప్రతీతిరేతస్య భవేత్ప్రతీచః,
తతో నిరాసః కరణీయ ఏవా
సదాత్మనః సాధ్వహమాదివస్తునః. 207

తా. అవిద్యాతత్కార్యనివృత్తివలన ప్రత్యగభిన్న సదాత్మ స్ఫుటముగ, అనఁగా అవిద్యాదోషరహితముగ ప్రతీతమగును. కాబట్టి సాధువులు (బ్రహ్మజ్ఞానాసక్తులు) అహంకారాది సకలానాత్మవస్తుసముదాయమును బూర్తిగ నిరసింపవలెను. అనఁగా అనాత్మవస్తువులందు ఆత్మబుద్ధిని విడువవలెను.

అతో నాయం పరాత్మా స్యాద్విజ్ఞానమయశబ్దభాక్
వికారిత్వాజ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వహేతుతః,
దృశ్యత్వద్వ్యభిచారిత్వాన్నానిత్యో నిత్య ఇష్యతే. 208

తా. పూర్వోక్తకారణములవలన విజ్ఞానమయకోశము పరాత్మ కాదు. ఏలయన, నీవిజ్ఞానమయకోశము వృద్ధిక్షయాది

1 పఙ్కవదత్యన్తం.

వికారములు గలది, జడము, పరిచ్ఛిన్నము అనఁగా నేకదేశి (ఒక ఆవరణములో నిమిడి యుండునది), దృశ్యము, వ్యభిచారి (సదా ఏకరూపమున నుండనిది), అనిత్యము. కనుక పరాత్మ కాదు.

అవ. ఆనందమయకోశవివరణము:—

ఆనన్దప్రతిబింబచుంబితతనుర్వృత్తిస్తమోజృంభితా
స్యాదానన్దమయః ప్రియాదిగుణకః స్వేష్టార్థలాభోదయః,
పుణ్యస్యానుభవే విభాతి కృతినామానన్దరూపః స్వయం
భూత్వానందతి యత్రసాధు తనుభృన్మాత్రః ప్రయత్నం వినా.

తా. తమోగుణపరిణామ మగు ఆనందప్రతిబింబయుక్త సూక్ష్మాంతఃకరణవృత్తి ఆనందమయకోశ మనఁబడును. ఈ ఆనందమయకోశము ప్రియమోదప్రమోదాది గుణములు గలది. ఇష్టవస్తుసంబంధమువలన నుత్పత్తి యగును. పుణ్యపురుషులకు పుణ్యఫలానుభవరూపమునఁ బ్రకాశించును. అంతర్ముఖమైన బుద్ధివృత్తి గలవారలను తాను స్వయముగ ఆనందరూపమై ప్రసన్నులుగఁ జేయును. అట్టి ఆనందస్వరూపమున పవిత్రశరీరధారులగు మహాత్ములకు నప్రయత్నముగనే ఆనందప్రాప్తి యగును.

వి. ఇష్టవస్తువును జూచుటవలనఁ గలుగుసుఖము ప్రియము. ఇష్టవస్తుప్రాప్తివలనఁ గలుగుసుఖము మోదము. ఇష్టవస్త్వనుభవమువలనఁ గలుగుతృప్తి ప్రమోదము.

ఆనన్దమయకోశస్య సుషుప్తౌస్ఫూర్తి రుత్కటా,
స్వప్నజాగరయోరీషదిష్టసందర్శనాదినా. 210

తా. సుషుప్త్యవస్థయందు (వృత్తు లంతఃకరణమందు లీనమై యుండుటవలన) ఆనందమయకోశముయొక్క ప్రతీతి (స్ఫూర్తి) అధికమై యుండును. స్వప్నజాగ్రదవస్థలందు ఇష్టవస్తుసందర్శనాది బాహ్యకారణమువలన ఆనందమయకోశ ప్రతీతి తక్కువయి యుండును.

అవ. ఈ ఆనందమయకోశము సయితము ఆత్మ కాదని స్ఫుటపర్చుచున్నారు:—

నైవాయమానన్దమయః పరాత్మా
సోపాధికత్వాత్ప్రకృతేర్వికారాత్,
కార్యత్వహేతోః సుకృతక్రియాయా
వికారసంఘాతసమాహితత్వాత్. 211

తా. ఈ ఆనందమయకోశము సయితము తమోగుణ రూపోపాధిగలది గనుకను, ప్రకృతిపరిణామ మగుటచేతను, సుకృతకర్మఫలానుభవము గలది కనుకను, నానావిధవికారసముదాయరూపమగుటచేతను ఆత్మ కాదు.

అవ. ఇట్లు పంచకోశనిషేధానంతరము శేషించు సర్వాధిష్ఠానపరమాత్మను దెలిసికొనువిధానమును జెప్పుచున్నారు:—

పంచానామపి కోశానాం నిషేధే యుక్తితః శ్రుతేః,
తన్నిషేధావధిః సాక్షీ బోధరూపోఽవశిష్యతే. 212

తా. యుక్తిచేతను, శ్రుతిప్రమాణములచేతను అన్నమయాదిపంచకోశములను నిషేధింపఁగా, సర్వసాక్షియు బోధ (జ్ఞాన) స్వరూపుఁడునగు పరమాత్మ శేషించును.

వి. స్థూలశరీరము అన్నమయకోశము. దానిలోపలిది ప్రాణమయ కోశము. ఆప్రాణమయకోశములోపల మనోమయ కోశము గలదు. మనోమయకోశములోపల విజ్ఞానమయకోశము గలదు. దానిలోపల ఆనందమయకోశము (బుద్ధిగుహ) కలదు. ఈపంచకోశములును జడము లగుటవలన పరాత్మ కాఁజాలవు. పరాత్మ 134 శ్లోకములో సూచింపఁబడినట్లు ఈబుద్ధిగుహయందుఁ గల చిదాకాశోపరిభాగమున కూటస్థాత్మ (ప్రత్యగాత్మ) ప్రకాశించుచుండు నని అభిప్రాయము.

యోఽయమాత్మా స్వయం జ్యోతిః పంచకోశవిలక్షణః,
అవస్థాత్రయసాక్షీ సన్నిర్వికారో నిరంజనః,
సదానన్దః స విజ్ఞేయః స్వాత్మత్వేన విపశ్చితా. 213

తా. అట్లు శేషించిన పరమాత్మ స్వయంప్రకాశ స్వరూపుఁడు, పంచకోశవిలక్షణుఁడు, జాగ్రదాద్యవస్థాత్రయము నకు సాక్షియునై స్వమహిమతోఁ బ్రకాశించుచుండును. మఱియు నీ పరమాత్మ కర్తృత్వాదివికారములు లేనివాఁడు. నిరంజనుఁడు అనఁగా అవిద్యాతత్కార్యసంపర్కము లేనివాఁడు సర్వదా ఆనందస్వరూపుఁడు. అట్టి పరమాత్మయే 'నేను' అని పండితుఁడు (తత్వజ్ఞాని) తెలిసికొనవలెను.

శిష్య ఉవాచ.—

శిష్యుఁడు ప్రశ్నించుచున్నాఁడు:—

మిథ్యాత్వేన నిషిద్ధేషు కోశేష్వేతేషు పంచసు,
సర్వాభావం వినా కించి న్న పశ్యా మ్యత్ర హే గురో,
విజ్ఞేయం కిము వస్త్వస్తి స్వాత్మ నాత్ర విపశ్చితా. 214

తా. స్వామీ! గురువరా! అన్నమయాదిపంచకోశము లును మిథ్య యని నిషేధింపఁగా సర్వాభావమై నా కేద్దియును గోచరించుటలేదు. ఇట్లు ద్వితీయవస్తు వెద్దియు గోచరింపనపుడు ఆత్మజ్ఞాని తెలియఁదగినవస్తు వెద్ది?

శ్రీగురు రువాచ.—

శ్రీగురు వుత్తర మిచ్చుచున్నారు:—

సత్యముక్తం త్వయా విద్వన్నిపుణోఽసి విచారణే,
అహమాదివికారాస్తే తదభావోఽయ మప్యను. 215
సర్వే యేనానుభూయన్తే యః స్వయం నానుభూయతే,
త మాత్మానం వేదితారం విద్ధి బుద్ధ్యా సుసూక్ష్మయా. 216

తా. వత్సా! తత్త్వమును లెస్సగ విమర్శించెడి నీవు సత్యమునే వచించితివి. ఆత్మవిచారమందు నీవు నిపుణుఁడవు. అహంకారాది దేహాంతముగఁగల ధర్మాధర్మాదివికారములును తదభావమున్ను సాక్షీ యగు నేయాత్మవలన ననుభవింపఁబడుచున్నవో, ఏయాత్మ తాను స్వయముగ ననుభవించుటలేదో, ("యేన సర్వం విజానాతి తత్కేన విజానీయాత్ విజ్ఞాతారమరే కేన విజానీయాత్." అనెడి శ్రుతిప్రమాణముగ) అట్టి సర్వజ్ఞుఁడగు వాఁడే ఆత్మయని సూక్ష్మబుద్ధిచే నెఱుంగుము.

తత్సాక్షికం భవేత్తత్తద్యద్యద్యేనాను భూయతే,
కస్యాప్యననుభూతార్థే సాక్షిత్వం నోపయుజ్యతే. 217

తా. ఏయేపదార్థము ఎవని (చైతన్యము) వలన ననుభవింపఁబడునో ఆయావస్తువున కతఁడు సాక్షీ యగును. అట్లనుభవింపఁబడనియెడల అనుభవమునకు సాక్షిత్వము కలుగదు.

తా నసుభవించినదానికిఁ దానుసాక్షి యగునుగాని, అనుభవింపని వస్తువున కెవ్వఁడును సాక్షి కాఁజాలఁడు. ఇది లోకప్రసిద్ధము.

అసౌ స్వసాక్షికో భావో యతః స్వేనానుభూయతే,
అతః పరం స్వయం సాక్షాత్ప్రత్యగాత్మా న చేతరః. 213

తా. (అనుభవరూపమగు) ఈ యాత్మ స్వేతరముచే ననుభవింపఁబడదు గనుక స్వయంజ్యోతి యగును. తనకంటె నన్యమగు జ్ఞానముగాని జ్ఞాతగాని లేమిచే సర్వసాక్షి యగు ఆత్మ దేనిచేతను అనుభవింపఁబడదు. ఇట్లు "స్వయమేవానుభూతిత్వాత్ విద్యతే నానుభావ్యతా, జ్ఞాతృజ్ఞానాంతరాభావాదజ్ఞేయోనత్వసత్తయా." అని శ్రీవిద్యారణ్యముని వచించెను. కావున ప్రత్యగాత్మ స్వసంవేద్యుఁడే కాని యితరముచేఁ దెలియఁబడదు.

జాగ్రత్స్వప్నసుషుప్తిషుస్ఫుటతరం యోఽసౌసము జ్జృంభతే
ప్రత్యగ్రూపతయా సదాహమహమిత్యన్తః స్ఫురన్నైకధా,
నానాకారవికారభాజిన ఇమాన్పశ్యన్నహం ధీముఖా
న్నిత్యానన్ద చిదాత్మనా స్ఫురతి తం విద్ధి స్వమేతం హృది.

తా. ప్రత్యగ్రూపమున సర్వదా అహమహమ్ (నేను నేను) అని అవిచ్ఛిన్నముగ అంతఃకరణమందు నానాప్రకారముల స్ఫురించుచు, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందు స్ఫుటతరమై ప్రకాశించుచు, అహంబుద్ధిలో నానావికారములను బొందెడి అనాత్మపదార్థములను జూచుచు, సచ్చిదానందస్వరూపమున స్ఫురించుచుండుపరాత్మను నీహృదయగుహాయందుఁ గనుగొని, ఆ ఆత్మయే నీ వని తెలిసికొనుము.

అవ. చిదాభాసుఁడు ఆత్మ కానేరఁడని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

ఘటోదకే బింబితమర్కబింబ
మాలోక్య మూఢో రవిమేవ మన్యతే,
తథా చిదాభాసముపాధిసంస్థం
భ్రాన్త్యాహమిత్యేవ జడోఽభిమన్యతే. 220

తా. మూఢుఁడు ఘటోదకమందుఁ బ్రతిఫలించినసూర్య బింబమును జూచి ఆప్రతిబింబమే సూర్యుఁ డని తలంచును. ఆప్రకారమే తత్త్వంపదార్థవివేకశూన్యుఁడగు జడుఁడు బుద్ధ్యుపాధిస్థితుఁ డగు చిదాభాసుఁడే తా నని (ఆత్మయని) భ్రాంతిచే ననుకొనును.

ఘటం జలం తద్గత మర్కబింబం
విహాయ సర్వం దివి వీక్ష్యతేఽర్కః,
తటస్థ ఏతత్త్రితయావ భాసకః
స్వయంప్రకాశో విదుషా యథా తథా. 221

దేహం ధియం చిత్ప్రతిబింబమేతం
విసృజ్య బుద్ధౌ నిహితం గుహాయామ్,
ద్రష్టారమాత్మానమఖణ్డబోధం
సర్వప్రకాశం సదసద్విలక్షణమ్. 222

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మ
మన్తర్బహిఃశూన్యమనన్యమాత్మనః,
విజ్ఞాయ సమ్యఙ్నిజరూపమేత
త్పుమాన్విపాప్మా విరజా విమృత్యుః. 223

విశోక ఆనన్దఘనో విపశ్చి
త్స్వయం కుతశ్చి న్న బిభేతి కశ్చిత్.

నాన్యోఽస్తి పన్థా భవబన్ధముక్తే
ర్వినా స్వతత్త్వావగమం ముముక్షోః. 224

తా. (పైని నుదాహరింపఁబడిన) ఘటము, జలము, ఘట జలమందుఁ బ్రతిఫలించిన సూర్యప్రతిబింబము నను నీసర్వమును త్యజించి, వీనికిఁ దటస్థముగ నుండి, వీనినిఁ బ్రకాశింపఁజేయుచు, గగనమున తాను స్వయముగఁ బ్రకాశించు సూర్యునిఁ బండితులు ఘటాదికముకంటె భిన్నునిగ నెంచుచున్నారు. ఆప్రకారమే (ఘటమువంటి) స్థూలశరీరము, (జలమువంటి)బుద్ధి,(సూర్యప్రతిబింబమువంటి) చిత్ప్రతిబింబుఁడగు జీవుఁడు నను నీమూఁడింటిని త్యజించి, సర్వద్రష్టయు, అఖండజ్ఞానస్వరూపుఁడును, సర్వవ్యష్టిసంఘాతప్రకాశకుఁడును,సదసద్విలక్షణుఁడును, నిత్యుఁడును ప్రభువును, సర్వగతుఁడును, అత్యంతసూక్ష్మస్వరూపుఁడును, బాహ్యాభ్యంతర భావరహితుఁడును, బుద్ధిగుహాయం దుండువాఁడును అగు కూటస్థాత్మను సంశయాదిరహితముగను అపరోక్షముగను దెలిసికొనిన పురుషుఁడు రజోగుణశూన్యుఁడై (విక్షేపరహితుఁడై), మృత్యువు లేనివాఁడై, శోకరహితుఁడై నిత్యానందస్వరూపుఁడగును. అట్టి విద్వాంసునకు (జ్ఞానికి) భయకారణ మెంతమాత్రమును లేదు. కనుక ముముక్షువునకు సంసారబంధవిముక్తికి స్వస్వరూపజ్ఞానముకంటె నితరమార్గము లేదు.

✓ అవ. ఆత్మవిజ్ఞానస్వరూపమును దానిఫలమును వివరించుచున్నారు:—

బ్రహ్మాభిన్నత్వవిజ్ఞానం భవమోక్షస్య కారణమ్,
యేనాఽద్వితీయమానన్దం బ్రహ్మ సంపద్యతే బుధైః. 225

తా. 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మ మను) అనెడి బ్రహ్మా భిన్నాఖండాకారవృత్తి విజ్ఞాన మనఁబడును. అట్టి విజ్ఞానము సంసారబంధవిముక్తికి హేతు వగును. అట్టి విజ్ఞానముగల పండితుఁడు అఖండానందమును బొందును. అనఁగా తానే సచ్చిదానందరూప బ్రహ్మమై విలసిల్లును.

అవ. అయ్యా! బ్రహ్మప్రాప్తిగల విద్వాంసునకు సంసారాపత్తి కలదా, లేదా యను ప్రశ్నమునకు సమాధానము సెప్పుచున్నారు:—

బ్రహ్మభూతస్తు సంసృత్యై విద్వాన్నావర్తతే పునః,
విజ్ఞాతవ్యమతః సమ్యగ్బ్రహ్మాభిన్నత్వమాత్మనః. 226

తా. పైనిఁ జెప్పఁబడినట్లు బ్రహ్మస్వరూపుఁడైన విద్వాంసుఁడు తల్లిగర్భమున మఱల జనింపఁడు. అనఁగా పునర్జన్మ రహితుఁడై బ్రహ్మమే తా నగును. కావున బ్రహ్మాభిన్నత్వజ్ఞాన ప్రాప్తికై లెస్సఁగఁ బ్రయత్నింపవలెను.

వి. పండితుఁ డన్నను విద్వాంసుఁడన్నను ఆత్మతత్త్వమును దెలిసికొనిన విజ్ఞానియేకాని బ్రహ్మవిద్యయందు శాస్త్రజ్ఞాన మాత్రమే కలవాఁడు కాఁడు.

అవ. జ్ఞాతవ్య వస్తువుయొక్క శ్రుత్యుక్తస్వరూపలక్షణములను జెప్పుచున్నారు:—

సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ విశుద్ధం పరం స్వతః సిద్ధమ్,
నిత్యానన్దైకరసం ప్రత్యగభిన్నం నిరన్తరం జయతి. 227

తా. అబాధితసత్తాస్వరూపము అనఁగా కాలత్రయమందును నాశరహితమయినది, స్వప్రకాశము, దేశకాలవస్తుపరి

చ్ఛేదరహిత మగుటచే అనంతరము, అత్యంతశుద్ధస్వరూపము, సర్వోత్కృష్టము, అనాది యగుటచే స్వతఃసిద్ధము, శాశ్వతానందస్వరూపము, కూటస్థాత్మాభిన్నమును అగు పరబ్రహ్మము నిరంతరము ప్రకాశించుచుండును.

సదిదం పరమాద్వైతం స్వస్మాదన్యస్య వస్తునోఽభావాత్,
న హ్యన్యదస్తి కించిత్సమ్యక్పరతత్త్వబోధసుదశాయామ్.

తా. తనకంటె (ఆత్మకంటె) నితరవస్తువు గోచరింపకుండు స్థితియే పరమాద్వైతము. అట్టి పరతత్త్వబోధ కలిగిన శుభావస్థయందు బ్రహ్మాతిరిక్త మగువస్తు వెద్దియు గోచరింపక సర్వమును బ్రహ్మముగానే స్ఫురించుచుండును. ఏమనఁగా, సృష్టికిఁ బూర్వమందును బరమందును గల్పితప్రపంచము లేనిది. పరతత్త్వము (పరమాత్మ) మాత్రము సత్యము నిత్యము. కనుక పరతత్త్వబోధకలిగినదశయందు బ్రహ్మేతర మెద్దియు స్ఫురింపదు. ఇదియే జీవన్ముక్తిస్థితి.

అవ. ఇట్లు పై ౧౮ శ్లోకములలో విజ్ఞేయవస్తుస్వరూపమును నిరూపించి, యింకను దృశ్యప్రపంచముయొక్క మిథ్యాత్వమును విశదీకరించుచున్నారు:—

యదిదం సకలం విశ్వం నానారూపం ప్రతీతమజ్ఞానాత్,
తత్సర్వం బ్రహ్మైవ ప్రత్యస్తాశేషభావనాదోషమ్. 229

తా. ఈసర్వప్రపంచమును అజ్ఞానమువలన నానారూపములుగఁ బ్రతీత మగుచున్నదే కాని జ్ఞానదశయందు ఆయా నామరూపములు స్ఫురింపక అధిష్ఠానబ్రహ్మముమాత్రమే స్ఫురించును.

మృత్కార్యభూతో௨పి మృదో న భిన్నః
కుంభో௨స్తి సర్వత్ర తు మృత్స్వరూపాత్,
న కుంభరూపం పృథగస్తి కుంభః
కృతో మృషాకల్పిత నామమాత్రః. 230

తా. ఘటము మృత్తికయొక్క కార్యమయినను (తన కారణమగు) మృత్తుకంటె వేఱు కాదు. ఏల యనఁగా, కుంభము యొక్క ఆకారము బాహ్యాభ్యంతరములందు మృద్రూపము కంటె భిన్నముగ లేదు. ఇట్లుండఁగా, అవిద్యచేఁ గల్పింపఁబడిన నామమాత్రము గలకుంభము స్వరూపముతో నెట్లుండును? అనఁగా కారణముకంటె భిన్నముగఁ గార్య ముండదని యభిప్రాయము.

కేనాపి మృద్భిన్నతయా స్వరూపం
ఘటస్య సందర్శయితుం న శక్యతే,
అతో ఘటః కల్పిత ఏవ మోహా
న్మృదేవ సత్యం పరమార్థభూతమ్. 231

తా. మట్టినుండి ఘటస్వరూపమును వేఱుగాఁ జూపుట కెవ్వనికిని శక్యము కాదు. కనుక ఘటముయొక్క నామరూపములు మోహ (అజ్ఞాన) కల్పితములు. ఘటకారణమగు మృత్తిక మాత్రమే సత్యము. ఇచట, "యథైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం స్యాద్వికారో నామధేయోమృత్తికేత్యేవ సత్యమ్." అను శ్రుతి ప్రమాణము.

అవ. మృత్తునుండి ఘటాదికార్యమువలెనే బ్రహ్మము నందుఁ గల్పితమగుకార్యము బ్రహ్మమేకాని వేఱుకాదని చెప్పుచున్నారు:—

సద్బ్రహ్మకార్యం సకలం సదేవ
సన్మాత్రమేతన్న తతోఽన్యదస్తి,
అస్తీతి యోవక్తి నతస్య మోహో
వినిర్గతో నిద్రితవత్ప్రజల్పః. 232

తా. సద్రూపమగు బ్రహ్మమునుండి యుత్పన్నమైన సకల జగత్తు బ్రహ్మమాత్రమే కాని బ్రహ్మముకంటె వేఱు కాదు. భిన్నమే యని యెవఁడు చెప్పునో వానికి అజ్ఞానము నశింపక పోవుటవలన వానిమాటలు నిద్రితునియొక్క పలవరింతలని చెప్పవచ్చును.

బ్రహ్మవేదం విశ్వమిత్యేవ వాణీ
శ్రౌతీ బ్రూతేఽథర్వనిష్ఠా వరిష్ఠా,
తస్మాత్సర్వం బ్రహ్మమాత్రం హి విశ్వం
నాధిష్ఠానాద్భిన్నతా రోపితస్య. 233

తా. ఈవిశ్వమంతయు బ్రహ్మమే యని శ్రేష్ఠమగు అథర్వవేదవాక్కు నుడువుచున్నది. కనుక, రజ్జువునం దారోపింపఁబడిన సర్పము రజ్జువుకంటె వేఱు కానియట్లు, సర్వాధిష్ఠానమగు బ్రహ్మమునందు అజ్ఞానముచే నారోపింపఁబడిన ప్రపంచము బ్రహ్మముకంటె భిన్నము కాదు. కల్పితవస్తువు అధిష్ఠానవస్తువుకంటె వేఱు కాదు.

సత్యం యది స్యాజ్జగదేత దాత్మనోఽ
నన్తత్వహానిర్నిగమాప్రమాణతా,
అసత్యవాదిత్వ మపీశితుః స్యా
న్నైతత్త్రయం సాధుహితం మహాత్మనామ్. 234

తా. దృశ్యప్రపంచము స్వరూపముచేత సత్యమగు నేని, ఆత్మతత్త్వమున కెంతమాత్రము భంగము కలుగదు. కాని ఆత్మ అనంత మని చెప్పెడి "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతికి భంగము కలుగుటయు, అందువలన "బ్రహ్మసత్యం జగన్మిథ్య," "ఏకమేవాద్వితీయమ్," "మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః" ఇత్యాదివాక్యములచే ప్రపంచము మిథ్య యనియు బ్రహ్మము సత్య మనియు, బ్రహ్మేతరము లే దనియుఁ జెప్పెడు వేదములు అప్రమాణము లగుటయు, దాని వలన వేదముల నావిర్భవింపఁజేసిన భగవంతునివాక్య మసత్య మగుటయు నను మూఁడుదోషములు సంభవించును. ఈదోష త్రయమును మహాత్ములు (జ్ఞానులు) అంగీకరింపరు. కార్య మగు కనకకటకము, కారణమగు స్వర్ణముకంటె భిన్నము కానియట్లు, కారణమగు (అధిష్ఠానమగు) బ్రహ్మమునందుఁ గల్పింపఁబడిన జగత్తు బ్రహ్మముకంటె వేఱు కనుక మాయాకల్పిత ప్రపంచము సత్యముకాదు.

అవ. పైశ్లోకమునందు సూచింపఁబడినభగవద్వాక్యప్రతీక మగు అర్థమును దృఢీకరించుచున్నారు: —

ఈశ్వరో వస్తుతత్త్వజ్ఞో న చాహం తేష్వవస్థితః,
న చ మత్స్థాని భూతాని త్యేవమేవ [1]వ్యచీక్లపత్. 235

తా. సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు "మయాతత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా, మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః. న చ మత్స్థాని భూతాని———" ఇంద్రియాగోచరమగు నాచేత సమస్తప్రపంచము వ్యాపింపఁబడినది.

1 వ్యచీకథత్.

సర్వభూతములు నాయందున్నవి. నేనైతే ఆభూతములయం దున్న వాఁడను గాను భూతములు నన్నంటికొని యున్నవియుఁ గావు) అని యానతిచ్చెను. కావున బ్రహ్మము సర్వవ్యాపకము, సర్వము బ్రహ్మస్వరూపమే యనెడి భగవద్వాక్యము సత్యము.

అవ. ప్రపంచము మిథ్యయని చెప్పినమాటను యుక్తిచే ద్రువపర్చుచున్నారు:—

యది సత్యం భవేద్విశ్వం సుషుప్తావుపలభ్యతామ్,
తన్నోపలభ్యతే కించిదతోఽసత్స్వప్నవన్మృషా. 236

తా. దృశ్యప్రపంచము సత్యమగునేని సుషుప్తికాల మందు సయితము ఆప్రపంచము తెలియఁబడవలెను. అల్లెంత మాత్రము తెలియఁబడుట లేదు. కనుక స్వప్నకల్పిత ప్రపంచము వలెనే దృశ్యప్రపంచము సయితము మిథ్యయే.

అతః పృథఙ్నాస్తి జగత్పరాత్మనః
పృథక్ప్రతీతిస్తు మృషా గుణాహివత్,
ఆరోపితస్యాస్తి కిమర్థవత్తా
ధిష్ఠానమాభాతి తథా భ్రమేణ. 237

తా. ఈమిథ్యాత్వహేతువుచేతనే జగత్తు పరబ్రహ్మము కంటె భిన్నసత్తాకము కాదు. పృథక్ప్రతీతియు (జగత్తు వేఱు బ్రహ్మము వేఱు నను ప్రతీతియు) మిథ్యయే. ఎట్లనఁగా భ్రాంతి వలన త్రాటియం దారోపింపఁబడిన సర్పముయొక్కస్థితి అధిష్ఠాన మగుత్రాటికంటె వేఱుగాఁ గనఁబడుటలేదు. సర్పము ప్రాతి భాసికమాత్రమే. అనఁగా త్రాడే సర్పముగ తోఁచినది. ప్రాతి

భాసికవస్తువు సత్యమగునా? కాదు. అటులనే సర్వాధిష్ఠానమగు బ్రహ్మము సత్యము. ప్రాతిభాసిక ప్రపంచ మసత్యము.

భ్రాన్తస్య యద్యద్భ్రమతః ప్రతీతం
బ్రహ్మైవ తత్తద్రజతం హి శుక్తిః,
ఇదం తయా బ్రహ్మ సదైవ రూప్యతే
త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్. 238

తా. భ్రాంతిఁజెందినవానికి భ్రాంతిచే నేదేది ప్రతీత మగునో యదియది అధిష్ఠానబ్రహ్మరూపమే యగును. ఎట్లనఁగా, భ్రాంతివలన నారోపింపఁబడిన రజతము ముత్తెపుచిప్పయే యగును. 'ఇదం జగత్' అనునపుడు సద్రూపబ్రహ్మమే నిరూపింపఁబడుచున్నది. ఆ ఇదంశబ్దవాచ్యమగు బ్రహ్మమునం దారోపింపఁబడిన జగత్తు నామమాత్రమున భిన్నముగాని సత్యముగ బ్రహ్మాభిన్నమే, అనఁగా బ్రహ్మమే.

అవ. అధిష్ఠానబ్రహ్మస్వరూపమును నాల్గుశ్లోకములచే వివరించుచున్నారు:—

అతః పరం బ్రహ్మ సదద్వితీయం
విశుద్ధవిజ్ఞానఘనం నిరంజనమ్,
ప్రశాన్తమాద్యన్తవిహీనమక్రియం
నిరన్తరానన్దరసస్వరూపమ్. 239

నిరస్తమాయాకృతసర్వభేదం
నిత్యం ధ్రువం నిష్కలమప్రమేయమ్,
అరూపమవ్యక్తమనాఖ్యమవ్యయం
జ్యోతిః స్వయం కించిదిదం చకాస్తి. 240

తా. పూర్వోక్తహేతువువలన, పరబ్రహ్మస్వరూపము ఎట్టిది యన, అది సద్రూపము, ద్వితీయరహితము [తనకంటె రెండవది లేనిది], శుద్ధజ్ఞానస్వరూపము, నిరంజనము [మాయా రహితము], ప్రశాంతము [విక్షేపశక్తిరహితము], ఉత్పత్తినాశ రహితము, అక్రియము, అవిద్యారూపాంతరశూన్యము, ఆనంద రసస్వరూపమును నై, మాయాకృతజీవేశ్వరాది భేదరహితము, త్రైకాలాబాధ్యము, అచలము, నిష్కలము, అప్రమేయము (ఊహింపశక్యము కానిది], రూపశూన్యము, అవ్యక్తము, నామ రహితము, నాశరహితమును నై స్వయంజ్యోతిఃస్వరూపమున సర్వదా తేజరిల్లుచున్నది.

జ్ఞాతృజ్ఞేయజ్ఞానశూన్యమనన్తం నిర్వికల్పకమ్,
కేవలాఖణ్డచిన్మాత్రం పరం తత్త్వం విదుర్బుధాః. 241

తా. మఱియు నాపరతత్త్వము జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయము లనెడి (తెలిసికొనువాఁడు, తెలియఁబడునది, తెలివియనెడి) త్రిపుటి లేనిది, అనంతము (త్రితయపరిచ్ఛేదశూన్యము), నిర్వికల్పకము అనఁగా పరిచ్ఛేదకల్పనగాని జాత్యాదికల్పనగాని లేనిది, కేవలము అఖండచిన్మాత్రస్వరూప మైనదియును. ఇట్టి పరతత్త్వమును 'అహం బ్రహ్మాస్మి' యని ఆత్మాభిన్నరూపముగ పండితులు (జ్ఞానులు) తెలిసికొందురు. అనఁగా బ్రహ్మసాక్షాత్కారమును బొందుదురు.

అహేయ మనుపాదేయం మనోవాచామగోచరమ్,
అప్రమేయమనాద్యన్తం బ్రహ్మ పూర్ణమహం మహః. 242

తా. ఇంకను నామపరబ్రహ్మ మెట్టి దనఁగా, హేయోపా దేయములు (గ్రహింపఁదగినది, విడువఁదగినది) లేనిది, మనస్సు

నకును వాక్కునకును గోచరము కానిది,అప్రమేయము, ఆద్యంత శూన్యమును. అట్టి సర్వవ్యాపకపరిపూర్ణబ్రహ్మమును 'అహం మహః' అనఁగా నాజ్యోతిఃస్వరూపమే నేను అని జ్ఞానులు తెలిసి కొందురు.

అవ. ఇఁకను తత్త్వమసి మహావాక్యార్థమును లక్షణ విధానమున ప్రతిపాదించుచున్నారు:—

తత్త్వంపదాభ్యామభిధీయమానయో
ర్బ్రహ్మాత్మనోః శోధితయోర్యదీత్థమ్,
శ్రుత్యా తయోస్తత్త్వమసీతి సమ్య
గేకత్వమేవ ప్రతిపాద్యతే ముహుః. 243

తా. 'తత్ త్వం' పదములకు జీవేశ్వరులు వాచ్యార్థములు. విరుద్ధధర్మములు గలవార లగుటచే వీరలకు ఐక్యము కుదురకున్నను లక్ష్యార్థమగు కేవలచైతన్యమాత్రమున భాగత్యాగలక్షణచే నైక్యము సంభవింపకపోదు. 'తత్త్వమసి' యనుశ్రుతి విరుద్ధాంశములగు సర్వజ్ఞత్వకించిజ్జత్వధర్మములను విడిచి లక్ష్యార్థమగు చైతన్యమాత్రస్వీకారమువలన జీవేశ్వరులకు ఐక్యమును బాగుగ బోధించుచున్నది.

వి. భాగత్యాగలక్షణ యనఁగా, కల్పితాంశములను విడిచి ముఖ్యాంశమును గ్రహించుట.

1. జహల్లక్షణ, 2. అజహల్లక్షణ, 3. జహదజహల్లక్షణ యన్ని లక్షణావృత్తి త్రివిధము.

1. జహల్లక్షణ—విరుద్ధాంశమును విడిచి ముఖ్యాంశమును మాత్రమే గ్రహించుట. ఉదాహరణము—'గంగాయాం

ఘోషః' (గంగయందు గొల్లపల్లె)యనునపుడు, గంగలో గొల్లపల్లెయుండదు గనుక గంగను విడిచి గంగయొడ్డున గొల్ల పల్లెయుండు నని గ్రహించుట.

2. అజహల్లక్షణ—విరుద్ధాంశమును విడువకుండ ముఖ్యాంశమును గ్రహించుట. ఉదాహరణము:—'మంచాః క్రోశంతి' (మంచము లఱచుచున్నవి) యనునపుడు, మంచము లఱవవు గనుక మంచములమీఁద నున్న పురుషు లఱచుచున్నా రని మంచములుసహితముగ పురుషుల యాక్రోశమును గ్రహించుట.

3. జహదజహల్లక్షణ—విడిచివిడువక, అనఁగా కొంత భాగమును విడిచి మఱియొకభాగమును గ్రహించుట. ఉదాహరణము:—'సోయం దేవదత్తః (ఆదేవదత్తుఁడే యితఁడు) అనునపుడు, విరుద్ధధర్మములుగల ఆకాలము ఈకాలము, ఆదేశము ఈదేశము, ఆవయస్సు ఈవయస్సు మొదలగు విరుద్ధాంశములను వదిలి కేవల లక్ష్యార్థభూతుఁడగు దేవదత్తునిమాత్రమే వాక్యార్థముగ గ్రహించుట.

ఇటులనే తత్త్వమసీత్యాది మహావాక్యములయొక్క లక్ష్యార్థమును లక్షణావృత్తిచే గ్రహింపవలెనని యభిప్రాయము.

లక్షణావృత్తిచే గ్రహించుట యనఁగా, వాచ్యార్థమును మాత్రమే గ్రహించుట కాదు. మాయాఽవిద్యలచే నేర్పడిన ఈశ్వరజీవేశ్వరభేదమును విడిచి అధిష్ఠానమగు చైతన్యమాత్రమును గ్రహించుట. అట్లు గ్రహించుటవలన జీవేశ్వరైక్యభావము దృఢపడి దృశ్యమును మఱచి ఎఱుకమఱపులు లేని సచ్చిదానందస్వస్వరూపస్థితి అలవడును.

అట్టి స్వస్వరూపమును బోధించుటకై ఋగ్వేదమందు "ప్రజ్ఞానం బ్రహ్మ" యనియు, యజుర్వేదమందు "అహం బ్రహ్మాస్మి" యనియు, సామవేదమునందు "తత్త్వమసి" యనియు, అథర్వణవేదమందు "అయమాత్మా బ్రహ్మ" యనియు, ప్రధానములగు నాలుగు మహావాక్యములు చెప్పఁబడినవి. అందు 'తత్త్వమసి' మహావాక్యముయొక్క అర్థము నీశ్లోకమందు శ్రీశంకరాచార్యులవారు బోధించుచున్నారు.

తత్త్వమసి యనువాక్యములో "తత్ త్వమ్ అసి" యను మూఁడుపదములు గలవు. వీనిలో—

తత్, అనఁగా—సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యము, నామరూపరహితమునై, సృష్టికిఁ బూర్వమునను సృష్ట్యనంతరమునను ఏకరూపముననుండు సద్వస్తువు. దీనికి వాచ్యార్థము ఈశ్వరస్వరూపము, లక్ష్యార్థము పరమాత్మస్వరూపము.

త్వమ్, అన—వినునటువంటి శిష్యునియొక్క దేహేంద్రియాదులకు అతీతమై సాక్షీభూతమగు చైతన్యము. దీనికి వాచ్యార్థము జీవస్వరూపము, లక్ష్యార్థము ప్రత్యగాత్మస్వరూపము.

అసి, యనఁగా—జీవేశ్వరైక్యము; అనఁగా ప్రత్యగాత్మపరమాత్మైక్యము.

ఐక్యం తయోర్లక్షితయోర్న వాచ్యయో
ర్నిగద్యతేఽన్యోన్యవిరుద్ధధర్మిణోః,
ఖద్యోతభాన్వోరివ రాజభృత్యయోః
కూపాంబురాశ్యోః పరమాణుమేర్వోః. 244

తా. మిణుగురుపురువు-సూర్యుఁడు, బంటు-రాజు, బావి-సముద్రము, పరమాణువు-మేరుపర్వతము ననువానికి ఎంత తార తమ్యము గలదో జీవేశ్వరులకును అంత తారతమ్యము గలదు. కావున జీవపరమేశ్వరులకు ఐక్యము భాగత్యాగలక్షణద్వారా లక్ష్యముచేఁ గలుగవలెనే కాని వాచ్యార్థముచే నెప్పటికినిఁ గలుగదు.

తయోర్విరోధోఽయముపాధికల్పితో
న వాస్తవః కశ్చిదుపాధిరేషః,
ఈశస్య మాయా మహదాదికారణం
జీవస్య కార్యం శృణు పంచకోశాః. 245

తా. శిష్యా! వినుము. జీవేశ్వరులకుఁగల తారతమ్యము (తరతమభావము) ఉపాధికల్పితమేకాని వాస్తవము కాదు. జీవునకుఁ గార్యమగు అవిద్యాకల్పితపంచకోశములును ఉపాధి. ఈశ్వరునకు మహత్తుమొదలు స్థూలశరీరపర్యంతమును కారణమగు మాయ ఉపాధి.

ఏతావుపాధీ పరజీవయోస్తయోః
సమ్యఙ్నిరాసేన పరో న జీవః,
రాజ్యం నరేన్ద్రస్య భటస్య ఖేటక
స్తయోరపోహే న భటో న రాజా. 246

తా. ఈశ్వరునకును జీవునకును గారణము లగుమాయ అవిద్యలనెడి యుపాధులను నిరసింపఁగా, ఈశ్వరుఁడు జీవుఁడు నను వివక్షయే యుండదు. ఎట్లనఁగా, ఒకడు రాజ్యపరిపాలన చేయుచుండినయెడల వాఁడు రాజనఁబడును. రాజ్యముపోయిన

యెడల వాఁడు సామాన్యమనుష్యమాత్రుఁడే యగును. రాజ సేవచేయువాఁడు సేవకుఁ డనఁబడును. ఆసేవకవృత్తి మానిన యెడల వాఁడును సామాన్యమనుష్యుఁడే యగును. కనుక నిపుడు 'రాజు' 'నేను' ననెడి భేదములేక నుభయులును సమానులే యగుదురుకదా. ఆప్రకారమే జీవేశ్వరులకు ఉపాధులగుమాయయు అవిద్యయు నష్టమయినయెడల ఉభయులును శుద్ధచైతన్యమాత్రులే యగుదురు.

అథాత ఆదేశ ఇతి శ్రుతిః స్వయం
నిషేధతి బ్రహ్మణి కల్పితం ద్వయమ్,
శ్రుతిప్రమాణానుగృహీత యుక్త్యా
తయోర్నిరాసః కరణీయ ఏవమ్. 247

తా. "అథాత ఆదేశ" అనెడిశ్రుతి బ్రహ్మమునందుఁ గల్పింపఁబడిన ద్వైతభావమును 'నేతినేతి' యని నిషేధించుచున్నది. (ఈద్వైతము ఆగంతుకమేకాని నిత్యము కాదుసుమా యని శ్రుత్యభిప్రాయము) కనుక శ్రుతిప్రమాణముచే నను గ్రహింపఁబడిన యుక్తివలన ద్వైతమును 'నేతినేతి' యని నిషేధింపవలెను.

నేదం నేదం కల్పితత్వాన్న సత్యం
రజ్జౌ దృష్టవ్యాలవత్స్వప్నవచ్చ,
ఇత్థం దృశ్యం సాధుయుక్త్యా వ్యపోహ్య
జ్ఞేయః పశ్చాదేకభావస్తయోర్యః. 248

తా. రజ్జువునందుఁ దోఁచు సర్పమువలెను, స్వప్నమందు దృశ్యమగు నానాపదార్థములవలెను, బ్రహ్మమునందు అజ్ఞాన

ముచేఁ గల్పింపఁబడిన యీజగత్తు భ్రమమాత్రమే కాని సత్యము కాదు. సాధుయుక్తుల (హేతువాక్యములచేత నీదృశ్య ప్రపంచమును నిషేధించి, జీవపరమాత్మలకు చైతన్యమాత్ర గ్రహణమువలన ఏకభావమును గనవలెను.

తతస్తు తౌ లక్షణయా సులక్ష్యౌ
తయోరఖణ్డైకరసత్వసిద్ధయే,
నాలం జహత్యా న తథాజహత్యా
కిం తూభయార్థైకతయైవ భావ్యమ్. 249

తా. ఆజీవేశ్వరుల యథార్థస్వరూపము భాగత్యాగ లక్షణచేతఁ దెలియవలెను. ఆజీవేశ్వరులయొక్క అఖండైకరసత్వ సిద్ధికి (జీవేశ్వరైక్యప్రాప్తికి) పూర్వోక్తలక్షణావృత్తులలో జహల్లక్షణయు అజహల్లక్షణయుఁ బ్రయోజనకారులు కాఁజా లవు. కావున నిట జహదజహల్లక్షణయే గ్రహింపవలెను.

(భాగత్యాగలక్షణవిషయమై 243-వ శ్లోకవివరణమును జూడవలెను.)

అవ. జహదజహల్లక్షణచే బ్రహ్మమును దెలిసికొనుట కుదాహరణము:—

స దేవదత్తోఽయమితీహ చైకతా
విరుద్ధధర్మాంశమపాస్య కథ్యతే,
యథా తథా తత్త్వమసీతి వాక్యే
విరుద్ధధర్మానుభయత్ర హిత్వా. 250

తా. జీవేశ్వరుల అఖండైకరసత్వసిద్ధికి జహదజహల్ల క్షణయే ప్రయోజనకారి యగుట యెట్లనఁగా, నీ లక్షణకుం

దెల్పఁబడిన ఉదాహరణమందు 'సోఽయం దేవదత్తః' యను నపుడు దేశకాలాదివిరుద్ధధర్మము లన్నిటిని నిరసించి లక్ష్యార్థమగు దేవదత్తవ్యక్తిమాత్రమే చెప్పఁబడినది. అటులనే 'తత్త్వమసి' యను వాక్యమందు జీవేశ్వరులయొక్క కల్పితమాయాఽవిద్యాద్యుపాధులు నిరసింపఁబడి, లక్ష్యార్థమగు శుద్ధచైతన్యరూపబ్రహ్మముమాత్రమే వ్యక్తీకరింపఁబడుచున్నది.

సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనో
రఖణ్డభావః పరిచీయతే బుధైః,
ఏవం మహావాక్యశతేన కథ్యతే
బ్రహ్మాత్మనోరైక్యమఖణ్డభావః. 251

తా. పండితులు (జ్ఞానులు) ఇట్లు జీవేశ్వరుల విరుద్ధాంశములను నిరసించి వార లుభయులను చిన్మాత్రస్వరూపులనుగా అంతర్లక్ష్యముచేత లక్షించి, అఖండైకస్వరూపులనుగాఁ దెలిసికొనుచున్నారు. ఈప్రకారము జీవేశ్వరులకు ఏకత్వమున్ను, అఖండత్వమున్ను అనేక మహావాక్యములచేతఁ జెప్పఁబడుచున్నది.

అస్థూలమిత్యేతదసన్నిరస్య
సిద్ధం స్వతో వ్యోమవదప్రతర్క్యమ్,
అతో మృషామాత్రమిదం ప్రతీతం
జహీహి యత్స్వాత్మతయా గృహీతమ్,
బ్రహ్మాహమిత్యేన విశుద్ధబుద్ధ్యా
విద్ధి స్వమాత్మానమఖణ్డబోధమ్. 252

తా. శిష్యా! "అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘమలోహితమస్నేహమ్" అనెడి బృహదారణ్యకశ్రుతివచనప్రకారము, అని

త్యములగు స్థూలాదిపదార్థములను నిరసించుటవలన, ఆకాశము వలె వ్యాపకమై యూహింప శక్యముగాని చైతన్యము సిద్ధమగును. ఈచైతన్యమునే ఆత్మస్వరూపముగ గ్రహించి, మిథ్యాప్రతీతిమాత్రమగు దేహాదివస్తుసముదాయమందు ఆత్మబుద్ధిని విడువుము. విశుద్ధమగు బుద్ధివలన 'నేనే బ్రహ్మమను' అని నిశ్చయించి అఖండబోధస్వరూపచైతన్యాత్మను దెలిసికొనుము.

అవ. విజాతీయభేదభావనివృత్తికొఱకు కార్యకారణభేదమును సదృష్టాంతముగఁ బ్రతిపాదించుచున్నారు:—

మృత్కార్యం సకలం ఘటాది సతతం [1]మృన్మాత్రమేవాభిత
స్తద్వత్సజ్జనితం సదాత్మకమిదం సన్మాత్రమేవాఖిలమ్,
యస్మాన్నాస్తి సతః పరం కిమపి తత్సత్యం స ఆత్మా స్వయం
తస్మాత్తత్త్వమసి ప్రశాన్తమమలం బ్రహ్మాద్వయం యత్పరమ్.

తా. ఘటశరావాదికము మృత్తికయొక్క కార్యము (వివర్తవిశేషము). ఆఘటాదులు రూపమున నశింపఁగా మృత్తుమాత్రమే యగును. ఆప్రకారమే సద్వస్తువునుండి యుత్పన్నమైన నామరూపప్రపంచమంతయు సదాత్మకమే. సదతిరిక్తమగు పదార్థ మెద్దియును లేదు. ఆసత్స్వరూపమే సాక్షాత్తుగ బ్రహ్మము. ఆబ్రహ్మము ప్రత్యగభిన్నాద్వయానందస్వరూపము. కాఁబట్టి శిష్యా! ప్రశాంతరూపమై, అవిద్యామలరహితమై, అద్వితీయమై, సర్వనిషేధావధియై విలసిల్లు బ్రహ్మమవు నీవే.

అవ. స్వప్నదృష్టాంతమువలన అవిద్యాకల్పితమగు ప్రపంచమునయితము స్వప్నమువలె మిథ్యయని సూచించుచున్నారు:-

నిద్రాకల్పితదేశకాలవిషయజ్ఞాత్రాది సర్వం యథా

---

1 మృన్మాత్రమేవాహితం తద్వత్.

మిథ్యా తద్వదిహాపి జాగ్రతి జగత్స్వాజ్ఞానకార్యత్వతః,
యస్మాదేవమిదం శరీరకరణప్రాణాహమాద్యప్యస
త్తస్మాత్తత్త్వమసి ప్రశాన్తమమలం బ్రహ్మాద్వయం యత్పరమ్.

తా. నిద్రయందు (స్వప్నమందు) గల్పింపఁబడిన దేశము కాలము విషయములు జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు మొదలగుసర్వ మును ఏప్రకార మసత్యమో, ఆవిధముఁననే జాగ్రదవస్థయందు స్వాశ్రయ స్వవిషయాజ్ఞానమూలక మగు నీదృశ్యప్రపంచ మంతయు మిథ్యయే. ఆవిధముననే యీశరీరము, ఇంద్రియ ములు, ప్రాణము, అహంకారాదిసర్వమున్ను మిథ్యయే. కాఁబట్టి, శిష్యా! శాంతస్వరూపనిర్మలాద్వితీయ పరబ్రహ్మము నీవే యైతివి.

అవ. శరీరమును శరీరధర్మములను నిషేధించి బ్రహ్మభావ మును బొందవలె నని యుపదేశించుచున్నారు:—

జాతినీతికులగోత్రదూరగం
నామరూపగుణదోషవర్జితమ్,
దేశకాలవిషయాతివర్తి య
ద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 255

తా. శిష్యా! ఆ పరబ్రహ్మము మనుష్యపశ్వాదిజాతితోఁ గాని, కర్తవ్యాకర్తవ్యాదినీతితోఁగాని, బ్రాహ్మణాదికులముతోఁ గాని, భారద్వాజాదిగోత్రముతోఁగాని సంబంధములేనిది, నామ రూపగుణరహితమయినది, దేశకాలవిషయాతిరిక్తమైనది. ఆపర బ్రహ్మమవు నీవే. కనుక శరీరాభిమానమును విడిచి 'నేను బ్రహ్మమను' అని సర్వదా భావింపుము.

యత్పరం [1]సకలవాగగోచరం
గోచరం విమలబోధచక్షుషః,
శుద్ధచిద్ఘనమనాదివస్తు య
ద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 256

తా. శిష్యా! ఆపరతత్త్వ మిట్టిది యని చెప్పఁజాలక వేదమాతసయితము మూకీభావమును వహించినది, కనుక నది వాగగోచర మయినది. నిర్మలమగు జ్ఞాననేత్రమునకు మాత్రము గోచరించునది. శుద్ధచైతన్యఘనమగు అనాదివస్తువు ఎద్దియో యదియే బ్రహ్మము. ఆబ్రహ్మమవె నీవు. ఇట్లు సదా భావింపుము.

షడ్భిరూర్మిభిరయోగి యోగిహృ
ద్భావితం న కరణైర్విభావితమ్,
బుద్ధ్యవేద్య మనవద్యభూతి య
ద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 257

తా. "ప్రాణస్య క్షుత్పిపాసేద్వే, మనసః శోకమోహనమ్, జన్మమృత్యూశ్చ దేహస్య షడూర్మిరహితః శివః" ప్రాణధర్మము లగుక్షుత్పిపాసలు, మనోధర్మములగు శోకమోహములు, దేహ ధర్మములగు జన్మ మరణములు ననెడి యాఱు ధర్మములును షడూర్ము లనఁబడును. ఈషడూర్ములు లేనివాఁడు శివుఁడు. (శివః= శామ్యతి పరమానందరూపత్వాన్నిర్వికారో భవతీతి శివః = బ్రహ్మానందస్వరూపుఁడును నిర్వికారుఁడును గనుక శమించి యుండువాఁడు) అట్లు షడూర్ములను జయించిన యోగులును శివ స్వరూపులే యగుదురు. అట్టి శివస్వరూపు లగు యోగులకు

1 సకలరాగగోచరం.

మాత్రమే హృద్గోచర మగుచు, నేత్రాదీంద్రియముల కగోచ రమై, బుద్ధికి సయితము నవేద్యమై, వృద్ధిపరిణామాది సకలదోష వర్జితమై యుండువస్తు వెద్ది కలదో అదియె బ్రహ్మము. శిష్యా! ఆబ్రహ్మమవె నీవు. ఇట్లు సర్వదా భావింపుము.

భ్రాన్తికల్పితజగత్కలాశ్రయం
స్వాశ్రయం చ సదసద్విలక్షణమ్,
నిష్కలం నిరుపమానమృద్ధిమ
ద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 258

తా. భ్రాంతికల్పితమగు జగత్తునకును జగత్కార్యముల కును స్వాశ్రయమై (తనకుఁ దానే ఆశ్రయమై), స్థూలసూక్ష్మ జగద్విలక్షణమై నిష్కలమై, ఉపమానరహితమై, సర్వపరి పూర్ణమై యుండువస్తు వెద్దియో అదియే బ్రహ్మము. ఆబ్రహ్మ మవె నీవు. ఇట్లు సదా భావనచేయుము.

జన్మవృద్ధిపరిణత్యపక్షయ
వ్యాధినాశనవిహీనమవ్యయమ్,
విశ్వసృష్ట్యవనఘాతకారణం
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 259

తా. జాయతే (పుట్టుట), అస్తి (పుట్టి ఉండుట), వర్ధతే (పెరుగుట) విపరిణమతే (పండుట), అపక్షీయతే (తఱుఁగుట), వినశ్యతి (నశించుట) అనెడి దేహధర్మములు షడ్భావవికారము లనఁబడును. ఈషడ్భావవికారములు లేనిది నాశము లేనిది. విశ్వముయొక్క సృష్టిస్థితిలయములకుఁ గారణ మైనదియు

బ్రహ్మము. ఆబ్రహ్మమవై నీవు. శిష్యా! నీ వెల్లప్పుడు నిట్లు భావింపుము.

అస్తభేదమనపాస్తలక్షణం
నిస్తరఙ్గజలరాశినిశ్చలమ్,
నిత్యముక్తమవిభక్తమూర్తి య
ద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 260

తా. భేదశూన్యమై, చిహ్నరహితమై, తరంగములులేని సముద్రమువలె నిశ్చలమై, సర్వదా బంధరహితమై, విభజింప శక్యము కానిదై యేయఖండస్వరూపము గలదో యదియె బ్రహ్మము. ఆబ్రహ్మమవె నీవు. ఇట్లు సదా నీఅంతఃకరణమందు భావింపుము.

ఏకమేవ సదనేకకారణం
కారణాంతరనిరాసకారణమ్,
కార్యకారణవిలక్షణం స్వయం
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 261

తా. శిష్యా! ఆపరబ్రహ్మము సజాతీయవిజాతీయశూన్యమగు ఏకవస్తువు, త్రైకాలాబాధ్యము. భూతభౌతికస్థూలసూక్ష్మాదిసర్వమునకు వివర్తోపాదానమై తనకు మఱియొకకారణము లేదని సూచించునది. అనఁగా, కారణాంతరరహితమగు అనాది వస్తువు, కార్యకారణవిలక్షణము, స్వయంప్రకాశము నైనది. ఆబ్రహ్మమవు నీవే. నీ అంతఃకరణమందు సదా యీవిధముగ భావింపుము.

నిర్వికల్పకమనల్పమక్షరం
యత్ క్షరాక్షరవిలక్షణం పరమ్,
నిత్యమవ్యయసుఖం నిరంజనం
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 262

తా. ఆ పరబ్రహ్మము కల్పనారహితము, అనల్పము అనఁగా భూమస్వరూపము, అక్షరము (అవినాశి), చిదచిద్విలక్షణము అనఁగా పురుషోత్తమరూపము, త్రికాలాంబాధ్యమగు ఏకరసము, నాశరహితమగు సుఖస్వరూపమును మాయారహితమును. ఆబ్రహ్మమవు నీవు. ఇట్లు సర్వదా భావింపుము.

వి. "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా, అథ యత్రాన్యత్పశ్య త్యన్యచ్ఛృణో త్యన్యద్విజానాతి తదల్పమ్" అని శ్రుతి. అల్ప మనఁగా జీవుఁడు, అనల్ప మనఁగా భూమరూపపరబ్రహ్మము.

"యస్మాత్ క్షరమతీతో ఒహమక్షరా దపి చోత్తమః, అతో ఒస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః." అని గీతావాక్యము. క్షరాక్షరము లన చిదచిత్తులు. తద్విలక్షణుఁడు పురుషోత్తముఁడు=పరబ్రహ్మము.

యద్విభాతి సదనేకధా భ్రమా
న్నామరూపగుణవిక్రియాత్మనా,
హేమవత్స్వయమవిక్రియం సదా
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 263

తా. కటకకంకణాదినామరూపములను బొందినను సువర్ణము ఏకమైనట్లు, ప్రకాశస్వరూప సద్రూపబ్రహ్మము భ్రాంతి

వశమున నామరూపగుణములవలన వికార మొంది యనేకరూప ములఁ బ్రతీత మయ్యును వాస్తవముగ సర్వవికారశూన్య మగు బ్రహ్మమే. ఆబ్రహ్మమవే నీవు. నీ వెల్లప్పుడు నిట్లు భావనచేయుము.

యచ్ఛకాస్త్యనపరం పరాత్పరం
ప్రత్యగేకరసమాత్మలక్షణమ్,
సత్యచిత్సుఖ మనన్తమవ్యయం
బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 264

తా. ఏసద్వస్తువు ప్రకాశరూపమో, "తదేతద్బ్రహ్మ అపూర్వ మనపర మనన్తరమబాహ్యం అయమాత్మాబ్రహ్మ సర్వానుభూః" ఇతి శ్రుతిప్రమాణముగ దేనికంటె పరము లేదో, "యః క్షరాత్పరతః పరః" ఇతి శ్రుతిరీత్యా ఏది పరముకంటె పరమైనదో, ఏది జీవసాక్షియగు కూటస్థమో, ఏది ఏకరసమో, ఏది ఆత్మస్వరూపమో, ఏది సచ్చిదానందస్వరూపమో, ఏది పరిచ్ఛేదరహితమో, ఏది అవినాశియో అదియె బ్రహ్మము. ఆబ్రహ్మమవె నీవు, శిష్యా! ఇట్లెల్లపుడు నీ అంతఃకరణమందు భావింపుము.

ఉక్తమర్థమిమమాత్మని స్వయం
[1]భావయ ప్రథితయుక్తిభిర్ధియా,
సంశయాదిరహితం కరాంబువ
త్తేన తత్త్వనిగమో భవిష్యతి. 265

తా. శిష్యా! ఈచెప్పఁబడిన విషయమును నీయంతఃకరణమందు ఆత్మానాత్మవివేకముచేతను, ప్రసిద్ధ యుక్తులచేతను, బుద్ధిచేతను సంశయవిపర్యయరహితముగ స్వయముగ విచారించిన

1 భావయేత్ప్రథితయుక్తి.

యెడల వేదశాస్త్రముయొక్క సారార్థము కరాంబువువలె విశదమై నీకు అపరోక్షజ్ఞానము తప్పక గలుగును.

సంబోధమాత్రం పరిశుద్ధతత్త్వం
విజ్ఞాయ సంఘే నృపవచ్చ సైన్యే,
తదాశ్రయః స్వాత్మని సర్వదా స్థితో
విలాపయ బ్రహ్మణి విశ్వజాతమ్. 266

తా. శిష్యా! సైన్యమందు రాజు సైన్యమునకు నియంతయు, తాను స్వతంత్రుఁడునై యుండునట్లు, సంఘాతరూప శరీరమునకుఁ బరిశుద్ధసమ్యగ్బోధమాత్రాత్మతత్వము నియంతయు స్వతంత్రము నని తెలిసికొనుము. ఈయాత్మతత్వము నాశ్రయించి సదా ఆత్మస్థితుఁడవై బ్రహ్మాభివ్యక్తమగు ప్రపంచమును బ్రహ్మమునందే విలీనము సేయుము. అనఁగా సర్వవృత్తులను నశింపఁజేసి మనస్సును సర్వదా బ్రహ్మలక్ష్యమందే నిలుపవలెనని భావము.

అవ. బ్రహ్మభావనస్థానమును దెలుపుచున్నారు:—

బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం
బ్రహ్మాస్తి సత్యం పరమద్వితీయమ్,
తదాత్మనా యోఽత్ర వసేద్గుహాయాం
పునర్న తస్యాఙ్గ గుహాప్రవేశః. 267

తా. శిష్యా! బుద్ధిగుహాయందు సదసద్విలక్షణమును, త్రికాలాబాధ్యమును, అద్వితీయమును, పరమార్థసత్యమును అగు బ్రహ్మము గలదు. బుద్ధిప్రతిబింబిత చిదాభాసుఁడు (జీవుఁడు) ఆబ్రహ్మమును బొంది (బ్రహ్మమే తానై) బుద్ధిగుహాయందు నివ

సించెనేని (జీవబ్రహ్మైక్యము సిద్ధించెనేని) వానికి మజల నాబుద్ధి గుహయందుఁ బ్రవేశించుట ప్రాప్తింపదు. అనఁగా, "బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి" అను శ్రుతివాక్యరీత్యా నట్టి ధన్యాత్ముఁడు బ్రహ్మరూపమును బొంది ముక్తుఁ డగును గనుక, వానికి పునర్జన్మము లే దని భావము.

అవ. సామాన్యవాసనాపటలాఽభావమే మోక్ష మని నిరూపించుచున్నారు:—

జ్ఞాతే వస్తున్యపి బలవతీ వాసనాఽనాదిరేషా
కర్తా భోక్తాప్యహమితి దృఢా యాస్య సంసారహేతుః,
ప్రత్యగ్దృష్ట్యాత్మని నివసతా సాఽపనేయా ప్రయత్నా
న్ముక్తిం ప్రాహు స్తదిహ మునయో వాసనాతానవం యత్.

తా. ప్రత్యగభిన్నాద్వయానందవస్తువును(బ్రహ్మమును) దెలిసికొనినను, వృత్తిప్రేరణచే 'నేను కర్తను భోక్తను' అనెడి అధ్యాసహేతుభూతము లగు అనాదివాసనలు మిగుల బలీయములు గనుక, నట్టి వాసనలు సయితము జీవునకు జన్మమృత్య్వాదిరూపసంసారహేతువు లగును. కాఁబట్టి అత్యంతప్రయత్నముతో వాసనలు పూర్తిగ నిర్మూలించి ప్రత్యగ్దృష్టితో ఆత్మయందు నివసించుటయే (బ్రహ్మనిష్ఠ నుండుటయే) ముక్తి యని సూక్ష్మదర్శు లగుమునులు అనుభవమువలన వచియించిరి.

అవ. వాసనలకుఁ గార్యభూతమగు అహం మమాధ్యాసము సయితము అవశ్యముగ నిరాకరణీయ మని చెప్పుచున్నారు:—

అహం మమేతి యో భావో దేహాక్షాదా వనాత్మని,
అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా స్వాత్మనిష్ఠయా. 269

తా. దేహము, ఇంద్రియములు మొదలగు అనాత్మవిషయములందు 'అహం మమ'(నేను నాది)యను భావము అధ్యాసమనఁబడును. పండితులు (జ్ఞానులు)స్వస్వరూపస్థితియందు నిష్ఠతో నీయధ్యాసమును బూర్తిగ నివర్తింపవలెను.

జ్ఞాత్వా స్వం ప్రత్యగాత్మానం బుద్ధి తద్వృత్తిసాక్షిణమ్,
సోఽహమిత్యేవ సద్వృత్త్యానాత్మన్యాత్మమతిం జహి. 270

తా. బుద్ధిని బుద్ధివృత్తులను బ్రకాశింపఁజేయుచు వానికి సాక్షి యగు ప్రత్యగాత్మయే నీ వని తెలిసికొని, 'సోఽహం' (అయద్వయానందరూపబ్రహ్మమే నేను) అనెడి అఖండాకార వృత్తి యనుసద్భావముతో అనాత్మవస్తువు లగు దేహేంద్రియాదులందు ఆత్మబుద్ధిని విడువుము.

లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనమ్,
శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు. 271

తా. శిష్యా! లోకవాసనను దేహవాసనను శాస్త్రవాసనను విడువుము. వాసనారూపాధ్యాసము జ్ఞానమునకు ప్రతిబంధకము గనుక నేవిధమైనవాసన లున్నను అనాత్మయగు దేహమందు ఆత్మాధ్యాసము కలుగక మానదు. కావున వాసనాసహితముగ దేహాత్మబుద్ధిని విడువుము.

వి. ధనవనితాదివిషయములందు రాగము, స్వగుణప్రకటనమందు ప్రీతి, పరగుణవిషయమున ద్వేషము నను నీ మొదలగునవి లోకవాసన యనఁబడును. దేహమందు రాగపూర్వకముగ పోషణాసక్తి దేహవాసన యగును. పాఠానుష్ఠానాదులు శాస్త్రవాసన యనఁబడును. ఈవాసనాత్రయము జ్ఞానమునకు

ప్రతిబంధకములు గనుక వానిని విడువవలెనని యభిప్రాయము. "వాసనా ఏవ సంసార ఇతి సర్వా విముంచతాః, తత్త్యాగో వాసనాత్యాగాత్ స్థితిరద్య యథా తథా." అని శ్రీఅష్టావక్ర ముని.

లోకవాసనయా జన్తోః శాస్త్రవాసనయాపి చ,
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే. 272

తా. లోకవాసన శాస్త్రవాసన దేహవాసన యను నీవాసనాత్రయ మెంతదనుక నుండునో అంతవఱకు మనుష్యునకు ఆత్మజ్ఞానము కలుగదు.

సంసారకారాగృహమోక్షమిచ్ఛో
రయోమయం పాదనిబద్ధశృంఖలమ్,
వదన్తి తద్‌జ్ఞాః పటువాసనాత్రయం
యోఽస్మాద్విముక్తః సముపైతి ముక్తిమ్. 273

తా. సంసారమనెడి కారాగృహమునుండి విముక్తిఁ గోరువానికి నీ చెప్పఁబడిన వాసనాత్రయము కాళ్లకుఁ దగిలింపఁబడిన యినుపసంకెళు లని తద్‌జ్ఞులు చెప్పెదరు. కనుక నీవాసనాత్రయమునుండి విముక్తుఁ డగువాఁడే మోక్షమును బడయఁగలఁడు.

అవ. శుద్ధవాసనలు మలినవాసనలచేఁ గప్పఁబడినను ప్రయత్నమువలనఁ బయల్పడు నని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

జరాదిసంసర్గవశాత్ప్రభూత
దుర్గన్ధధూతాగరుదివ్యవాసనా,

సంఘర్షణేనైవ విభాతి సమ్య
గ్విధూయమానే సతి బాహ్యగన్ధే. 274

తా. అగరుచందనాదికాష్ఠమునకు జలాదిసంపర్కము వలనఁ గలిగిన బాహ్యదుర్గంధము ఆకాష్ఠముయొక్కసంఘర్షము (సానమీఁదరాపిడి) వలనఁ దొలఁగింపఁగా సుగంధము బయలు పడును.

అన్తః శ్రితానన్తదురన్తవాసనా
ధూలీవిలిప్తా పరమాత్మవాసనా,
ప్రజ్ఞాతిసంఘర్షణతో విశుద్ధా
ప్రతీయతే చన్దనగన్ధవత్స్ఫుటా. 275

తా. అంతఃకరణమందుఁగల రాజసతామసగుణసంబంధమగు అనంతదుర్వాసన లనెడి ధూళిచేఁ గప్పఁబడియుండు పరమాత్మవాసన, బుద్ధియందు ప్రణవోచ్చారణరూపసంఘర్షము వలనఁగాని, గురూపదిష్టమహావాక్యార్థసంతతవిచారణవలనఁగాని చందనగంధమువలెనే, విశుద్ధమై స్ఫుటముగ ప్రతీత మగును.

అనాత్మవాసనాజాలైస్తిరోభూతాత్మవాసనా,
నిత్యాత్మనిష్ఠయా తేషాం నాశే భాతి స్వయం స్ఫుటమ్. 276

తా. దేహాద్యనాత్మవస్తువులందుఁగల మలినవాసనాజాలముచే మఱుఁగుపడియుండు ఆత్మవాసన, ఎడతెగని ఆత్మనిష్ఠవలన మలినవాసనలు నశింపఁగా, తనంతట స్ఫుట మగును.

యథా యథా ప్రత్యగవస్థితం మన
స్తథా తథా ముఞ్చతి బాహ్యవాసనాః,
నిశ్శేషమోక్షే సతి వాసనానా
మాత్మానుభూతిః ప్రతిబన్ధశూన్యా. 277

తా. మనస్సు ప్రత్యగాత్మస్వరూపమం దెంతెంత స్థిర మగునో అంతంతగా విషయాజి బాహ్యావాసనలు వదలిపోవును. ఆబాహ్యావాసనలు సంపూర్ణముగ నివర్తింపఁబడునేని ఆత్మ యొక్క అపరోక్షానుభవము ప్రతిబంధరహితముగ కలుగును.

స్వాత్మన్యేవ సదా స్థిత్వా మనో నశ్యతి యోగినః,
వాసనానాం క్షయశ్చాతః స్వాధ్యాసాపనయం కురు. 278

తా. నిరంతరము ప్రత్యగాత్మయందే లక్ష్యమును నిల్పి చిత్త వృత్తి నిరోధరూప యోగాభ్యాసము చేయుపురుషులకు (యోగు లకు) మనస్సు నశించును. అనఁగా మనస్సు స్థూలస్వభావరహిత మగును. ఆకారణమున వాసనాక్షయ మగును. కనుక, శిష్యా! నీవును ఆవిధమున వాసనానివృత్తిపూర్వకముగ అనాత్మయం దాత్మరూపాధ్యాసమును విడువుము.

తమో ద్వాభ్యాం రజః సత్త్వాత్సత్త్వం శుద్ధేన నశ్యతి,
తస్మాత్సత్త్వమవష్టభ్య స్వాధ్యాసాపనయం కురు. 279

తా. రజోగుణ సత్త్వగుణములచేత తమోగుణము నశిం చును. సత్త్వగుణమువలన రజోగుణము నశించును. రజస్తమో గుణశూన్యమగు సత్త్వగుణముచే మిశ్రితసత్త్వగుణము నశించి కేవలసత్త్వగుణము నిలుచును. కావున, శిష్యా! శుద్ధ సత్త్వగుణము నాశ్రయించి అహం మమాధ్యాసమును విడువుము.

అవ. విద్యాసంప్రదాయప్రవృత్తికై ఇతరదృష్ట్యనురోధ మువలన విద్వద్వరిష్ఠశరీరస్థితియందు నిమిత్తప్రదర్శనపూర్వక ముగ జీవన్ముక్తిసుఖార్థము ప్రాతిభాసికబంధనివృత్తిని ప్రదర్శించు చున్నారు:—

ప్రారబ్ధం పుష్యతి వపురితి నిశ్చిత్య నిశ్చలః,
ధైర్యమాలంబ్య యత్నేన స్వాధ్యాసాపనయం కురు. 280

తా. శిష్యా! శరీరపోషణము ప్రారబ్ధానుసారముగ (తనంతట) జరుగఁగల దని నిశ్చయించుకొని, అనఁగా శరీరపోషణమునకై యత్నింపక, నిశ్చలచిత్తుఁడవై ధైర్య మవలంబించి వాసనాక్షయ మనోనాశ తత్త్వజ్ఞానములను అభ్యసింపుచు, అనాత్మయందు ఆత్మరూపాధ్యాసమును దొలఁగింపుము.

నాహం జీవః పరం బ్రహ్మేత్యతద్వ్యావృత్తిపూర్వకమ్,
వాసనా వేగతః ప్రాప్తస్వాధ్యాసాపనయం కురు. 281

తా. శరీరత్రయాభిమానియగు చిదాభాసజీవుఁడను నేను గాను. నేను కేవల నిర్గుణబ్రహ్మమను. అని యిట్లు పూర్వోక్త పంచకోశరూప మిథ్యాపదార్థనిషేధపూర్వకముగ బ్రహ్మనిష్ఠ గలిగి, అనేకజన్మములనుండి వచ్చుచున్న వాసనా వేగమువలనఁ బ్రాప్తించిన అనాత్మయం దాత్మాధ్యాసమును దూరముగఁ దొలఁగింపుము.

శ్రుత్యాయుక్త్యా స్వానుభూత్యా
జ్ఞాత్వాసార్వాత్మ్యమాత్మనః,
క్వచిదాభాసతః ప్రాప్త
స్వాధ్యాసాపనయం కురు. 282

తా. శిష్యా! ఆత్మతత్త్వమును దెలియుటకు శ్రుతి యుక్తి అనుభవము ననునవి ఆధారములు. కనుక, 'సర్వం ఖల్విదం బ్రహ్మ,' 'వాసుదేవః సర్వమితి,' 'నారాయణః సర్వమిదమ్,' 'బ్రహ్మైవేదం సర్వమ్,' ఇత్యాది శ్రుతులవలనను, అధ్యారో

పాపవాదరూపమగు యుక్తులవలనను, స్వానుభవమువలనను, బ్రహ్మముయొక్క సర్వాత్మభావమును దెలిసికొని, రజ్జువునందు సర్పభ్రాంతివలె ఆభాసమువలనఁ గలిగిన కర్తృత్వభోక్తృత్వాది రూపాధ్యాసమును పూర్తిగ విడువుము.

అనాదానవిసర్గాభ్యామీషన్నాస్తి క్రియా మునేః,
తదేకనిష్ఠయా నిత్యం స్వాధ్యాసాపనయం కురు. 283

తా. మననశీలునకు గ్రహణత్యాగములకంటె నితరమగు కర్తృత్వభోక్తృత్వరూపాదిక్రియ ఎంతమాత్రమును లేదు. కనుక, శిష్యా! నిరంతర బ్రహ్మనిష్ఠ గలిగి అనాత్మయందాత్మాధ్యానమును దొలఁగింపుము.

తత్త్వమస్యాదివాక్యోత్థబ్రహ్మాత్మైకత్వబోధతః,
బ్రహ్మణ్యాత్మత్వదార్ఢ్యాయ స్వాధ్యాసాపనయం కురు. 284

తా. శిష్యా! తత్త్వమసీత్యాది శ్రుతివాక్యములవలన నుత్పన్నమైన బ్రహ్మాత్మైకత్వబోధ (జీవేశ్వరైక్యజ్ఞానము) వలన, 'బ్రహ్మమే నేను, నేనే బ్రహ్మమను' అని బుద్ధిని దృఢపఱచుకొని, దేహమే ఆత్మ యనెడి యధ్యాసమును విడువుము.

అహంభావస్య దేహేఽస్మిన్నిఃశేషవిలయావధి,
సావధానేన యుక్తాత్మా స్వాధ్యాసాపనయం కురు. 285

తా. అహంభావము (దేహమే నేననెడిబుద్ధి) నిశ్శేషముగ విలయమగుపర్యంతము సావధానచిత్తముతో బ్రహ్మతత్పరుఁడవై అనాత్మయందాత్మాధ్యాసమును విడువుము.

ప్రతీతిర్జీవజగతోః స్వప్నవద్భాతి యావతా,
తావన్నిరన్తరం విద్వాన్ స్వాధ్యాసాపనయం కురు. 286

తా. స్వప్నమందుఁ గలుగు అధ్యాసమువలె ఎంతపర్యం తము ప్రమాత యగు జీవుఁడు ప్రమేయమగు భూతభౌతికరూప ప్రపంచము, చక్షురాదిప్రమాణము ననెడి త్రిపుటీరూపభేద విశిష్టోపాధికాధ్యాసమున్ను, ప్రాతిభాసికసత్తావిశిష్టజగత్ప్రతీతియు నుండునో అంతపర్యంతము నిరంతరాఖండాకార వృత్తితో సుస్థిరమగు నిధిధ్యాసన జేయుచు, అనాత్మయం దాత్మత్వరూపాధ్యాసమును దూరముగఁ దొలఁగింపుము.

వి. 278-వ శ్లోకము మొదలుగ నీ తొమ్మిదిశ్లోకములలో జీవన్ముక్తికి విరోధి యగు కర్తృత్వాధ్యాసముయొక్క నివర్తకోపాయము సూచింపఁబడలేదు. ఏ మనఁగా, 'స్వాధ్యాసాపనయం కురు' అనుటవలన ధ్యానధ్యాతృధ్యేయరూపత్రిపుటి కలుగుచున్నది. ఈత్రిపుటి అభావమైనంగాని జీవన్ముక్త్యవస్థ కలుగదు. కారణ మే మన, జ్ఞానప్రాప్తికి అవరణశక్తివిశిష్టాఽజ్ఞాననివృత్తి యైనప్పటికి, విక్షేపశక్తివిశిష్టాఽజ్ఞానము శేషించుచున్నది. ఆవిక్షేపశక్తివిశిష్టాఽజ్ఞానము లేదనుకొనెద మేని యపుడు శరీరాభావ మగును గనుక, నట్టి శరీరాభావస్థితిలో బ్రహ్మవిదో్యపదేశసంప్రదాయమునకే భంగము కలుగుట మాత్రమేకాక జీవన్ముక్తిప్రతిపాదకశాస్త్రవచనమునకు సయితము విరోధము సంభవించును. కనుక జ్ఞానోత్పత్త్యనంతరమందును విక్షేపశక్తియుండు నని అంగీకరింపవలయును. ఇందుకుఁ బ్రమాణము—"అవిద్యావృత్తితాదాత్మ్యం విద్యయైవ వినశ్యతి, విక్షేపస్య స్వరూపం తు ప్రారబ్ధక్షయ మీక్షతే." ఈహేతువుచేత జీవన్ముక్తికై యత్నించుపురుషుఁడు దేహాదికము నుపేక్షించి

వివేకముతో పూర్వోక్తముగ అధ్యాసనివృత్తికొఱకు అత్యంత ప్రయత్నము చేయవలెనని యభిప్రాయము.

నిద్రాయా లోకవార్తాయాః శబ్దాదేరపి విస్మృతేః,
క్వచిన్నావసరం దత్వా చిన్తయాత్మానమాత్మని. 287

తా. స్వరూపానుసంధానసమయమున నిద్రకుఁగాని లౌకికవ్యవహారసంబంధవాక్యమునకుఁగాని, పరాకునకుఁగాని అవసరము గలిగింపక నీయంతఃకరణమందు సర్వదా ప్రత్యగభిన్న పరమాత్మయందే చింతన గలిగియుండుము. అనఁగా ఆత్మధ్యాన సమయమున బాహ్యవాసన నిద్ర, పరాకును ఉండకూడ దని భావము. "దద్యాన్నావసరం కించిత్కామాదీనాం మనాగపి, అసుప్తేరామృతేః కాలం నయేద్వేదాన్తచిన్తయా," అని ఆర్య వచనము.

అవ. దేహమందు దోషదృష్టిగలిగి యుండవలెనని చెప్పు చున్నారు:—

మాతాపిత్రోర్మలోద్భూతం మలమాంసమయం వపుః,
త్యక్త్వా చాణ్డాలవద్దూరం బ్రహ్మీభూయ కృతీ భవ. 288

తా. శిష్యా! ఈశరీరము తల్లిదండ్రులయొక్క శుక్ర శోణితములవల్ల నుత్పన్నమై మలమాంసమయమై మిక్కిలి హేయ మయినది గనుక, దీనిని అపవిత్రుఁడగు చండాలునివలె దూరముగఁ ద్యజించి, అనఁగా దానియం దాసక్తిని వదలి, బ్రహ్మరూపమును బొంది కృతకృత్యుఁడ వగుమా.

స్వప్రకాశమధిష్ఠానం స్వయంభూయ సదాత్మని.
బ్రహ్మాణ్డమపి పిణ్డాణ్డం త్యజ్యతాం మలభాణ్డవత్. 289

తా. స్వయంప్రకాశరూపము జగదధిష్ఠానము నగు పరబ్రహ్మమును సర్వదా నీయంతఃకరణమం దనుభవించుచు; అనఁగా సర్వదా బ్రహ్మానుభవనిమగ్నుఁడవై సమష్టిసంఘాతమును (బ్రహ్మాండమును, వ్యష్టిసంఘాతమును (పిండాండమును) మలభాండమువలె విసర్జింపుము.

అవ. ఇట్లు సమష్టివ్యష్టిత్యాగానంతరము జీవపరమాత్మల నైక్యము నెటులఁ గావింపవలెనో బోధించుచున్నారు:—

ఘటాకాశం మహాకాశ ఇవాత్మానం పరాత్మని,
విలాప్యాఖండభావేన తూష్ణీంభవ సదా మునే. 290

తా. మననశీలుఁడవగు శిష్యా! ఘటము నశింపఁగా ఘటాకాశము మహాకాశమందు లీన మగునట్లు, జీవాత్మను పరమాత్మయందు లయింపఁజేసి, అఖండస్వరూపమును బొంది సర్వదా తూష్ణీంభావము (మౌనము)తో నుండుము.

చిదాత్మని సదానన్దే దేహారూఢామహంధియమ్,
నివేశ్య లింగముత్సృజ్య కేవలో భవ సర్వదా. 291

తా. దేహమందుఁ గల అహంబుద్ధిని సదానందరూప చిదాత్మయందుఁ బ్రవేశపెట్టి, అనఁగా అంతర్ముఖుఁడవై, లింగదేహసంసర్గమును త్యజించి సదా కేవలచైతన్యస్వరూపుఁడ వయి యుండుము.

యత్రైష జగదాభాసో దర్పణాన్తః పురం యథా,
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా కృతకృత్యో భవిష్యసి. 292

తా. అద్దమందు ప్రతిబింబించిన పట్టణమువలె, ఏ బ్రహ్మమునందు జగత్తు ఆభాసరూపమున ప్రతీత మగుచున్నదో

'ఆబ్రహ్మమే నేను' అని తెలిసికొనెదవేని నీవు కృతకృత్యుఁడ వగుదువు.

యత్సత్యభూతం నిజరూపమాద్యం
　　చిదద్వయానన్దమరూపమక్రియమ్,
తదేత్య మిథ్యావపురుత్సృజేత
　　చైలూషవద్వేషముపాత్తమాత్మనః. 293

తా. జీవాత్మయొక్క నిజరూపము సత్యభూత మగు చైతన్యాద్వయానందము, ఆకారశూన్యము, అక్రియమును కనుక నటుఁడు, తాను ధరించిన వేషమునం దభిమానము లేక స్వరూపముతో నుండునట్లు, ఈమిథ్యాశరీరమం దభిమానమును విడిచి స్వస్వరూపమును బొంది సుఖింపుము.

సర్వాత్మనా దృశ్యమిదం మృషైవ
　　నైవాహమర్థః క్షణికత్వదర్శనాత్,
జానామ్యహం సర్వమితి ప్రతీతిః
　　కుతోఽహమాదేః క్షణికస్య సిధ్యేత్. 294

తా. ఇంద్రియములకును మనస్సునకును గోచరించున దెల్ల మిథ్యయే. బుద్ధి కర్త మొదలగునవి క్షణికము లగుటవలన 'జానామ్యహం సర్వమ్' (నేను సర్వమును దెలిసికొనుచున్నాను) అనెడి అహంప్రత్యయము సయితము సత్యము కాదు. కనుక క్షణికములగు ఈఅహంప్రత్యయాదులు సత్యము లెట్లగును? అనఁగా సత్యములు కా వనుట.

అహంపదార్థస్త్వహమాది సాక్షీ
　　నిత్యం సుషుప్తావపి భావదర్శనాత్,

బ్రూతే హ్యజో నిత్య ఇతి శ్రుతిః స్వయం
　　　తత్ప్రత్యగాత్మా సదసద్విలక్షణః. 295

తా. అహంశబ్దమునకు అహంకారోపాధికుఁడగు జీవుఁడు ముఖ్యార్థము, కేవలచైతన్యము లక్ష్యార్థము. ఈలక్ష్యార్థమగు ఆత్మ సర్వదృశ్యరహితమగు సుషుప్తియందును ఉండుటచేత జాగ్రత్స్వప్నములందు దృశ్యములగు అహంకారాదిసకలపదార్థములకును, సుషుప్తియందు అవిద్యారూపాజ్ఞానమునకును సాక్షియై నిత్యముఁగ నుండును. "అజో నిత్యః" అను శ్రుతియు స్వయముగ నిట్లే చెప్పుచున్నది. కావున ప్రత్యగాత్మదృశ్యములగు స్వప్న జాగ్ర దవస్థలకును, సకలకార్యాభావరూపమగు సుషుప్త్యవస్థకును ద్రష్ట యగుటచేత అవస్థాత్రయముకంటె విలక్షణమై దృగ్రూపమగును.

వికారిణాం సర్వవికారవేత్తా
　　　నిత్యోఽవికారో భవితుం సమర్హతి,
మనోరథ స్వప్నసుషుప్తిషు స్ఫుటం
　　　పునః పునర్దృష్టమసత్త్వమేతయోః. 296

తా. కల్పితపదార్థములయొక్క రాకపోకల నెఱింగెడి ప్రత్యగాత్మ షడ్వికారములను బొందక నిత్యుఁడై యుండును. మనోరథములందును స్వప్నములందును నీవికారములస్థితియు, సుషుప్తియందు దృశ్యవస్తువుల అభావమును, దృగాత్మయొక్క సత్త్వమునుసాక్షియగు ప్రత్యగాత్మచేత స్పష్టముగ ననుభవింపఁబడుచున్నవి.

అతోఽభిమానం త్యజ మాంసపిణ్డే
పిణ్డాభిమానిన్యపి బుద్ధికల్పితే,
కాలత్రయాబాధ్యమఖణ్డబోధం
జ్ఞాత్వాస్వమాత్మానముపైహి శాన్తిమ్. 297

తా. శిష్యా! ఈచెప్పఁబడిన హేతువులవలన మాంసపిండ మగు నీదేహమందును, ఈశరీరాభిమాని యగు అహంకారాది లింగదేహమందును, అహంబుద్ధిని విడిచి, త్రికాలాబాధ్యమును అఖండబోధస్వరూపమును అగు ఆత్మను దెలిసికొని జీవన్ముక్తిరూప పరమశాంతినిఁబొంది సుఖింపుము.

అవ. ఆభాసవిశిష్టలింగశరీరధర్మత్యాగమువలన అఖండరూపత్వము సిద్ధించు నని శ్రీగురు వుపదేశించుచున్నారు: —

త్యజాభిమానం కులగోత్రనామ
రూపాశ్రమేష్వార్ద్రశవాశ్రితేషు,
లింగస్య ధర్మానపి కర్తృతాదీం
స్త్యక్త్వా భవాఖణ్డసుఖస్వరూపః. 298

తా. శిష్యా! జీవచ్ఛవమగు నీశరీరము నాశ్రయించుకొని యుండు కులగోత్రనామరూపములందును, గృహస్థాశ్రమాదికమందును అహం మమాభిమానమును విడువుము. కర్తృత్వాది లింగశరీరధర్మములనయితము త్యజించి అఖండానందస్వరూపుఁడవు కమ్ము.

అవ. సర్వానర్థములకు మూలము అహంకార మని సూచింపుచున్నారు:—

సన్త్యన్యే ప్రతిబన్ధాః పుంసః సంసారహేతవో దృష్టాః,
తేషామేషాం మూలం ప్రథమవికారో భవత్యహంకారః

తా. పురుషునకు సంసారహేతువు లగు ప్రతిబంధకము లనేకములు కనఁబడుచున్నవి. ఈ ప్రతిబంధకము లన్నిటికిని మూలము ప్రథమవికార మగు అహంకారము. అనఁగా అహంకారమునుండియే సమస్తప్రతిబంధకములును గలుగుచున్నవి.

అవ. సర్వప్రతిబంధకమూలభూతమగు అహంకారమును విడిచినఁగాని ముక్తి యనువార్త యైనను దుర్లభ మని చెప్పుచున్నారు:—

యావత్స్యాత్స్వస్య సంబన్ధోఽహంకారేణ దురాత్మనా,
తావన్న లేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా. 300

తా. సంసారదుఃఖపరంపరను గూర్చెడి యీకుత్సిత రూపాహంకారముతో ఆత్మ కెంతపర్యంతము సంబంధ ముండునో, అంతపర్యంతము అహంకారరాహిత్యమువలన సంభవించెడిముక్తి ఇంచు కయినను గలదనుటకు వలనుపడదు.

అవ. అహంకారత్యాగమువలన మోక్షప్రాప్తి యగునని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

అహంకారగ్రహాన్ముక్తః స్వరూపముపపద్యతే,
చన్ద్రవద్విమలః పూర్ణః సదానన్దః స్వయం ప్రభః. 301

తా. రాహుగ్రహముక్తుఁడగు పూర్ణచంద్రుఁ డెట్లు నిర్మలముగఁ బ్రకాశించునో యాప్రకారము అహంకార రూపాధ్యాసమునుండి విముక్తుఁ డగుజీవుఁడు పరిపూర్ణానంద స్వయంప్రకాశస్వరూపుఁ డై విలసిల్లును.

యో వా పురై షోఽహమితి ప్రతీతో
బుద్ధ్యా విక్లృప్తస్తమసాతి మూఢయా,

తస్యైవ నిశ్శేషతయా వినాశే
బ్రహ్మాత్మభావః ప్రతిబన్ధశూన్యః. 302

తా. జ్ఞానోదయము గాకపూర్వము తమోగుణప్రధాన మగుటచేత వివేకరహితమగు బుద్ధిచేత మలమాంసభూయిష్ఠమగు నీదేహామే ఆత్మ (నేను) యనెడి ఏ అధ్యాసము కల్పింపఁబడెనో! ఆయధ్యాసము గురుకటాక్షమున మననాదిదైవసంపదచే మొదలంట నిర్మూలింపఁబడఁగా బ్రహ్మాత్మైక్యభావన ప్రతిబంధరహితముగ స్ఫురించును.

అవ. బ్రహ్మానందమనెడి నిధిని అహంకారమనెడి క్రూర సర్పము ఆవరించి ప్రతిబంధకముగనున్నది. ఈసర్పమును నిర్మూలించినఁగాని బ్రహ్మానందనిధి లభింపదని చెప్పుచున్నారు:—

బ్రహ్మానన్దనిధిర్మహాబలవతాహంకారఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయైశ్చణ్డైస్త్రిభిర్మస్తకైః,

విజ్ఞానాఖ్యమహాసినా శ్రుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహిమిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుంక్షమః.

తా. సత్త్వరజస్తమోగుణము లనెడి భయంకర మగు మూఁడుశిరస్సులు గల బలిష్ఠమైన అహంకార మనెడిఘోర సర్పము బ్రహ్మానంద మనెడి నిధిని పరివేష్టించి రక్షించుచున్నది. వేదాంతవిజ్ఞాన మనెడి మహాఖడ్గముచే నామూఁడుశిరస్సులను త్రుంచివేసి యాసర్పమును నిర్మూలించుధీరుఁ డాబ్రహ్మానంద నిధిని అనుభవింపఁగలుగును. అనఁగా అహంకారము పూర్తిగ నశించినఁగాని బ్రహ్మానందము లభింపదని యభిప్రాయము.

అవ. అహంకారము పూర్తిగ నశించినఁగాని, తత్త్వజ్ఞానము కలుగ దనుటకు మరల దృష్టాంతమును ప్రతిపాదించుచున్నారు:—

యావద్వా యత్కించిద్విషదోషస్ఫూర్తిరస్తి చేద్దేహే,
కథమారోగ్యాయ భవే త్తద్వదహంతాపి యోగినో ముక్త్యై.

తా. శరీరమం దెంతకాలపర్యంతము విషదోష మేమాత్ర మయిన నుండునో, అంతపర్యంతము శరీరమున కారోగ్యము కలుగదు. ఆవిధముగనే ఎంతపర్యంత మహంకారము నిశ్శేషముగ నశింపకుండునో అంతవఱకు యోగికి ముక్తి లభింపదు.

అహమోఽత్యన్తనివృత్త్యా తత్కృతనానావికల్పసంహృత్యా,
ప్రత్యక్తత్త్వవివేకాదయమహమస్మీతి విన్దతే తత్త్వమ్. 305

తా. అహంకారము సంపూర్ణముగ నశించెనేని, అహంకారజన్యములగు సంశయవిపర్యయరూప నానావికల్పములును తొలఁగి ప్రత్యక్తత్త్వవివేకము (ప్రత్యగాత్మను దెలియుట) వలన 'అహం బ్రహ్మాస్మి' యనెడి తత్త్వానుభవ మగును.

[1]అహంకర్తర్యస్మిన్నహమితి మతిం ముఞ్చ సహసా
వికారాత్మన్యాత్మప్రతిఫలజుషి స్వస్థితిముషి,
యదధ్యాసాత్ప్రాప్తా జనిమృతిజరాదుఃఖబహులా
ప్రతీచశ్చిన్మూర్తేస్తవ సుఖతనోః సంసృతిరియమ్. 306

తా. వత్సా! చిదానందరూపప్రత్యగాత్మ వగునీకు ఏ యహంకారసంబంధమువలన జననమరణాదిదుఃఖభూయిష్ఠమగు నీసంసారము కలిగెనో, కర్తృత్వాదివికారయుక్తమును ఆత్మా

1 అహంకర్తర్యస్మిన్నహమితి.

సంద ప్రచ్ఛాదకమును చిత్ప్రతిబింబసహితమును నగు ఆయహం
కారమే నేననెడిభ్రాంతిని దృఢబోధచే వేగముగ విడిచి యానం
దింపుము.

అవ. అహంకారము నిశ్శేషముగఁ దొలఁగఁగ బ్రహ్మావ
బోధము సులభ మని చెప్పుచున్నారు:—

సదైకరూపస్య చిదాత్మనో విభో
రానన్దమూర్తే రనవద్యకీర్తేః,
నైవాన్యథా క్వాప్యవికారిణస్తే
వినాహమధ్యాసమముష్య సంసృతిః. 307

తా. జననమరణాదివికారరహితుఁడవును, సర్వవ్యాపకుఁ
డవును, నిష్కలంకుఁడవును నగు నీకు దేహతాదాత్మ్యమువలననే
సంసారబంధము కలిగెనుగాని, యీయధ్యాసము లేనియెడల
ఏవికారములును లేక నీవు సదానందస్వరూపుఁడవై ప్రకా
శింతువు.

అవ. ఈ అహంకారమే పరమశత్రువని సదృష్టాంతముగ
చెప్పుచున్నారు:—

తస్మాదహంకారమిమం స్వశత్రుం
భోక్తుర్గళే కణ్టకవత్ప్రతీతమ్,
విచ్ఛిద్య విజ్ఞానమహాసినా స్ఫుటం
భుఙ్క్ష్వాత్మసామ్రాజ్యసుఖం యథేష్టమ్. 308

తా. ఓవిద్వాంసుఁడా! భోజనము చేయుచున్నవానికంఠ
ములోఁ జిక్కుకున్నముల్లువలె దుఃఖప్రదమును స్వశత్రువును
అగు అహంకారమును విజ్ఞాన మనెడి మహాఖడ్గముతో ఛేదించి,
ఆత్మసామ్రాజ్యమును యథేష్టముగ ననుభవింపుము.

తతో౽హమాదేర్వినివర్త్య వృత్తిం
సంత్యక్తరాగః పరమార్థలాభాత్,
తూష్ణీం సమాస్స్వాత్మసుఖానుభూత్యా
పూర్ణాత్మనా బ్రహ్మణి నిర్వికల్పః. 309

తా. ఆప్రకారము అహంకారాదిసర్వవృత్తులను నశింపఁజేసి, రాగశూన్యుఁడవై, పరమార్థవస్తులాభమున మౌనము వహించి, నిర్వికల్పుఁడవై, ఆత్మసుఖానుభవముతో పరిపూర్ణబ్రహ్మస్థితి నుండుము.

అవ. వృత్తిసహితముగ అహంకారము నశించినను సంకల్పమాత్రమున నది పునరుద్భవమై విక్షేపాపత్తినిఁ గలిగించునని చెప్పుచున్నారు:—

సమూలకృత్తో౽పి మహానహం పున
ర్వ్యుల్లేఖితః స్యాద్యది చేతసా క్షణమ్,
సంజీవ్య విక్షేపశతం కరోతి
నభస్వతా ప్రావృషి వారిదో యథా. 310

తా. అహంకారము మిగుల ప్రబలమయినది. అది సమూలముగ నశింపఁజేయఁబడినను క్షణమాత్రము చిత్తసంఘర్షము కలిగెనేని యది పునర్జీవితమై పెరిగి, అనంతవిక్షేపములను (సంకల్పవికల్పములను) గలిగించును. ఎట్లనఁగా, వర్షర్తువునందు వాయుసంఘర్షమువలనఁ గలిగిన మేఘము నానావికారములఁ బొందునట్లే, అహంకారము సంకల్పరూపమునఁ బెరుఁగుచుండును అని తెలియవలెను.

నిగృహ్య శత్రోరహమోఽవకాశః
క్వచిన్న దేయో విషయానుచిన్తయా,
స ఏవ సంజీవనహేతురస్య
ప్రక్షీణజంబీరతరోరివాంబు. 311

తా. జంబీరవృక్షము (నిమ్మచెట్టు) మొదలు నఱకఁబడినను జలసంసర్గమువలన చిగురించి యెప్పటివలె పెద్దవృక్ష మగును. ఆప్రకారమే అహంకారశత్రువు నశింపఁజేయఁబడినను విషయానుచింతనవలన నది పునర్జీవితమై యెప్పటివలె వృద్ధి యగును అనఁగా అహంకారోత్పత్తికి విషయచింతన కారణము గనుక, విషయచింత యెంతమాత్రము కలుగరాదని యభిప్రాయము.

దేహాత్మనా సంస్థిత ఏవ కామీ
విలక్షణః కామయితా కథం స్యాత్,
అతోఽర్థసన్ధానపరత్వమేవ
భేదప్రసక్త్యా భవబన్ధహేతుః. 312

తా. దేహమం దాత్మబుద్ధిగలవాఁడు కామి యగును. దానికి విలక్షణుఁడు (దేహాత్మబుద్ధిలేనివాఁడు) కామియెట్లగును? కాఁబట్టి భేదబుద్ధితో శబ్దాదివిషయచింతనయే సంసారరూపబంధ మునకు హేతు వగును.

కార్యప్రవర్ధనాద్బీజప్రవృద్ధిః పరిదృశ్యతే,
కార్యనాశాద్బీజనాశస్తస్మాత్కార్యం నిరోధయేత్. 313

తా. విషయరూపకార్యవృద్ధివలన వాసనారూపకారణ (బీజ) వృద్ధి యగును. విషయరూపకార్యనాశమువలన వాసనా రూపబీజము నశించును. కనుక విషయరూపకార్యమును నశింపఁ

జేయవలెను. అనఁగా విషయవాసన పూర్తిగ నశింపవలె నని భావము.

వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా,
వర్ధతే సర్వధా పుంసః సంసారో న నివర్తతే. 314

తా. వాసనారూపబీజవృద్ధివలన విషయరూపకార్యము వృద్ధియగును. విషయరూపకార్యవృద్ధివలన వాసనారూపబీజము వృద్ధియగును. ఇట్లు వాసనయు కార్యమున్ను పరస్పరము వృద్ధియగుటవలన పురుషునకు సంసారము నివర్తింపదు.

అవ. ప్రాతిభాసికబంధనివృత్తికొఱకు వాసనయు తత్కార్యయు తచ్చింతనయు నివారణ మగుటకు నుపాయమును జెప్పుచున్నారు:—

సంసారబన్ధవిచ్ఛిత్త్యై తద్ద్వయం ప్రదహే ద్యతిః,
వాసనావృద్ధిరేతాభ్యాం చిన్తయా క్రియయా బహిః. 315
తాభ్యాం ప్రవర్ధమానా సా సూతే సంసృతిమాత్మనః,
త్రయాణాం చ క్షయోపాయః సర్వావస్థాసు సర్వదా. 316

తా. సంసారబంధనివృత్తిని గోరుయతి విషయములను జ్ఞానాగ్నిచే దహింపవలెను. అంతర్విషయచింతవలన స్థూలశరీరముయొక్క బాహ్యప్రవృత్తియు, దానివలన వాసనాబుద్ధియు విస్తరించును. అందువలన బాహ్యక్రియయు అంతరవిషయచింతనయు వృద్ధి యగుచు ఆత్మకు సంసారమును బెంచును. వాసన, విషయచింతన, బాహ్యక్రియ యను నీమూఁడును నాశమగుటకు ఉపాయ మేమనఁగా, జాగ్రదాదిసుషుప్తి పర్యంతము, బాల్యాదివార్ధకపర్యంతముగల సర్వావస్థలందును చెప్పఁబోవు మార్గమును అనుసరింపవలెను.

సర్వత్ర సర్వతః సర్వం బ్రహ్మమాత్రావలోకనమ్,
సద్భావవాసనాదార్ఢ్యా త్తత్త్రయం లయమశ్నుతే. 317

తా. అంతటను సర్వకాలములందును సర్వప్రపంచమును బ్రహ్మమాత్రముగఁ జూచుచు బ్రహ్మస్వభావవాసన దృఢమగు నేని పూర్వోక్తచింతనాదిత్రయమున్ను లీన మగును.

క్రియానాశే భవేచ్చిన్తానాశో௨స్మాద్వాసనాక్షయః,
వాసనాప్రక్షయో మోక్షః స జీవన్ముక్తి రిష్యతే. 318

తా. బాహ్యక్రియానాశ మగునేని ఆంతరవిషయచింత నశించును. అందువలన బాహ్యాభ్యంతరవాసనలు క్షీణింపఁగా అనాత్మవాసన సంపూర్ణముగ నశించి బంధనివృత్తియై మోక్షసిద్ధి యగును. ఇదియే జీవన్ముక్తి యనఁబడును.

సద్వాసనాస్ఫూర్తివిజృంభణే సతి
హ్యసౌ విలీనాత్వహమాదివాసనా,
అతిప్రకృష్టాప్యరుణప్రభాయాం
విలీయతే సాధు యథా తమిస్రా. 319

తా. రాత్రియందుండు గాఢాంధకారము సూర్యోదయముకాఁగా తొలంగును. ఆప్రకారమే శుద్ధవాసనాస్ఫూర్తి వృద్ధియైనకొలఁది అహంకారాదిమలినవాసన లన్నియు విలయమును బొందును.

తమస్తమఃకార్యమనర్థజాలం
న దృశ్యతే సత్యుదితే దినేశే,
తథాద్వయానన్దరసానుభూతౌ
నైవాస్తి బన్ధో న చ దుఃఖగన్ధః. 320

తా. సూర్యుఁ డుదయింపఁగా చీఁకటియు, చీఁకటివలనఁ గలుగు సర్వానర్థములును తొలఁగునట్లు, అద్వయానందరసాను భవము కలుగఁగా, సంసారబంధమున్ను సంసారబంధదుఃఖవాస నయు నుండవు. అనఁగా ఆత్మజ్ఞానమువలన ఆధ్యాత్మికాది సమస్తదుఃఖములున్ను నశించునని భావము.

దృశ్యం ప్రతీతం ప్రవిలాపయన్ స్వయం
సన్మాత్రమానన్దఘనం విభావయన్,
సమాహితః సన్బహిరన్తరం వా
కాలం నయేథాః సతి కర్మబన్ధే. 321

తా. (కర్మబంధమునఁ జిక్కి) నీకు దృశ్యము ప్రతీతమై (తోఁచి) నపుడెల్ల దృశ్యమంతయు మిథ్యయని దానియందు లక్ష్యముంచక దానిని లయింపఁజేయుచు, సన్మాత్రమగు ఆనంద స్వరూపానుభవముగలిగి, అనఁగా సచ్చిదానందాత్మతో తాదా త్మ్యమును బొందుచు, బాహ్యాభ్యంతరముల సమాహితుఁడవై కాలక్షేపము చేయుము. అందువలన నీకు మఱల సంసారవాసన కలుగదు.

అవ. పూర్వోక్తజీవన్ముక్తి ప్రాప్త్యనంతరము బ్రహ్మనిష్ఠ యందుఁ బ్రమాదము కలిగెనేని యది మృత్యురూపమగు నని చెప్పుచున్నారు:—

ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన,
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్బ్రహ్మణః సుతః. 322

తా. బ్రహ్మనిష్ఠయందు స్వస్వరూపప్రచ్యుతిరూపప్రమా దము నెన్నఁడును గలుగనీయఁగూడదు. అట్టి ప్రమాదము

(ఏమఱుపాటు) మృత్యువగు నని భగవంతుఁడగు సనత్కు-
మారుఁడు చెప్పెను.

అవ. బ్రహ్మనిష్ఠయందు గలుగు ప్రమాదమువలన ఘటించు అనర్థములను జెప్పుచున్నారు:—

న ప్రమాదాదనర్థోఽన్యో జ్ఞానినః స్వస్వరూపతః,
తతో మోహ స్తతోఽహంధీ స్తతో బన్ధ స్తతో వ్యథా. 323

తా. జ్ఞానికి స్వస్వరూపానుసంధానమందు ప్రమాదము (మఱుపు) కంటె వేఱే అనర్థము లేదు. ఏ మనఁగా, ప్రమాదము వలన మోహము, మోహమువలన అహంబుద్ధిరూపాఽహంకారము, అహంకారమువలనఁ గర్తృత్వభోక్తృత్వరూపబంధము కలుగును. ఈబంధమువలన జన్మమృత్యురూపసంసారదుఃఖము కలుగును. [కావున సంతతతైలధారవలె అనవచ్ఛిన్నముగ అంతర్లక్ష్యము ప్రత్యగభిన్నపరమాత్మయందే నిలిపి ఆలక్ష్యమును మఱవకుండవలె నని యభిప్రాయము.]

విషయాభిముఖం దృష్ట్వా విద్వాంసమపి విస్మృతిః,
విక్షేపయతి ధీదోషైర్యోషా జారమివ ప్రియమ్. 324

తా. జారిణి జారపురుషునిఁ జూచి తనకటాక్షవిక్షేపాది గుణములచేత వానిని మోహింపఁజేయునట్లు, పండితుఁడయినను విషయాభిముఖుఁడయ్యేనేని, విస్మృతి (మఱుపు) వానికి ఆత్మతత్త్వమును గప్పిపుచ్చి, విషయములందుఁ బ్రవృత్తినిఁ గలిగించి నానాప్రకారముల వానిని విషయలంపటునిగఁ జేయును.

యథా ప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి,
ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖమ్. 325

తా. నీటిపై దట్టముగఁ గ్రమ్ముకొనియుండు నాఁచును దొలఁగింపఁగా నది క్షణమాత్ర మైనను దొలఁగియుండక నీటిపై నెప్పటియట్లు క్రమ్ముకొనును. అప్రకారమే స్వస్వరూపానుసంధానమునుండి పరాఙ్ముఖుఁ డైనవాఁడు పండితుఁ డయినను మాయ వాని నావరించుచునే యుండును.

లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమీష
ద్బహిర్ముఖం సన్నిపతే త్తత స్తతః,
ప్రమాదతః ప్రచ్యుతకేలికన్దుకః
సోపానపఙ్క్తౌ పతితో యథా తథా. 326

తా. ఆటచెండు ప్రమాదవశమున చేయి జారి సోపానాగ్రమునఁబడినయెడల, అది యొక్కొక మెట్టుమీఁదను దొర్లుచు క్రిందకు పడిపోవును. ఆవిధముననే బ్రహ్మలక్ష్యమందు నుంచఁబడిన చిత్తము క్షణకాల మైనను లక్ష్యము తప్పి బహిర్ముఖమైన యెడల మనస్సు నానాటికిఁ బ్రాపంచికవిషయములందుఁ జిక్కి అధోగతినిఁ జెందును.

విషయేష్వావిశచ్చేతః సంకల్పయతి తద్గుణాన్,
సమ్యక్సంకల్పనాత్కామః కామాత్పుంసః ప్రవర్తనమ్. 327

తా. చిత్తమునకు క్షణమాత్రమయినను విషయప్రసక్తి కలిగెనేని, చిత్త మావిషయములయొక్క సౌందర్యాదిగుణములను సంకల్పించుచుండును. అందువలన విషయేచ్ఛ కలుగును. ఆవిషయేచ్ఛ యధికము కాఁగా పురుషునకు కామము (కోరిక) వృద్ధియగును. అందువలన విషయభోగములందు ప్రవృత్తి కలుగును.

తతః స్వరూపవిభ్రంశో విభ్రష్టస్తు పతత్యధః,
పతితస్య వినా నాశం పునర్నారోహ ఈక్ష్యతే
సంకల్పం వర్జయేత్తస్మాత్సర్వానర్థస్య కారణమ్. 328

తా. ఈహేతువువలన (పైశ్లోకముతో నన్వయము) సమాధికాలమందు ప్రమాదము కలిగెనేని స్వరూపవిభ్రంశ మగును. అనఁగా ఆత్మస్వరూపము లక్ష్యమునుండి తప్పిపోవును. ఆత్మస్వరూపవిభ్రంశమువలన పురుషునకు అధఃపతన మగును. అధఃపతనము గిలిగినవానికి వినాశము గలిగి వానిచిత్తము మఱల బ్రహ్మలక్ష్యమందు నిలువదు. కావున సర్వానర్థకారణమగు సంకల్పమున కవకాశ మీయఁగూడదు.

అతః ప్రమాదాన్న పరోఽస్తి మృత్యు
ర్వివేకినో బ్రహ్మవిదః సమాధౌ,
సమాహితః సిద్ధిముపైతి సమ్య
క్సమాహితాత్మా భవ సావధానః. 329

తా. కాఁబట్టి వివేకియగు బ్రహ్మవిదునకు సమాధియందు ప్రమాదముకంటె వేఱే మృత్యువు లేదు. "సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే" యను భగవద్వాక్యానుసారముగ బ్రహ్మజ్ఞునకు జన్మాభావ మగుటవలన ప్రాణవియోగరూపమృత్యువు లేదు గనుక సమాధియందు ప్రమాదమే మృత్యువు. సమాహిత(ఏకాగ్ర) చిత్తము గలవానికి జీవన్ముక్తి లభించును. కనుక శిష్యా! నీ వెల్లప్పుడును సావధానుఁడవై సమాహితచిత్తము గలిగి యుండుము.

జీవతో యస్య కైవల్యం విదేహే చ స కేవలః,
యత్కించిత్పశ్యతో భేదం భయం బ్రూతే యజుశ్శ్రుతిః.

తా. సంకల్పత్యాగరూపమగు జీవన్ముక్తికిప్రాపించినవాఁడు విదేహకైవల్యమును బొందును. అనఁగా జీవద్దశయందు సంపూర్ణకైవల్యసుఖము ననుభవించినవాఁడు ప్రకృతిబంధవినిర్ముక్తుఁడగుటవలన శరీరపాతానంతరము పరబ్రహ్మమే యగును. ఏ పురుషునకు బ్రహ్మాత్మవిషయమున నేమాత్రము జీవేశ్వరభేదబుద్ధి కలిగినను వానికి జన్మమృత్యురూపమగు భయము గలదని "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అనెడి యజుఃశ్రుతి ఘోషించుచున్నది.

యదా కదా వాపి విపశ్చిదేష
బ్రహ్మణ్యనన్తేఽప్యణుమాత్రభేదమ్,
పశ్యత్యథాముష్య భయం తదేవ
యదీక్షితం భిన్నతయా ప్రమాదాత్. 331

తా. ఏవిద్వాంసునకు అనంతమగు బ్రహ్మమునం దణుమాత్రమయినను భేదబుద్ధి యెపుడు గలుగునో, యపుడె వానికి భయము సమకూరును. "ఏతస్మిన్నుదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతి, ద్వితీయాద్వై భయం భవతి," అను శ్రుతియు నట్లే చెప్పుచున్నది. ఈభేదబుద్ధి బ్రహ్మనిష్ఠయందుఁ బ్రమాదమువలనఁ గలుగును. కనుక సర్వదా సావధానచిత్తముతో స్వస్వరూపప్రచ్యుతి కలుగకుండ నుండవలె నని యభిప్రాయము.

శ్రుతిస్మృతిన్యాయశతైర్నిషిద్ధే
దృశ్యేఽత్ర యః స్వాత్మమతిం కరోతి,
ఉపైతి దుఃఖోపరి దుఃఖజాతం
నిషిద్ధకర్తా స మలిమ్లుచో యథా. 332

తా. "నేహ నానాస్తి కించన," అతో ఽన్యదార్తమ్," "అథాతో నేతి" ఇత్యాద్యనేక శ్రుతిప్రమాణములవలనను, "అయం ప్రపంచో మిథ్యైవ సతతం బ్రహ్మాహమద్వయమ్" ఇత్యాదిస్మృతిప్రమాణములవలనను దృశ్యము నిషేధింపఁబడినది. కాఁబట్టి యేపురుషునకు దేహాదికమందు ఆత్మబుద్ధి కలుగునో వాఁడు, విధినిషిద్ధకర్మాచరణగలచోరుఁడు అనంతములగు మలినవ్యథలను బొందునట్లు, దుఃఖమును బొందును.

అవ. సత్యానుసంధానపరుఁడు ముక్తుఁడనియు, మిథ్యానుసంధానపరుఁడు నష్టముపొందు ననియుఁ జెప్పుచున్నారు:—

సత్యాభిసంధానరతో విముక్తో
మహత్త్వమాత్మీయముపైతి నిత్యమ్,
మిథ్యాభిసంధానరతస్తు నశ్యే
ద్దృష్టం తదేతద్యద చోరచోరయోః. 333

తా. అద్వితీయబ్రహ్మరూపచింతనమందు నిరంతర ప్రీతిగల పురుషుఁడు జీవన్ముక్తుఁడై నిరావరణస్వరూపానందమును బొందును. మిథ్యయగు శరీరాదికమందు అనురాగము గలపురుషుఁడు ప్రమాదరూపమృత్యువును బొందును. ఈస్థితి నిర్దోషియందును దోషియందును స్ఫుటమగును: ఎట్లనఁగా, పూర్వకాలమునదోషమును గనిపెట్టుటకు 'జలదివ్యము' 'అగ్ని దివ్యము' నను రెండు ప్రమాణము లుండెడివి. జలదివ్య మనఁగా, కలితీ చేయఁబడిన బంగారువస్తువునందు దోషమును గనుగొనుట కావస్తువుయెత్తు మేలిమిబంగారమును ఒకసిబ్బెలోను, వస్తువును రెండవసిబ్బెలోను ఉంచి, రెండు సిబ్బెలును నీటిలో నుంచి తూఁచినయెడల వస్తువునందు దోష ముండినయెడల నావస్తువుగలసిబ్బె తేలిపోవును.

కలితీ లేనియెడల రెండుచిబ్బెలును సమముగ తూఁగును. అగ్ని దివ్య మనఁగా, సలసల కాఁగిన తైలములో అపరాధారోపణము కాఁబడినవానిచెయ్యి యుంచినయెడల దోషియగునేని వాని చెయ్యి కాలును. నిర్దోషి యైనయెడల వానిచెయ్యి కాలదు. ఈ ప్రమాణములవలన పూర్వకాలమున న్యాయస్థానములలో దోషనిర్ధారణ చేయఁబడుచుండెడి దని ఐతిహ్యము.

అవ. సత్యానుసంధానమునకై నిత్యానుష్ఠేయ నియమ విధినిఁ జెప్పుచున్నారు:—

యతి రసదనుసంధిం బన్ధహేతుం విహాయ
స్వయమయమహమస్మీ త్యాత్మదృష్ట్యైవ తిష్ఠేత్,
సుఖయతి నను నిష్ఠా బ్రహ్మణి స్వానుభూత్యా
హరతి పరమవిద్యా కార్యదుఃఖం ప్రతీతమ్. 334

తా. విరక్తుఁడగుయతి బంధహేతువగు అనిత్యవస్త్వనుసంధాన మెంతమాత్రముం జేయక 'నేను స్వయంప్రకాశాత్మను' (అయమాత్మా బ్రహ్మ) అనెడిఅపరోక్షజ్ఞానముతో, అహంకారాది దేహపర్యంతముగల సర్వమునకు సాక్షీరూపజీవాత్మ నగునేను బ్రహ్మమనే యను నిశ్చయబుద్ధి గలిగి యుండవలెను. ఇట్లు ఆత్మదృష్టియందు సుస్థిరుఁడై, ఆప్రకారమే ధ్యానించుచు, బ్రహ్మనిష్ఠనుండి బ్రహ్మానుభవపరుఁ డయ్యేనేని ప్రతీయమానమగు సర్వసంసారదుఃఖమును వీడి పరమసుఖము నొందును.

అవ. బాహ్యచింత వాసనాహేతువు గనుక దానినిఁ ద్యజింపవలె ననిన:—

బాహ్యానుసంధిః పరివర్ధయేత్ఫలం
దుర్వాసనామేవ తతస్తతోఽధికామ్,

జ్ఞాత్వా వివేకైః పరిహృత్య బాహ్యం
స్వాత్మానుసంధిం విదధీత నిత్యమ్.                335

తా. బాహ్యవిషయచింతనకు దుర్వాసనాభివృద్ధియే ఫలము. ఆవాసన అంతకంతకు విస్తరించును. వివేకి యగువాఁడు తెలిసికొని బాహ్యవస్తుచింతనము పరిహరించి సర్వదా ప్రత్యగభిన్న పరమాత్మ చింతనమే చేయుచుండవలెను.

బాహ్యే నిరుద్ధే మనసః ప్రసన్నతా
మనఃప్రసాదే పరమాత్మ దర్శనమ్,
తస్మిన్సుదృష్టే భవబన్ధనాశో
బహిర్నిరోధః పదవీ విముక్తేః.                336

తా. బాహ్యవిషయచింతనను నిరోధించుటవలన మనస్సునకుఁ బ్రసన్నతకలుగును. అనఁగా ఏకాగ్రత కలుగును, మనఃప్రసాదమువలన బ్రహ్మసాక్షాత్కార మగును. బ్రహ్మసాక్షాత్కారమువలన కర్తృత్వభోక్తృత్వాదిబంధవిముక్తి యగును, కనుక బాహ్యవృత్తినిరోధమే మోక్షమునకు మార్గము.

కః పణ్డితః సన్సదసద్వివేకీ
శ్రుతిప్రమాణః పరమార్థదర్శీ,
జానన్హి కుర్యాదసతోఽవలంబం
స్వపాతహేతోః శిశువన్ముముక్షుః.                337

తా. సదసద్వివేకియై (ఆత్మానాత్మవివేకము గలిగి), శ్రుతిప్రమాణముల ననఁగా తత్త్వమస్యాదిమహావాక్యార్థమును దెలిసికొనినవాఁడై, పరమాత్మ సాక్షాత్కారము గలిగి, మోక్షాసక్తుఁడగు నేపండితుఁడు బాహ్యపదార్థచింతన స్వస్వరూపాను

భవమునకు ప్రతిబంధక మగునని తెలిసియు బాలునివలె ఆ య నాత్మవస్తుచింతన నెట్లు చేయఁ గలుగును? అనఁగా బ్రహ్మానంద రసానుభవము గలయోగికి బాహ్యప్రపంచవ్యాపారము కలుగ దని యభిప్రాయము.

అవ. జ్ఞానికిని అజ్ఞానికినిఁ గలభేదమును సదృష్టాంతముగ విశదీకరించుచున్నారు:—

దేహాదిసంసక్తిమతో న ముక్తి
ర్ముక్తస్య దేహాద్యభిమత్యభావః,
సుప్తస్య నోజాగరణం నజాగ్రతః
స్వప్నస్తయోర్భిన్నగుణాశ్రయత్వాత్. 338

తా. సుషుప్తిజెందినవానికి జాగ్రదవస్థ లేదు. జాగ్రదవస్థ యందు స్వప్నము కలుగదు. ఈసుషుప్తి జాగ్రదవస్థ లెట్లు పర స్పరవిరుద్ధములో, అట్లేఆత్మానాత్మలును భిన్నగుణాశ్రయములే. అనఁగా, అనాత్మ సత్వరజస్తమోగుణకార్యము. ఆత్మ యన్ననో యది గుణాతీతము. కనుక అనాత్మ వస్తువులగు దేహాదికమందు ఆసక్తిగలవానికి మోక్షప్రాప్తిలేదు, ముక్తపురుషునకు దేహాద్య సత్యవస్తువులం దనురాగము కలుఁగదు. "అవిద్యాసహ కార్యేణ నాసీదస్తి భవిష్యతి", [జీవన్ముక్తునకు (జ్ఞానికి) జాగ్రదాదికాల త్రయమందును అవిద్యాతత్కార్యసంసక్తి లేదు] అని విద్వ న్నిశ్చయము.

అవ. సర్వాత్మ భావరూపబ్రహ్మాభ్యాసము జీవన్ముక్తిహేతు వని చెప్పుచున్నారు:—

అన్తర్బహిః స్వం స్థిరజఙ్గమేషు
జ్ఞానాత్మనాధారతయా విలోక్య,

త్యక్త్వాఖిలోపాధిరఖణ్డరూపః
పూర్ణాత్మనా యః స్థిత ఏవ ముక్తః. 339

తా. స్థావరజంగమరూప సమస్త వస్తుసముదాయము యొక్క బాహ్యాభ్యంతరములందు వ్యాపించి సర్వాధారమై, జ్ఞానస్వరూపమున తానై యున్నట్లు (తనను తాను) చూచుచు, సకలోపాధులను (వాసన కర్మ సంసార సంకల్ప వికల్పములను త్యజించి, అఖండపరిపూర్ణస్వరూపమును బొంది యేపురుషుఁడు సుస్థితుఁడై యుండునో యాతఁడే ముక్తుఁడు.

సర్వాత్మనా బన్ధవిముక్తిహేతుః
సర్వాత్మభావాన్న పరోఽస్తి కశ్చిత్,
దృశ్యాగ్రహే సత్యుపపద్యతేఽసౌ
సర్వాత్మభావోఽస్య సదాత్మనిష్ఠయా. 340

తా. ఇట్లు సర్వమును [ఆత్మయగు] తానే యని నిశ్చయ బుద్ధి గలిగి యుండుట సంసారబంధవిముక్తికిఁ గారణమగును. మోక్షప్రాప్తికి సర్వాత్మభావముకంటె నితరోపాయము లేదు. అనఁగా, నే ముముక్షువునకు దేహాదిదృశ్యప్రపంచము స్ఫురింపక సర్వమును ఆత్మగాఁ దోఁచుచుండునో అట్టిస్థితియే సర్వాత్మ భావము. అట్టివాఁడే సచ్చిదానందపరమాత్మయందు పూర్ణనిష్ఠ కలిగియుండును.

దృశ్యస్యాగ్రహణం కథం ను ఘటతే దేహాత్మనా తిష్ఠతో
బాహ్యార్థానుభవప్రసక్తమనసస్తత్తత్క్రియాం కుర్వతః,
సన్న్యస్తాఖిలధర్మకర్మవిషయైర్నిత్యాత్మనిష్ఠాపరై
స్తత్త్వజ్ఞైః కరణీయమాత్మని సదానన్దేచ్ఛుభిర్యత్నతః. 341

తా. దేహమే ఆత్మ యనుబుద్ధితో బాహ్యశబ్దాదివిషయ చింతనాసక్తిగల మనస్సుతో తత్తద్విషయానుకూలక్రియలను జేయుచు, దృశ్యవస్తుగ్రహణము గల పురుషునకు సర్వాత్మ భావము ఎట్లు కలుగును? (కలుగనే కలుగదనుట).మనఃకల్పితము లగు సకలధర్మములను కర్మలను విషయములను త్యజించి, సర్వదా ఆత్మస్వరూపరుఁడై బ్రహ్మానందానుభవమందు ఉత్కట మైన యిచ్ఛగలతత్త్వజ్ఞునకుమాత్రమే సర్వాత్మభావము సుస్థిరమగును. కనుక నటువంటిపురుషుఁడే అత్యంతప్రయత్న ముతో సర్వాత్మభావన చేయఁగలుగును.

అవ. జీవన్ముక్తిగోరుయతి సర్వాత్మకొఱకుఁ జేయవలసిన సమాధి లక్షణములను శ్రుతిప్రమాణముగ విశదీకరించు చున్నారు:—

సర్వాత్మసిద్ధయే భిక్షోః కృతశ్రవణకర్మణః,
సమాధిం విదధాత్యేషా శాన్తో దాన్త ఇతి శ్రుతిః. 342

తా. బ్రహ్మనిష్ఠ గురుముఖమున వేదాంతవాక్యశ్రవణము నేయు భిక్షువు సర్వాత్మసిద్ధికొఱకు "శాన్తో దాన్త ఉపరతస్తి తిక్షుః సమాహితో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్," (శమాదిషట్కసంపత్తిగలిగి సమాహితచిత్తుఁడై, తనయందే తన ఆత్మను గనుఁగొనవలెను) అని నిదిధ్యాసనముయొక్క పరిపక్వా వస్థ యగు సమాధివిధానమును శ్రుతి చెప్పుచున్నది.

ఆరూఢశక్తేరహమో వినాశః
కర్తుం న శక్యః సహసాపి పణ్డితైః,
యే నిర్వికల్పాఖ్యసమాధినిశ్చలా
స్తాన న్తరాన న్తభవా హి వాసనా. 343

తా. అహంకారముయొక్క శక్తి అత్యంతబలిష్ఠ మయినది. ఆ అహంకారమును శీఘ్రముగ నశింపఁజేయుటకు వేదాంత శాస్త్రజ్ఞానముగల పండితునికైనను సాధ్యము కాదు. ఇఁక నెవనికి సాధ్యమగు ననఁగా, నేపురుషుఁడు నిర్వికల్పకసమాధియందు నిశ్చలచిత్తుఁ డగునో, వానికి అనంతానంతజన్మములనుండి పరంపరగా వచ్చుచుండు వాసనల సహితముగ అహంకారము నశించును.

వి. "సమ్ ఆఙ్ ధాకిః ఇతి సమాధిః" అని వ్యుత్పత్తి. సమాధి యనఁగా యోగము. "ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచర నివాతదీపవచ్చిత్తంసమాధిరభిధీయతే." అని శ్రీవేదాంతపంచదశి, తత్త్వవివేకప్రకరణమందుఁ జెప్పఁబడినది. ధ్యాతృధ్యానములను గ్రమముగఁ బరిత్యజించి ధ్యేయవస్తువు (బ్రహ్మము) నందు, గాలిలేని స్థలమున నుండుదీపమువలె చిత్తము ధ్యానాయత్త మగుటయే సమాధి. ఈవిషయమై శ్వేతాశ్వతర, అమృతనాద, ధ్యానబిందూపనిషత్తులందు సవిస్తరముగఁ జెప్పబడినది.

అవ. అహంకారగ్రంథిచ్ఛేదము గానిపురుషునికి ఆవరణశక్తిద్వారా విక్షేపశక్తి ప్రబలమై చిత్తవిక్షేపమును గలిగించునని చెప్పుచున్నారు:—

అహంబుద్ధ్యైవ మోహిన్యా యోజయిత్వావృతేర్బలాత్,
విక్షేపశక్తిః పురుషం విక్షేపయతి తద్గుణైః. 344

తా. విక్షేపశక్తి ఆవరణశక్తియొక్క సహాయముచే పురుషునకు అహంకారరూపమోహమును గలిగించి దానిగుణముల వలన జన్మాప్తిరూపవిక్షేపమును గలిగించును.

విక్షేపశక్తి విజయో విషమో విధాతుం
నిశ్శేషమావరణశక్తినివృత్త్యభావే,
దృగ్దృశ్యయోః స్ఫుటపయోజలవద్విభాగే
నశ్యేత్తదావరణమాత్మని చ స్వభావాత్,
నిస్సంశయేన భవతి ప్రతిబన్ధశూన్యో
విక్షేపణం న హి తదా యది చేన్మృషార్థే. 345

తా. ఆవరణశక్తి నిశ్శేషముగ నివృత్తి కానియెడల విక్షేపశక్తిని జయించుట సాధ్యము కాదు. క్షీరనీరములను విభజించినట్లు దృగ్దృశ్యములను (ద్రష్టయగు ఈశ్వరుని దృశ్యమగు జగత్తును) విభాగించినయెడల ఆవరణశక్తి తనంతట స్వాభావికముగ నశించును, అనఁగా ఆత్మయందు లీన మగును. మిథ్యాపదార్థములందు అధ్యాససహితమగు విక్షేప మెపుడు నిశ్శేషముగ లేకపోవునో యపుడు నిస్సంశయముగ యథార్థ తత్త్వజ్ఞాన ముత్పన్న మగును.

సమ్యగ్వివేకః స్ఫుటబోధజన్యో
విభజ్య దృగ్దృశ్యపదార్థతత్త్వమ్,
ఛినత్తి మాయాకృతమోహబన్ధం
యస్మాద్విముక్తస్య పునర్న సంసృతిః. 346

తా. ఆవరణవిక్షేపములు నిశ్శేషముగ నివర్తింపఁగా గురూపదిష్ట మగు దృఢబోధవలనఁ గలిగిన ఆత్మానాత్మవివేకము దృగ్దృశ్యపదార్థములను విభజించి మాయాకల్పితమగు మోహబంధమును ఛేదించును. ఇదియె ముక్తదశ. ఇట్లు మోహబంధము తెగుటవలన ముక్తుఁ డగువానికి పునర్జన్మము (సంసారము) కలుగదు.

అవ. అనంత జన్మార్జిత ప్రారబ్ధకర్మప్రేరిత మగు ప్రతిభాసికావిద్యాజాలము నివర్తింపజేసెడి ముఖ్యోపాయమును జెప్పుచున్నారు:—

పరావరైకత్వవివేకవహ్ని
ర్దహత్యవిద్యాగహనం హ్యశేషమ్,
కిం స్యాత్పునః సంసరణస్య బీజ
మద్వైతభావం సముపేయుషోఽస్య. 347

తా. 'తత్త్వమసి'త్యాది మహావాక్యములవలనఁ గలిగిన జీవబ్రహ్మైకత్వజ్ఞానమనెడి అగ్ని అవిద్యారూపమహారణ్యమును నిశ్శేషముగ దహించును. సంసారమునకు బీజ మగుఅవిద్య నశించి అద్వైతభావము స్థిరపడినపురుషునకు సంసారకారణము ఉండదు.

౨ "రాగాదయః సన్తు కామం న తద్భావోఽపరాధ్యతి ఉత్ఖాతదంష్ట్రోరగవదవిద్యా కిం కరిష్యతి." (తత్త్వజ్ఞానికి రాగాదులున్నను అవి ఆభాసమాత్రములై కోరలు పెఱుకఁబడిన సర్పమువలె, అవిద్య వానిని బాధింపఁజాలదు) అని శాస్త్రాంతరోక్తి.

ఆవరణస్య నివృత్తిర్భవతి చ సమ్యక్పదార్థదర్శనతః,
మిథ్యాజ్ఞానవినాశస్తద్వద్విక్షేపజనితదుఃఖనివృత్తిః. 348

తా. సంశయాదిరహితముగ అధిష్ఠాన (ఆత్మవస్తు) దర్శనము కాఁగా ఆవరణవృత్తి యగును. ఆవరణనివృత్తి కాఁగా మిథ్యా(విపర్యయ) జ్ఞానము నశించును. (చకారమువలన విషయాధ్యాసనివృత్తియు అవిద్యానివృత్తియుఁగలుగుననిభావము).

మిథ్యాజ్ఞానము నశింపఁగా విక్షేపజనితసర్వదుఃఖములును నశించును. అనఁగా విక్షేపస్వభావ మగురజోగుణము, తజ్జన్య కామాదిపీడయు నశించును. లేదా, విక్షేపశక్తిజన్యజన్మమరణాదిదుఃఖము నశించు నని యభిప్రాయము.

ఏతత్త్రితయం దృష్టం సమ్యగ్రజ్జుస్వరూపవిజ్ఞానాత్,
తస్మాద్వస్తు సతత్త్వం జ్ఞాతవ్యం బన్ధముక్తయే విదుషా. 349

తా. త్రాటినిఁ జూచి యది సర్పమనుకొనినపుడు భయకంపాదులు కలుగును. దీపసహాయమున నది పాము కాదు రజ్జుమాత్రమే యని తెలిసికొనఁగా భయ కంపాదులు తొలఁగును. ఇచట రజ్జువువంటి సత్యాత్మను దెలియకుండుట ఆవరణము. త్రాటినిఁ జూచి పామనుకొనినట్లు, దేహమే ఆత్మ యనుకొనుట విక్షేపము. భయ కంపాదులవంటి సాంసారికతాపత్రయము దుఃఖము. కల్పితసర్పమున కధిష్ఠానమగు త్రాటినిఁ దెలిసికొనఁగనే భయకంపాదులు తొలఁగిపోవునట్లు, అధిష్ఠానమగు బ్రహ్మమును బంధవిముక్తినిఁ గోరువిద్వాంసుఁడు సద్వస్తుతత్త్వమును దెలిసికొనవలెను.

అయోఽగ్నియోగాదివ సత్సమన్వయా
న్మాత్రాదిరూపేణ విజృంభతే ధీః,
తత్కార్యమేతత్త్రితయం యతో మృషా
దృష్టం భ్రమస్వప్నమనోరథేషు. 350

తా. జడ మగు ఇనుము అగ్నిసంపర్కమువలనఁ బ్రకాశించుచు దహింపఁగలిగినట్లు, జడ మగుబుద్ధియు ఆత్మసంయో

గమువలన జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపముగఁ బరిణమించును. భ్రాంతి కాలమందును స్వప్నమందును సంకల్పములందును తోఁచెడి జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపప్రపంచము మిథ్య యగునట్లు, మాయా కల్పితము లగునీజ్ఞాతృజ్ఞానజ్ఞేయములు ప్రబోధకాలమందు సత్య ములు కావు.

తతో వికారాః ప్రకృతేఽహంముఖా
దేహావసానా విషయాశ్చ సర్వే,
[1]క్షణేఽన్యథాభావిన ఏష ఆత్మా
నోదేతి నాప్యేతి కదాపి నాన్యథా. 351

తా. ఈజ్ఞాత్రాదిత్రయము సత్యము కానందున ప్రకృతి (మాయా) కార్యములగు అహంకారాదిదేహాంతములగు సర్వ వికారములును దృశ్యపదార్థములును ప్రతిక్షణమున మాఱు చునే యుండును. కాని, యీకార్యకారణసంఘాతమునకు సాక్షి యగుఆత్మకు పుట్టుట పెరుగుట నశించుట మొదలగు వికారము లెవ్వియును లేవు.

నిత్యాద్వయాఖణ్డచిదేకరూపో
బుద్ధ్యాదిసాక్షీ సదసద్విలక్షణః,
అహంపదప్రత్యయలక్షితార్థః
ప్రత్యక్సదానన్దఘనః పరాత్మా. 352

ఇత్థం విపశ్చిత్సదసద్విభజ్య
నిశ్చిత్య తత్త్వం నిజబోధదృష్ట్యా,

---

1 క్షణేఽన్యథా భావితయా హ్యమీషామసత్త్వమాత్మా తు కదాపి నాన్యథా.

జ్ఞాత్వా స్వమాత్మానమఖణ్డబోధం
తేభ్యో విముక్తః స్వయ మేవ శామ్యతి. 353

తా. పరమాత్మ నిత్యుఁడు, ద్వైతరహితుఁడు, అఖండ చిన్మాత్రస్వరూపుఁడు, బుద్ధ్యాదులకు సాక్షి, సదసత్ (కార్య కారణ) విలక్షణుఁడు, అహం ప్రత్యయమునకు లక్ష్యార్థము (లక్షణావృత్తిచే గోచరుఁడు), సర్వానుస్యూతసదానందఘనుఁడును మోక్షాసక్తుఁ డగువండితుఁ డీరీతిగా సత్యాసత్యవిభాగ జ్ఞానముచే సద్వస్తువును నిశ్చయించి, నిజబోధదృష్టివలన (అభేద దృష్టివలన) అఖండబోధస్వరూపుఁ డగుఆత్మను దెలిసికొని సర్వోపాధివినిర్ముక్తుఁడై, నిర్వికల్పావస్థను బొంది, శాంతచిత్తుఁడు కావలెను (ఇదియె జీవన్ముక్తత్వ మని తెలియవలెను.)

అజ్ఞాన హృదయగ్రన్థే ర్నిశ్శేషవిలయ స్తదా,
సమాధినావికల్పేన యదాద్వైతాత్మ దర్శనమ్. 354

తా. అజ్ఞానరూపహృదయగ్రంథి యెపుడు నిశ్శేషముగ విలయమగు (వీడు)నో, యపుడు నిర్వికల్పసమాధియందు అద్వితీయాత్మ స్వయంప్రకాశమానమై స్ఫురించును. ఏయితరోపాయమునను అజ్ఞానము నశింపదు.

త్వమహమిదమితీయం కల్పనా బుద్ధిదోషా
త్ప్రభవతి పరమాత్మన్యద్వయే నిర్విశేషే,
ప్రవిలసతి సమాధావస్య సర్వో వికల్పో
విలయనముపగచ్ఛేద్వస్తుతత్త్వావధృత్యా. 355

తా. (పూర్వవాసనావిశిష్ట) బుద్ధిదోషమువలన నిర్విశేషాద్వితీయపరమాత్మయందు నీవు నాది అది ఇది మొదలగు కల్ప

నలు పొందమును. నిర్వికల్పసమాధికాలమందు ఆత్మతత్త్వధారణ (బ్రహ్మాత్మైక్యవృత్తి) గల పురుషునకు సర్వసంకల్పవికల్పములును నష్టమై కేవలాత్మస్వరూపమే స్ఫురించుచుండును. కావున చిత్త నిరోధరూపనిర్వికల్పసమాధిని అభ్యసింపవలెనని యభిప్రాయము.

వి. "ప్రశాన్తవృత్తికం చిత్తం పరమానన్దదాయకమ్, అసంప్రజ్ఞాతనామాఽసౌ సమాధిర్యోగినాం ప్రియః" అఖిల వృత్తిశూన్యమగుచిత్తము పరమానందదాయక మగును. ఇట్టిస్థితి అసంప్రజ్ఞాతసమాధి యనఁబడును. ఈసమాధి యోగులకు ప్రియ మయినది. ఈ అసంజ్ఞాతసమాధియే యిచట సూచింపఁ బడినది.

శాన్తో దాన్తః పరముపరతః క్షాన్తియుక్తః సమాధిం
కుర్వన్నిత్యం కలయతి యతిః స్వస్య సర్వాత్మభావమ్,
తేనావిద్యాతిమిరజనితాన్సాధు దగ్ధ్వా వికల్పా
న్బ్రహ్మాకృత్యా నివసతి సుఖం నిష్క్రియో నిర్వికల్పః,

తా. శమదమయుక్తుఁడై (అంతరింద్రియబాహ్యేంద్రియనిగ్రహము గలిగి) పరమోపరతుఁడై, క్షమాన్వితుఁడై, ఎల్లపుడును సమాధినిష్ఠుఁడగు యతి, "సర్వమిదమహం చ బ్రహ్మ" యనెడి, సర్వాత్మభావమును బొంది, యీసర్వాత్మభావమువలన అవిద్యాంధకారజన్యసకలవికల్పములును నిశ్శేషముగ నశింపఁగా, నిష్క్రియుఁడును నిర్వికల్పుఁడునై బ్రహ్మరూపమును బొంది సుఖించును.

సమాహితా యే ప్రవిలాప్య బాహ్యం
శ్రోత్రాది చేతః స్వమహం చిదాత్మని,

త ఏవ ముక్తా భవపాశబన్ధై
ర్నాన్యే తు పారోక్ష్యకథాభిధాయినః. 357

తా. శబ్దాదిబాహ్యవిషయములను, శ్రోత్రాదీంద్రియములను, చిత్తమును, 'స్వమ్ అహమ్' (నాది నేను) అనెడి ప్రత్యయములను ప్రత్యగ్రూపచిదాత్మయందు లయింపఁజేసి, ఏకాగ్రచిత్తముతో నుండునట్టి పురుషుఁడు సంసారబంధము నుండి విముక్తుఁ డగును. అట్లు సమాధినిష్ఠుఁడుగాని యితరుఁడు వేదాంతశాస్త్రపఠనమాత్రసుఖము గలవాఁడేకాని మోక్షసుఖానుభవశాలి కాఁజాలఁడు. "అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణిమోదతే, ప్రతిబింబితశాఖాగ్రఫలాస్వాదనమోదవత్." అట్టివాఁడు నీటియందు ప్రతిబింబించిన శాఖాగ్రమునందుఁ గల ఫలమును జూచి తినినట్లు సంతోషించువానివలె, బ్రహ్మానుభవము లేకయే శాస్త్రజన్యజ్ఞానమువలన వ్యర్థముగ సంతసించువాఁ డగును.

ఉపాధిభేదాత్స్వయమేవ భిద్యతే
చోపాధ్యపోహే స్వయమేవ కేవలః,
తస్మాదుపాధేర్విలయాయ విద్వా
న్వసేత్సదా కల్పసమాధినిష్ఠయా. 358

తా. ఆత్మ యందఱియందును నొక్కఁడయ్యును శరీరోపాధులనుబట్టియే పలువిధములుగఁ దోఁచును. కాని ఉపాధి తొలఁగెనేని (దేహభావము స్ఫురింపనియెడల) బ్రహ్మమే తానై యుండును. కనుక విద్వాంసుఁడు (ముముక్షువు) దేహాభిమానరహితుఁడై సర్వదా నిర్వికల్పసమాధిస్థితుఁడై బ్రహ్మస్వరూపమున నుండవలెను.

అవ. పూర్వోక్త నిర్వికల్పసమాధివలనఁ గలుగుఫలమును దృష్టాంతపూర్వకముగ విశదీకరించుచున్నారు:—

సతి సక్తో నరో యాతి సద్భావం హ్యేకనిష్ఠయా,
కీటకో భ్రమరం ధ్యాయన్భ్రమరత్వాయ కల్పతే. 359

తా. కీటకము తుమ్మెదవలని భయముచేత సర్వదా భ్రమరమునే ధ్యానించుచు తానును భ్రమరమే యగును. ఆప్రకారమే యేకనిష్ఠతో సర్వదా బ్రహ్మమునందే లక్ష్యము నుంచి, బ్రహ్మమునే ధ్యానించుచుండుపురుషుఁడు తానును బ్రహ్మమే యగును.

క్రియాన్తరాసక్తిమపాస్య కీటకో
ధ్యాయన్యథాలిం హ్యలిభావమృచ్ఛతి,
తథైవ యోగీ పరమాత్మతత్త్వం
ధ్యాత్వా సమాయాతి తదేకనిష్ఠయా. 360

తా. కీటకము ఇతరక్రియాసక్తిలేక సదా భ్రమరమునే ధ్యానించుచుండుటవలన తానును భ్రమరమే యగును. ఆవిధముననే క్రియాంతరాసక్తిలేక తదేకనిష్ఠతో పరమాత్మతత్త్వమునే ధ్యానించుచుండు యోగి తానును బ్రహ్మమే యగును.

అతీవ సూక్ష్మం పరమాత్మతత్త్వం
న స్థూలదృష్ట్యా ప్రతిపత్తుమర్హతి,
సమాధినాత్యన్తసుసూక్ష్మవృత్త్యా
జ్ఞాతవ్యమార్యైరతిశుద్ధబుద్ధిభిః. 361

తా. ఆపరమాత్మతత్త్వము (ప్రత్యగభిన్నబ్రహ్మస్వరూపము) అత్యంతసూక్ష్మమైనది కాని, "యతో వాచో నివర్తన్తే

అప్రాప్య మనసా సహ," "న చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో
మనః," "న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్," ఇత్యాది శ్రుతిస్మృతి
ప్రమాణవాక్యరీత్యా, ఆతత్త్వము స్థూలదృష్టిచే అనఁగా,
తర్కశాస్త్రాదులచే ననుమానాది ప్రమాణమువల్లఁ దెలిసి
కొనుటకు సాధ్యము కాదు. చిత్తవృత్తినిరోధరూపసమాధివలన
నుత్పన్న మగు నత్యంతసూక్ష్మవృత్తివలన మిక్కిలి నిర్మలబుద్ధిగల
మహనీయులకుమాత్రమే గోచరింపఁగలదు.

యథా సువర్ణం పుటపాకశోధితం
త్యక్త్వా మలం స్వాత్మగుణం సమృచ్ఛతి,
తథా మనః సత్త్వరజస్తమోమలం
ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్. 362

తా. పుటపాకమువలన శోధింపఁబడిన సువర్ణము ఎట్లు
మలరహితమై దానిస్వాభావికనిర్మలగుణమును బొందుచున్నదో
ఆప్రకారమే సత్త్వరజస్తమోగుణ మలయుక్తమయిన మనస్సు
నిరంతరాత్మధ్యానమువలన పరిశుద్ధమై (సకలమలరహితమై)
యథార్థ (ఆత్మ) స్వరూపమును బొందును.

వి. మనస్సున రాగద్వేషములు లేకుండుటయే నైర్మ
ల్యము (మనశ్శుద్ధి).

నిరన్తరాభ్యాసవశాత్తదిత్థం
పక్వం మనో బ్రహ్మణి లీయతే యదా,
తదా సమాధిః స వికల్పవర్జితః
స్వతోఽద్వయానన్దరసానుభావకః. 363

తా. నిరంతరాభ్యాసవశమున నీప్రకారము పరిపక్వ
మయిన మనస్సు ఎపుడు బ్రహ్మమునందు లయ మగునో (తాదా

త్మ్యను బొందునో) యపుడు సమాధి నిర్వికల్పక మగును. ఆనిర్వి
కల్పసమాధివలన అద్వయానందరసానుభవము స్వయముగనే
(తనంతట) సిద్ధించును.

సమాధినానేన సమస్తవాసనా
　　గ్రన్థేర్వినాశోఽఖిలకర్మనాశః,
అన్తర్బహిః సర్వత ఏవ సర్వదా
　　స్వరూపవిస్ఫూర్తిరయత్నతః స్యాత్. 364

తా. ఈచెప్పఁబడిన నిర్వికల్పకసమాధివలన శుద్ధాశుద్ధ
వాసనారూపతాదాత్మ్యగ్రంథి నశించును. వాసనాక్షయము
కాఁగా వాసనాకార్యభూతము లగు సమస్తకర్మలు నశించును.
కర్మక్షయము కాఁగా బాహ్యాభ్యంతరములందు సర్వదా సర్వత్ర
అప్రయత్నముగనే స్వస్వరూపము (బ్రహ్మస్వరూపము)స్ఫురించు
చుండును.

శ్రుతేః శతగుణం విద్యాన్మననం మననాదపి,
నిదిధ్యాసం లక్షగుణమనన్తం నిర్వికల్పకమ్. 365

తా. కర్మత్యాగానంతరము గురుముఖమున వేదాంత
వాక్యశ్రవణము ఉత్తమము. శ్రవణముకంటె మననము నూఱు
రెట్లధికఫలము నిచ్చును. మననముకంటె నిదిధ్యాసనము లక్ష
మడుంగు లధికఫల మిచ్చును. నిదిధ్యాసనముకంటె నిర్వికల్పక
సమాధి అనంతఫలము నొసంగును. "ప్రథమం శ్రవణం కృత్వా
ద్వితీయే మననం తథా, నిదిధ్యాసనకం పశ్చాత్సాక్షాత్కార
స్తదా భవేత్" అని శ్రీకపిలమహర్షి వాక్యము. కనుక నిర్వికల్పక
సమాధివలననే బ్రహ్మసాక్షాత్కార మగును.

నిర్వికల్పకసమాధినా స్ఫుటం
　　బ్రహ్మతత్త్వమవగమ్యతే ధ్రువమ్,
నాన్యథా చలతయా మనోగతేః
　　ప్రత్యయాన్తరవిమిశ్రితం భవేత్. 366

తా. నిర్వికల్పక సమాధివలన బ్రహ్మతత్త్వము నిశ్చయముగను స్పష్టముగను స్ఫురించును. నిర్వికల్పకసమాధి సిద్ధింపనియెడల మనస్సు చంచల మయిన దగుటచే బాహ్యవస్తు (అనాత్మవస్తు) చింతన గలిగియుండును గనుక బ్రహ్మానందస్ఫూర్తి కలుగదు.

అతః సమాధత్స్వ యతేన్ద్రియః సదా
　　నిరన్తరం శాన్తమనాః ప్రతీచి,
విధ్వంసయ ధ్వాన్తమనాద్యవిద్యయా
　　కృతం సదేకత్వవిలోకనేన. 367

తా. కావున ఇంద్రియములను వశపరచుకొని సదా విరామములేకుండ, శాంతచిత్తముతో సమాధిస్థితుఁడవై ప్రత్యగాత్మయందే మనస్సును నిల్పి, అనాది యగు నవిద్యచేఁ గల్పింపఁబడిన అజ్ఞానాంధకారమును అద్వితీయబ్రహ్మలక్ష్యముచే నిర్మూలింపుము.

అవ. జీవన్ముక్తికి నుపయోగ మగు చిత్తనిరోధరూపరాజయోగసాధనములను వివరించుచున్నారు:—

యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః,
నిరాశా చ నిరీహా చ నిత్యమేకాన్తశీలతా. 368

తా. వాఙ్నిరోధము(మౌనము), అపరిగ్రహము(ధనము నంటకుండుట), విషయవాంఛ (ఆశ) లేకుండుట, (పుత్రేషణ విత్తేషణ లోకేషణ లనెడి) ఈషణములు లేకుండుట, ఎల్లప్పుడును ఏకాంతవాసమం దాసక్తి యునునివి యోగమునకు ప్రథమ సాధనములు.

అవ. ఇఁకను ఏకాంతవాసము మొదలు బ్రహ్మానంద రసానుభవమువఱకు నుండవలసిన సాధనక్రమమును జెప్పుచున్నారు:—

ఏకాన్తస్థితిరిన్ద్రియోపరమణే హేతుర్దమశ్చేతసః
సంరోధే కరణం శమేన విలయం యాయాదహంవాసనా,
తేనానన్దరసానుభూతిరచలా బ్రాహ్మీ సదా యోగిన
స్తస్మాచ్చిత్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నాన్మునేః. 369

తా. ఏకాంతవాసము ఇంద్రియోపరమతారూపదమము నకు హేతు వగును. ఇంద్రియనిరోధరూప మగు నాదమము చిత్త నిరోధరూపశమమునకు హేతు వగును. శమమువలన (దేహేంద్రియాదికమందుఁగల ఆత్మబుద్ధి యనెడి) అహంవాసన విలయ మగును. ఆ అహంవాసనావిలయమువలన యోగికి సంతతా ఖండానందరసానుభవము కలుగును. కావున మునికి సర్వ ప్రయత్నములచేతను ఎల్లప్పుడు చిత్తనిరోధమే కర్తవ్యము.

వి. "ఆదావంతే చ మధ్యే చ జనో యస్మిన్న విద్యతే, యేనేదం సకలం వ్యాప్తం స దేశో విజనః స్మృతః" అని అనుభూతి ప్రకాశికయందుఁ జెప్పఁబడినది.

వాచం నియచ్ఛాత్మని తం నియచ్ఛ
బుద్ధౌ ధియం యచ్ఛ చ బుద్ధిసాక్షిణి,

తం చాపి పూర్ణాత్మని నిర్వికల్పే
విలాప్య శాన్తిం పరమాం భజస్వ. 370

తా. వాక్కును (జ్ఞానేంద్రియకర్మేంద్రియములను) మనస్సునందు లయింపఁజేయుము. మనస్సును బుద్ధియందు లయింపుము. బుద్ధిని బుద్ధిసాక్షి యగు జీవాత్మయందు లీనము చేయుము. జీవాత్మను పరమాత్మయందు లయింపఁజేసి పరమ శాంతినిఁ బొందుము. ఇచట "యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛే జ్ఞాన ఆత్మని, జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని" అను కఠ శ్రుతి ప్రమాణము.

దేహప్రాణేన్ద్రియమనోబుద్ధ్యాదిభిరుపాధిభిః,
యైర్యైర్వృత్తేః సమాయోగ స్తత్తద్భావోఽస్య యోగినః.
తన్నివృత్త్యా మునేః సమ్యక్సర్వోపరమణం సుఖమ్,
సందృశ్యతే సదానన్దరసానుభవవిప్లవః. 372

తా. దేహము ప్రాణములు ఇంద్రియములు మనస్సు బుద్ధి మొదలగు నుపాధులలో దేనియందు చిత్తవృత్తి వ్యాపించుచుండునో, యోగికి ఆయాయుపాధిసంబంధ మగుభావము కలుగుచుండును. ఆదేహప్రాణాద్యుపాధులనుండి చిత్తవృత్తులు నిరోధింపఁబడెనేని బాహ్యాభ్యంతరవిషయములు స్ఫురింపక వైరాగ్యసుఖము కలుగును. అందువలన నుత్కృష్టమగు నఖండ సచ్చిదానందరసము ప్రవాహరూపముగ ననుభవింపఁబడును.

అన్తస్త్యాగో బహిస్త్యాగో విరక్తస్యైవ యుజ్యతే,
త్యజత్యన్తర్బహిఃసంగం విరక్తస్తు ముముక్షయా. 373

తా. అనిత్యములగు ప్రాపంచికవిషయములందు విరక్తి గలవాఁడే బాహ్యాభ్యంతరములందు విషతుల్యములగు విషయములను స్మరింపకుండ నుండఁగలఁడు. కనుక పరిపూర్ణవైరాగ్యము గలపురుషుఁడే మోక్షాసక్తుఁడై బాహ్యాభ్యంతరసంగమును విడువఁగలఁడు.

బహిస్తు విషయైః సంగః తథాన్తరహమాదిభిః,
విరక్త ఏవ శక్నోతి త్యక్తుం బ్రహ్మణి నిష్ఠితః. 374

తా. పూర్ణవైరాగ్యము గల బ్రహ్మ నిష్ఠాపరుఁడే బాహ్యమందు శబ్దరూపరసాదులతో సంగమును, చిత్తమందు అహంకారమమకారాదితాదాత్మ్యభావమును విడువ సమర్థుఁ డగును.

వైరాగ్యబోధౌ పురుషస్య పక్షివత్
పక్షౌ విజానీహి విచక్షణ త్వమ్,
విముక్తిసౌధాగ్రలతాధిరోహణం
తాభ్యాం వినా నాన్యతరేణ సిద్ధ్యతి. 375

తా. ఓయి బుద్ధిమంతుఁడా! ఆకాశమున కెగురుటకు పక్షికి రెండు రెక్క లెట్లాధారమో, యటుల మోక్షసౌధాగ్రమును జేరుటకు పురుషునకు విషయవైరాగ్యము ఆత్మజ్ఞానము నను రెండును ఆధారములు. పక్షికి నొకరెక్క లోపించినయెడల నది యె ట్లెగురలేదో, అట్లే యీజ్ఞానవైరాగ్యములలో నెద్ది లోపించినను మోక్షము సిద్ధింపదు.

అత్యన్తవైరాగ్యవతః సమాధిః
సమాహితస్యైవ దృఢప్రబోధః,

ప్రబుద్ధతత్త్వ స్యహి బన్ధముక్తి
ర్ముక్తాత్మనో నిత్యసుఖానుభూతిః. 376

తా. దృఢవైరాగ్యము గలవానికే నిదిధ్యాసనము, లేక నిర్వికల్పకసమాధి స్థిర మగును. అట్టివానికే సంశయరహితముగ దృఢబోధ కలుగును. అట్లు దృఢబోధ గలిగినవానికే కర్తృత్వాది (సంసార) బంధనివృత్తిరూప మోక్షప్రాప్తి యగును. అట్టి ముక్తాత్మునకే నిత్యాఖండానందస్ఫూర్తి కలుగును.

అ. బోధవిశిష్టమగు వైరాగ్యముగలవానికే స్వారాజ్య సామ్రాజ్యము కలుగునని:—

వైరాగ్యాన్న పరం సుఖస్య జనకం పశ్యామి వశ్యాత్మన
స్తచ్చేచ్ఛుద్ధతరాత్మబోధసహితం స్వారాజ్య సామ్రాజ్యధుక్
ఏతద్ద్వారమజస్రముక్తియువతేర్యస్మాత్త్వమస్మాత్పరం
సర్వత్రాస్పృహయా సదాత్మని సదా ప్రజ్ఞాం కురు శ్రేయసే.

తా. వత్సా! జితేంద్రియుఁడగు యోగికి వైరాగ్యము కంటె సుఖజనక మగునది యితర మెద్దియును లేదు. ఆవైరాగ్యము నిర్మలాత్మబోధతోఁగూడిన దేని నిరతిశయానందము (ఆత్మసామ్రాజ్యసుఖము) నొసఁగూర్చును. ఇట్టిదశ ముక్తికాంతాగారమునకు ద్వారము. కాఁబట్టి నీవు మోక్షముదక్క నితర స్పృహ లేకుండ నిరంతరము నిరంతరాయముగ సచ్చిదానందాత్మానుసంధానపరుఁడవై యుండుము.

ఆశాం ఛిన్ధి విషోపమేషు
విషయేష్వేషైవ మృత్యోః సృతి

స్త్యక్త్వా జాతికులాశ్రమేష్వ
భిమతిం ముఞ్చాఖిలాః క్రియాః,
దేహాదావసతి త్యజాత్మ
ధిషణాం ప్రజ్ఞాం కురుష్వాత్మని
త్వం ద్రష్టాస్యమలోఽసి నిర్ద్వ
యపరం బ్రహ్మాసి యద్వస్తుతః. 378

తా. శిష్యా! విషతుల్యము లగువిషయములం దాశను ద్రుంచుము. (విడువుము) ఆయాశయె జీవునకు మృత్యు వగును. అనఁగా బ్రహ్మరూపస్థితికి విరోధి యగును. జాతికులాశ్రమములం దభిమానమునున్ను, జాతికులాదులతో సంబంధించిన సమస్త కర్మలనున్ను దూరముగ తొలగింపుము. నశ్వరములగు దేహాదులందు ఆత్మబుద్ధిని విడువుము. వస్తుతః (వాస్తవముగ) నీ వీదృశ్యవస్తువములాయమునకు ద్రష్టవు, అనఁగా వానిని ప్రకాశింపఁజేయువాఁడవు, సకలమలరహితుఁడవును అగు అద్వయపరబ్రహ్మమవు. కనుక దేహవాసనను విడిచి సర్వదా ప్రత్యగాత్మయందే స్థిరచిత్తుఁడవై యుండుము.

అవ. ప్రారబ్ధాధీనమగు దేహస్థితి నుపేక్షించి నిరంతరము బ్రహ్మానందానుభవస్థితి నుండు విధానమును జెప్పుచున్నారు:-

లక్ష్యే బ్రహ్మణిమానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేన్ద్రియం
స్వస్థానే వినివేశ్య నిశ్చలతనుశ్చోపేక్ష్య దేహస్థితిమ్,
బ్రహ్మాత్మైక్యముపేత్య తన్మయతయా చాఖణ్డవృత్త్యానిశం
బ్రహ్మానన్దరసం పిబాత్మనిముదా శూన్యైః కిమన్యైర్భ్రమైః.

తా. నీమనోలక్ష్యమును సర్వదా బ్రహ్మమునందే దృఢతరముగ నిలిపి, శ్రోత్రాదిబాహ్యేంద్రియములు వెలుపలికిఁ

బోకుండ వానివాని స్వస్థానములయందే ప్రవేశపెట్టి, అనఁగా బాహ్యవిషయములమీఁదికిఁబోకుండ వాని నరికట్టి, శరీరమును కదలకుండఁ జేసి, దేహధారణవిషయమై (అది ప్రారబ్ధానుసారముగ జరుగుఁగాక యని) యుపేక్షించి, జీవబ్రహ్మైక్యమును బొంది, అనఁగా జీవాత్మను ప్రత్యగాత్మయందు లయింపఁజేసి, తన్మయుఁడవై, నిరంతరాఖండాకారవృత్తితో బ్రహ్మానందరసమును ప్రీతితో నాస్వాదింపుము. శూన్యపదార్థములందు (దేహాదినశ్వర ప్రపంచమందు) భ్రమ చెందకుము.

వి. ప్రత్యగాత్మపదమునకు వాచ్యార్థము జీవుఁడు, లక్ష్యార్థము కూటస్థుఁడు.

అనాత్మచిన్తనం త్యక్త్వా కశ్మలం దుఃఖకారణమ్,
చిన్తయాత్మానమానన్దరూపం యన్ముక్తికారణమ్. 380

తా. పాపజనకమును దుఃఖప్రదమును నగు అనాత్మ (బాహ్యవిషయ)చింతనమును విడిచి, మోక్షహేతువును ఆనందస్వరూపమును నగు ఆత్మనే సదా చింతింపుము.

ఏష స్వయంజ్యోతిరశేషసాక్షీ
విజ్ఞానకోశే విలసత్యజస్రమ్,
లక్ష్యం విధాయైనమసద్విలక్షణ
మఖణ్డవృత్త్యాత్మతయానుభావయ. 381

తా. స్వయం ప్రకాశస్వరూపుఁడును, సర్వసాక్షియు, అసద్వస్తువిలక్షణుఁడును నగు ఆత్మ విజ్ఞానమయ కోశమందు నిరంతరము (కార్యకారణప్రకాశకుఁడై) విలసిల్లుచుండును.

శిష్యా ! ఆపరమాత్మయందె లక్ష్యమును నిలిపి, ఆపరమాత్మవై స్వస్వరూపముగ నఖండాకారవృత్తితో ననుభవింపుము.

ఏతమచ్ఛిన్నయా వృత్త్యా ప్రత్యయాన్తరశూన్యయా,
ఉల్లేఖయన్విజానీయాత్స్వస్వరూపతయా స్ఫుటమ్. 382

తా. అట్టి యఖండాకారవృత్తితో వృత్త్యంతరశూన్యముగ (బాహ్యవస్తుప్రతీతిలేకుండ) నాపరమాత్మయే స్వస్వరూపమని స్ఫుటముగ తెలిసికొనవలెను.

అత్రాత్మత్వం దృఢీకుర్వన్నహమాదిషు సంత్యజన్,
ఉదాసీనతయా తేషు తిష్ఠేద్ఘటపటాదివత్. 383

తా. ఆప్రకారము స్వస్వరూపలక్ష్యమును దృఢపఱుచుకొని, అహంకారాది సమస్తపదార్థములును ఘటపటాదులవలె ననిత్యములుగా నెంచి వానియం దాత్మబుద్ధిని విడిచి, ఉదాసీనుఁడవై స్థిరచిత్తముతో నుండుము.

విశుద్ధమన్తఃకరణం స్వరూపే
నివేశ్య సాక్షిణ్యవబోధమాత్రే,
శనైః శనైర్నిశ్చలతాముపానయ
న్పూర్ణత్వమేవాను విలోకయేత్తతః. 384

తా. నిర్మలాంతఃకరణమును స్వరూపమందు (ప్రత్యగాత్మయందు) లయింపఁజేసి, క్రమక్రమముగ నిశ్చలతనొంది, సర్వసాక్షియు బోధమాత్రము నగు పరిపూర్ణబ్రహ్మము నే విలోకింపవలెను. (అనుభవింపవలెను.)

దేహేన్ద్రియప్రాణమనోఽహమాదిభిః
స్వాజ్ఞానక్లృప్తైరఖిలైరుపాధిభిః,

విముక్తమాత్మానమఖణ్డరూపం
పూర్ణం మహాకాశమివావలోకయేత్. 385

తా. స్వాశ్రయాజ్ఞానకల్పితములగు దేహము, ఇంద్రియములు, మనస్సు, అహంకారము మొదలగు సమష్టిసంఘాతరూప సర్వోపాధులతో, (స్థూలసూక్ష్మకారణశరీరములతో) సంబంధము లేక సర్వపరిపూర్ణమై మహాకాశమువలె నుండు పరమాత్మను అవలోకింపవలెను (అనుభవింపవలెను). "యథా పూర్ణమివాకాశం భవత్యేకేన సర్వదా, శూన్యం యస్య జనాకీర్ణం తం దేవా బ్రాహ్మణం విదుః." ఇతి శ్రుతిః.

ఘటకలశకుసూలసూచి ముఖ్యై
ర్గగనముపాధిశతైర్విముక్తమేకమ్,
భవతి న వివిధం తథైవ శుద్ధం
పరమహమాదివిముక్తమేకమేవ. 386

తా. ఘటము, కలశము, కుసూలము (పాణక), సూది మొదలగునవి యంతస్థూలసూక్ష్మరూపములుగఁ దోఁచినను,ఆకాశము నానాత్వమును బొందక యేకమై యుండునట్లు పరిశుద్ధాత్మ అహంకారాదులకు విలక్షణమై ఏకమై పూర్ణమై యున్నది.

బ్రహ్మాదిస్తంబపర్యన్తా మృషామాత్రా ఉపాధయః,
తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనా స్థితమ్. 387

తా. బ్రహ్మ మొదలు గడ్డిపోఁచవఱకుఁగల సకలోపాధులును(కల్పితమాత్రములే కనుక) నసత్యములు. కావున స్వాత్మను (ప్రత్యగాత్మను) సర్వపరిపూర్ణమగు నేకాత్మగాఁ గనుఁగొనవలెను.

యత్ర భ్రాన్త్యా కల్పితం తద్వివేకే
తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నమ్,
భ్రాన్తేర్నాశే భాతి దృష్టాహితత్త్వం
రజ్జుస్తద్వద్విశ్వమాత్మస్వరూపమ్. 338

తా. త్రాటినిఁ జూచి యది సర్పమని భ్రమఁ జెందినపుడు, దీపసహాయమున దానియథార్థస్వరూపమును దెలిసికొనఁగా భ్రాంతియు సర్పరూపమును బోయి త్రాడుమాత్ర మేనిలుచును. ఆప్రకారమే ఆత్మయందు భ్రాంతిచేఁదోఁచు విశ్వమును, ఆత్మ స్వరూపమునుగఁ దెలిసికొనఁగా విశ్వమసత్యమై ఆత్మస్వరూప మే యగును.

అవ. సర్వమును సర్వాధిష్ఠాన మగు బ్రహ్మమే యని శ్రుత్యుక్తముగ వివరించుచున్నారు:—

స్వయం బ్రహ్మా స్వయం విష్ణుః స్వయమిన్ద్రః స్వయం శివః,
స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యన్న కించన. 339

తా. బ్రహ్మజ్ఞానము కలిగినమీఁదట, అనఁగా స్వస్వరూప స్థితియందు, బ్రహ్మ విష్ణువు ఇంద్రుఁడు శివుఁడు సర్వప్రపంచము స్వస్వరూపమే (బ్రహ్మమే) యగును. బ్రహ్మేతర మెద్దియు నుండదు. ఇచట "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్ర పాత్, స భూమిం...తిష్ఠతి" అను శ్రుతి ప్రమాణము.

అన్తః స్వయం చాపి బహిః స్వయం చ
స్వయం పురస్తాత్స్వయమేవ పశ్చాత్,
స్వయం హ్యవాచ్యాం స్వయమప్యుదీచ్యాం
తథోపరిష్టాత్స్వయమప్యధస్తాత్. 340

తా. (పిండాండబ్రహ్మాండములయొక్క) లోపలను వెలుపలను దశదిశలను సర్వదా సర్వత్ర ఆత్మయే నిండియున్నది. ఆత్మయే జడదృశ్యప్రపంచవివర్తాధిష్ఠానము. ఆత్మేతరము లేనే లేదు.

తరఙ్గఫేనభ్రమబుద్బుదాది
సర్వం స్వరూపేణ జలం యథా తథా,
చిదేవ దేహాద్యహమన్తమేత
త్సర్వం చిదేవైకరసం విశుద్ధమ్. 391

తా. నీటియందుఁ బొడమిన అలలు నురుగు సుళ్లు బుడగలు మొదలగు సర్వమును స్వరూపముచే భిన్నముగఁ గనుపించినను, అవి యన్నియు జలమే యైనట్లు, దేహము మొదలు అహంకారపర్యంతమును గలసర్వమును అఖండవిశుద్ధచైతన్యస్వరూపమే కాని చైతన్యేతర మెద్దియును లేనే లేదు.

సదేవేదం సర్వం జగదవగతం వాఙ్మనసయోః
సతోఽన్యన్నాస్త్యేవ ప్రకృతిపరసీమ్ని స్థితవతః,
పృథక్కిం మృత్స్నాయాః కలశఘటకుంభాద్యవగతం
వదత్యేష భ్రాన్తస్త్వమహమితి మాయామదిరయా.

తా. వాక్కునకును మనస్సునకును గోచరించు సర్వజగత్తును సద్రూపమే, ప్రకృతిపరసీమయందుఁ (మాయాకల్పిత ప్రపంచమందు) గనుపించువానిలో సద్భిన్న మెద్దియు లేనే లేదు. ఏమనఁగా, ఉపాదాన మగుకారణముకంటె కార్యము భిన్నము కాదుగదా! ఎట్లన? మృత్తికనుండి కల్పింపఁబడిన ఘటకలశాదులు మృత్తుకంటె భిన్నము కానట్లే, మాయ యనెడి

మద్యముచేఁ బ్రమత్తు లయినమూఢులు భ్రాంతిచే నేను నాది అది ఇది యని భేద మెంచినను సర్వాధిష్ఠానాత్మకంటె భిన్న మెద్దియు లేదు.

క్రియాసమభిహారేణ యత్ర నాన్యదితి శ్రుతిః,
బ్రవీతి ద్వైతరాహిత్యం మిథ్యాధ్యాసనివృత్తయే. 393

తా. యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" అనెడిశ్రుతి మిథ్యాధ్యాసనివృత్తికొఱకు ద్వైతరాహిత్యమునే పలుమాఱు బోధించుచున్నది.

ఆకాశవన్నిర్మలనిర్వికల్ప
నిఃసీమనిస్పన్దననిర్వికారమ్,
అన్తర్బహిఃశూన్యమనన్యమద్వయం
స్వయం పరం బ్రహ్మ కిమస్తి బోధ్యమ్. 394

తా. శిష్యా! ఆకాశమువలె నిర్మలము, సంకల్పవికల్పశూన్యము, అనంతము, అక్రియము, నిర్వికారము, బాహ్యాభ్యంతరశూన్యము, అద్వితీయమును అగుపరబ్రహ్మము నీవే. ఇఁకను నీకుఁ దెలియఁదగిన దేమున్నది?

వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవఃస్వయం
బ్రహ్మైతజ్జగదాపరాణు[1] సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః,
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః సంత్యక్తబాహ్యాఃస్ఫుటం
బ్రహ్మీభూయ వసన్తి సంతత[2]చిదానన్దాత్మనైవ ధ్రువమ్. 395

తా. విస్తరించి చెప్పఁదగిన దేమి కలదు? జీవుఁడు స్వయముగ బ్రహ్మమే. "బ్రహ్మైవేదం సర్వమ్" అణువు మొదలు

1. తజ్జగదాతతం ను. 2. చిదానన్దాత్మనైతద్ధ్రువమ్.

సకలప్రపంచము బ్రహ్మమే, "ఏకమేవాద్వితీయం బ్రహ్మ"— బ్రహ్మము ఏకము అద్వితీయము, "ఆత్మైవేదం సర్వమ్" సర్వమును ఆత్మయే, అని శ్రుతులు ఘోషించుచున్నవి. కనుక నీప్రకారము 'అహం బ్రహ్మాస్మి'—(నేనే బ్రహ్మమును) అని ప్రత్యగభిన్నబ్రహ్మజ్ఞానముగల మహాత్ములు బాహ్యవిషయములను స్మరింపక బ్రహ్మీభూతులై, ఎల్లప్పుడు చిదానందరూపముతో వర్తింతురు. ఇది నిశ్చయము.

అవ. మలభూయిష్ఠమగు స్థూలదేహమందును. లింగశరీరమందును అభిమానమును విడిచి బ్రహ్మభావమును పొందవలెనని చెప్పుచున్నారు:—

జహి మలమయకోశేఽహంధియోత్థాపితాశాం
ప్రసభమనిలకల్పే లింగదేహేఽపి పశ్చాత్,
నిగమగదితకీర్తిం నిత్యమానన్దమూర్తిం
స్వయమితి పరిచీయ బ్రహ్మరూపేణ తిష్ఠ. 396

తా. మలభూయిష్ఠ మగుస్థూలదేహమందు అహంబుద్ధిచే గలుగు అభిమానమును విడువుము. పిమ్మట ప్రాణమయమగు లింగశరీరమందును అభిమానమును దొలగింపుము. ఉపనిషత్ప్రతిపాద్యుండును నిత్యానందస్వరూపుడును నగు 'బ్రహ్మమే నేను' అని భావించి, యాబ్రహ్మరూపమున నుండుము.

వి. అమేధ్యపూర్ణే కృమిరాశిసంకులే స్వభావగన్ధేఽప్యశుచౌ ప్రవర్ధివే, కలేవరే మూత్రపురీషభాజనే రమన్తి మూఢా విరమన్తి పణ్డితాః" అర్థము—మలమూత్రములతో నిండి, క్రిమిసముదాయసంకులమై, స్వభావముచేత సహింపరాని దుర్గంధముతోఁగూడి యశుచియై అసద్రూపమగు నీ మూత్రపురీష

భాండమును మూఢులు ప్రేమింతురు గాని జ్ఞానులు ప్రేమింపరు.

శవాకారం యావద్భజతి మనుజస్తావదశుచిః
పరేభ్యః స్యాత్క్లేశో జననమరణవ్యాధి[1]నిరయాః,
యదాత్మానం శుద్ధం కలయతి శివాకారమచలం
తదా తేభ్యో ముక్తో భవతి హి తదాహ శ్రుతిరపి.

తా. మనుజుఁడీశవమువంటి జీవచ్ఛవశరీరము నెంతకాల పర్యంతము ఆత్మబుద్ధితో సేవించుచుండునో, అంతపర్యంతము నపవిత్రుఁడై నానావిధదుఃఖములచేఁ బీడింపఁబడుచు జన్మమృత్యు వ్యాధిరూపమగు దుర్గతినిఁ బొందుచుండును. ఎపుడు శుద్ధమును అచలమును శివస్వరూపమును నగు ఆత్మత్వమును బొందునో, యపుడు జన్మమరణాదిక్లేశములనుండి విముక్తుఁడై కైవల్యమును బొందును. ఇట్లు వేదమాతయు నుడువుచున్నది. బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే; పరస్యాన్తే కృతాత్మానం ప్రవిశన్తి పరం పదమ్" "వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగాద్యతయః శుద్ధసత్వాః, తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే" ఇతి శ్రుతిః.

స్వాత్మన్యారోపితాశేషాభాసవస్తునిరాసతః,
స్వయమేవ పరం బ్రహ్మ పూర్ణమద్వయమక్రియమ్. 398

తా. స్వాత్మయందారోపింపఁబడు ఆభాస(మిథ్యా)వస్తు సముదాయమును నిరాకరించుటవలన, పరిపూర్ణమును అద్వితీయమును అక్రియమును నగు పరబ్రహ్మము తానే యై విలసిల్లును.

---

1 నిలయః.

సమాహితాయాం సతి చిత్తవృత్తౌ
పరాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
న దృశ్యతే కశ్చిదయం వికల్పః
ప్రజల్పమాత్రః పరిశిష్యతే తతః. 399

తా. నిర్వికల్పసమాధియందు చిత్తము పరమాత్మయందు లీనమై యుండునపుడు వికల్పము లెంతమాత్రము గలుగవు. 'వికల్పము' అనెడిమాటమాత్ర ముండును.

అసత్కల్పో వికల్పోఽయం విశ్వమిత్యేకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః. 400

తా. వికారశూన్యమును నిరాకారమును నిర్విశేష (పరిపూర్ణ)మును అగు ఏకవస్తువునందు అజ్ఞానకల్పితమగు ప్రపంచ మిది యనెడి వికల్ప మెటుల గలుగును? (ఎప్పుడును గలుగ దనుట).

ద్రష్టృదర్శనదృశ్యాదిభావశూన్యైకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః. 401

తా. ద్రష్ట దర్శనము దృశ్యము మొదలగు భావమే లేక, నిర్వికారమై నిర్విశేషమగు నేకవస్తువునందు భేద మెటుల గలుగును? కలుగనే కలుగదు.

కల్పార్ణవ ఇవాత్యన్తపరిపూర్ణైకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః. 402

కల్పాంతకాలమహాసముద్రమువలె సర్వపరిపూర్ణమై, త్రివిధపరిచ్ఛేదరహితమై, అద్వితీయమైయుండునిర్వికారనిరాకార

నిర్విశేషవస్తువునందు (పరిపూర్ణైకాత్మయందు) భేద మెక్కడిది?
(భేదమే లే దనుట).

తేజసీవ తమో యత్ర విలీనం భ్రాన్తికారణమ్,
అద్వితీయే పరే తత్త్వే నిర్విశేషే భిదా కుతః. 403

తా. సూర్యుఁడుదయింపఁగా నంధకారము నష్ట మగును. ఆవిధముననే భ్రమకారణము లగుమాయయు బాహ్యవిషయములును పరబ్రహ్మమందు లయము కాఁగా, నట్టి యద్వితీయనిర్విశేషపరమాత్మయందు భేద మెటుల సంభవించును? (ఆత్మేతర వస్తు వెద్దియు స్ఫురింపనపుడు నిర్విశేషాత్మయందు భేదమే లేదని యభిప్రాయము.)

ఏకాత్మకే పరే తత్త్వే భేదవార్తా కథం భవేత్,
సుషుప్తౌ సుఖమాత్రాయాం భేదః కేనావలోకితః. 404

తా. సుఖమాత్ర మగుసుషుప్తియందు భేద మెవనికైన నం గనఁబడినదా? ఆప్రకారమే కేవలసుఖస్వరూపమును ఏకాత్మయు నగు పరతత్త్వమందు భేద వార్తయే కలుఁగదు. అనఁగా బ్రహ్మసాక్షాత్కారము గల యోగికి బ్రహ్మేతర మెద్దియు గోచరింపదని యభిప్రాయము.

న హ్యస్తి విశ్వం పరతత్త్వబోధా
త్సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
కాలత్రయే నాప్యహిరీక్షితో గుణే
న హ్యంబుబిన్దుః మృగతృష్ణికాయామ్. 405

తా. బ్రహ్మజ్ఞానము కలిగినపిమ్మట నిర్వికల్పసచ్చిదానంద పరమాత్మయందు ప్రపంచభ్రాంతి యెప్పటికినిఁ గలుఁగదు.

రజ్జువుయొక్క యథార్థస్వరూపము తెలిసికొనినంతట దాని యందు సర్ప మెప్పటికయినఁ గనఁబడునా? ఎండమావులందు జలబిందు వొకటయిన నుండునా? అనఁగా భ్రాంతివశమున త్రాటియందు సర్పరూపమును, ఎండమావులందు జలరూపమును దోఁచుచున్నవి. ఆభ్రాంతి తొలఁగఁగా సర్పభ్రాంతిగాని జల భ్రాంతిగాని యెప్పటికినిఁ గలుగదు. ఆవిధముననే పర మాత్మయం దజ్ఞానమువలనఁ దోఁచు ప్రపంచభ్రాంతి అజ్ఞానము నశింపఁగా భ్రాంతియు నశించు నని యభిప్రాయము.

మాయామాత్ర మిదం ద్వైతమద్వైతం పరమార్థతః,
ఇతి బ్రూతే శ్రుతిః సాక్షాత్సుషుప్తావనుభూయతే. 406

తా. ద్వైతభ్రాంతి మాయాకల్పితమనియు, అద్వైతమే పరమార్థతత్త్వ మనియు శ్రుతి చెప్పుచున్నది. సుషుప్తియందు అద్వైతముమాత్రమే మిగులునుగద. అటులనే జ్ఞానదృష్టి యందును అద్వైతముమాత్రమే మిగులును. [ఈవిషయమై అనుభవము నిద్రనుండి మేల్కొనినపుడు కలిగిన స్మృతివలననే ఊహింపఁబడుచున్నట్లు వేదాంతపంచదశి, తత్త్వవివేక ప్రకరణ మున ౮.౯ శ్లోకములలో స్పష్టముగ వివరింపఁబడినది.

అనన్యత్వమధిష్ఠానాదారోప్యస్య నిరీక్షితమ్,
పణ్డితై రజ్జుసర్పాదౌ వికల్పో భ్రాన్తిజీవనః. 407

తా. త్రాటియందు సర్పభ్రాంతి అధ్యాసమాత్రమే కనుక ఆరోపితసర్పమున్ను రజ్జువే యగునట్లు, అధిష్ఠానబ్రహ్మమునం దారోపింపఁబడిన ప్రపంచమునయితము బ్రహ్మమే యగును. రజ్జు వునందు సర్పమును, మృగతృష్ణయందు జలమును భ్రాంతిజన్య

ములు. ఇవి తత్త్వబోధకొఱకు పండితులచే దృష్టాంతములుగఁ గల్పింపఁబడినవే కాని యథార్థములు గావు.

చిత్తమూలో వికల్పోఽయం చిత్తాభావే న కశ్చన,
అతశ్చిత్తం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని. 403

తా. చిత్తచంచలతవలన పరమాత్మయందు వికల్పబుద్ధి కలుగును. చిత్తాభావమైనపుడు అనఁగా చిత్తము నిశ్చలమై బ్రహ్మలక్ష్యమందు స్థిరమై యుండునపుడు వికల్పము లెంత మాత్రము గలుగవు. కనుక నిర్వికల్పసమాధిస్థితుఁడవై చిత్తమును సర్వదా ప్రత్యగ్రూపపరమాత్మయందు నిలుపుము. అపుడు వికల్పశూన్యమై కేవల బ్రహ్మతత్త్వమే (గోచరించును) మిగులును.

అవ. మనోలయమందు స్వరూపస్ఫూర్తిలక్షణమును వర్ణించుచున్నారు:—

కిమపి సతతబోధం కేవలానన్దరూపం
నిరుపమమతివేలం నిత్యముక్తం నిరీహమ్,
నిరవధి గగనాభం నిష్కలం నిర్వికల్పం
హృది కలయతి విద్వాన్బ్రహ్మపూర్ణం సమాధౌ.
ప్రకృతివికృతిశూన్యం భావనాతీతభావం
సమరస మసమానం మానసం బన్ధదూరమ్,
నిగమవచనసిద్ధం నిత్యమస్మత్ప్రసిద్ధం
హృది కలయతి విద్వాన్బ్రహ్మపూర్ణం సమాధౌ. 410
అజరమమరమస్తాభాసవస్తుస్వరూపం
స్తిమితసలిలరాశిప్రఖ్యమాఖ్యావిహీనమ్,

శమితగుణవికారం శాశ్వతం శాన్తమేకం
హృది కలయతి విద్వాన్బ్రహ్మపూర్ణం సమాధౌ.

తా. పండితుఁడు (జ్ఞాని) సమాధియందు చిత్తమున పూర్ణబ్రహ్మమునే ధ్యానించుచుండును. ఆబ్రహ్మస్వరూప మెట్టి దనఁగా:—ఇట్టిదని చెప్పనలవి కానిది, అఖండబోధస్వరూపము, దుఃఖమిశ్రము కాని ఆనందస్వరూపము, ఎంతమాత్రమును సాటిలేనిది, సంసారబంధము లేనిది కనుక దేనినిఁ గోరనిది, హద్దు లేనిది, ఆకాశమువలె నిరాకారము, అవయవరహితము, ఇట్టిదా అట్టిదా యని శంకింపఁదగనిది, కార్యకారణాతీతము, ఊహకు అందని సత్తామాత్రము, జాతిగోత్రాదిభేదము లేని నిత్యానంద రూపము, సజాతీయవస్త్వంతరము లేమిచే సాటిలేనిది, నిందా గౌరవములుగాని తూకముగాని కొలతగాని లేనిది, ఉపనిష ద్వాక్యగోచరము, జననమరణాదివికారములు లేనిది, "యుష్మదస్మ త్ప్రత్యయగోచరయోః" అని చెప్పఁబడిన అస్మత్ప్రత్యయ (నే ననెడిశుద్ధజ్ఞాన) రూపము, జరామరణరహితము, కల్పితవస్తు శూన్యముగ వాస్తవమైనది, నిస్తరంగసముద్రమువలె గంభీర మయినది, కల్పితనామము లేనిది, రాజసాదిగుణవికారశూన్యము, కాలత్రయాబాధ్యము, కల్పితవికారరహితవాస్తవరూపము.

*వి. యుష్మత్ప్రత్యయము లనఁగా శబ్దరూపాదివిషయములు, అస్మత్ప్రత్యయ మనఁగా శబ్దాదివిషయములను గ్రహించెడి చిదాత్మ అని తెలియవలెను.

---

* ఈయర్థమే ౪౧౦, ౪౧౧ శ్లోకముల చతుర్థపాదములవను.

సమాహితాన్తఃకరణః స్వరూపే
విలోకయాత్మానమఖణ్డవైభవమ్,
విచ్ఛిన్ధి బన్ధం భవగన్ధగన్ధిలం
యత్నేన పుంస్త్వం సఫలీకురుష్వ. 412

తా. ఓయి శిష్యా! సావధానాంతఃకరణముతో స్వ స్వరూపమును బొంది, అఖండవైభవోపేతమగు పరమాత్మను అవలోకింపుచు, జన్మమరణరూపసంసారవాసనతోఁ గూడినబంధమును ద్రెంచుకొనుము. ఇట్లు జ్ఞానసంపాదనవలన అనేకజన్మార్జిత పుణ్యవశమునఁ బ్రాప్తించిన యీపురుషశరీరమును సఫలముగావించుకొనుము.

సర్వోపాధివినిర్ముక్తం సచ్చిదానన్దమద్వయమ్,
భావయాత్మానమాత్మస్థం న భూయః కల్పసేఽధ్వనే. 413

తా. శిష్యా! ఈప్రకారము ఎట్టి యుపాధిసంబంధమును లేక సచ్చిదానందస్వరూపమై, అద్వితీయమై యొప్పుచు, నీయాత్మయందు సుస్థిరమై యున్న పరబ్రహ్మమును భావింతువేని నీకు జన్మాంతరము కలుగనే కలుగదు, కృతకృత్యుఁడ వగుదువు.

ఛాయేవ పుంసః పరిదృశ్యమాన
మాభాసరూపేణ ఫలానుభూత్యా,
శరీరమారాచ్ఛవవన్నిరస్తం
పునర్న సంధత్త ఇదం మహాత్మా. 414

తా. పురుషునియొక్క నీడవలె నాభాసరూపమునఁ గనఁబడు నీ శరీరముతోఁ గర్మజన్యసుఖాదిఫలముల ననుభవించు

చున్నను, శరీరమును శవమువలె నిరసించుమహాత్ములు మఱల శరీరమును ఆత్మగా భావింపరు.

సతతవిమలబోధానన్దరూపం సమేత్య
త్యజ జడమలరూపోపాధిమేతం సుదూరే,
అథ పునరపి నైవ స్మర్యతాం వాన్తవస్తు
స్మరణవిషయభూతం కల్పతే కుత్సనాయ. 415

తా. శిష్యా! ఎల్లప్పుడును నిర్మలజ్ఞానానందస్వరూపమును బొంది, జడమును మలరూపమును అగు నీశరీరమును దూరముగ వదలివేసి, అనఁగా శరీరాభిమానమును బూర్తిగఁ ద్యజించి, కక్కినపదార్థమునువలె దానిని మఱల స్మరింపకుము. స్మరించిన యెడల నది మఱల నిందితకర్మాచరణమునకుఁ గారణ మగును.

అవ. శరీరత్యాగియు కర్మత్యాగియు నగు బ్రహ్మవిద్వరిష్ఠుని లక్షణములను జెప్పుచున్నారు:—

సమూలమేతత్పరిదహ్య వహ్నౌ
సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
తతః స్వయం నిత్యవిశుద్ధబోధా
నన్దాత్మనా తిష్ఠతి విద్వరిష్ఠః. 416

తా. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు (ఆత్మజ్ఞానులలోనుత్తమోత్తముఁడగుయోగి) నిర్వికల్పసత్యాత్మస్వరూపపరబ్రహ్మ మనెడి అగ్నియందు అవిద్యాతత్కార్యరూపప్రపంచమును సమూలముగ వహించి, అనఁగా ప్రాపంచికవాసన లేనివాఁడై, నిత్యనిర్మలజ్ఞానానందస్వరూపుఁడై (పరబ్రహ్మమై) విరాజిల్లును.

1. వి. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానస, 4. సత్త్వాపత్తి, 5. అసంసక్తి, 6. పదార్థాభావిని, 7. తురీయ యనెడిసప్త జ్ఞానభూమికలలో మొదటి మూఁడుభూమికలను దృఢముగ నభ్యసింపఁగానిర్వికల్ప ప్రత్యగభిన్న బ్రహ్మసాక్షాత్కార మగును. అనంతరము నాల్గవభూమిక నభ్యసించి యందు తీర్ణుఁడగు యోగి బ్రహ్మవిదుఁ డనఁబడును. పిమ్మట పంచమభూమిక నభ్యసించు యోగి బ్రహ్మవిద్వరుఁ డనఁబడును. తరువాత షష్ఠభూమిక నభ్యసించు మహనీయుఁడు బ్రహ్మవిద్వరీయుఁ డనఁబడును. అనంతరము సప్తమభూమిక నభ్యసించి యాభూమికయందు ఉండు యోగి బ్రహ్మవిద్వరిష్ఠుఁ డనఁబడును. ఆ వరిష్ఠస్థితియే యీశ్లోకమందు వర్ణింపఁబడినది. (ఈవిషయమై విశేషముగఁ దెలియఁ గోరువారలు, జ్ఞానవాసిష్ఠము, వేదాంతపంచదశి, జీవన్ముక్తిప్రకాశిక యను గ్రంథములఁ జూడఁదగును.)

ప్రారబ్ధసూత్రగ్రథితం శరీరం
　　ప్రయాతు వా తిష్ఠతు గోరివ స్రక్,
న తత్పునః పశ్యతి తత్త్వవేత్తా
　　నన్దాత్మని బ్రహ్మణి లీనవృత్తిః. 417

తా. గోవు తన మెడకుఁ గట్టఁబడిన పూలదండ యుండినను జారిపోయినను గమనింపదు. ఆ ప్రకారమే ఆత్మజ్ఞాని ప్రారబ్ధమనెడిసూత్రముచేఁ గట్టఁబడిన (ప్రారబ్ధవశమునఁ గలిగిన) శరీరమున్నను పడిపోయినను గమనింపక, సర్వదా ఆనందస్వరూపమగు బ్రహ్మమునందే లీనమై (బ్రహ్మమేయై) యుండును.

అఖణ్డానన్దమాత్మానం విజ్ఞాయ స్వస్వరూపతః
కిమిచ్ఛన్కస్యవా హేతోర్దేహం పుష్ణాతి తత్త్వవిత్. 418

తా. నిత్యాఖండానందస్వరూపమగు ఆత్మను స్వస్వరూప ముగఁ దెలిసికొనినవానికిఁ గోరఁదగిన దేమున్నది? ఎవనికొఱకు దేహమును బోషింప యత్నించును? అనఁగా, తత్త్వవిదునకు నేవిధమైన కోరికలును శరీరాభిమానమును నుండ వని భావము. "ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్." అనెడి బృహదారణ్యకోప నిషత్ (౪-౪-౧౨) వాక్యము ననుసరించి యీశ్లోకము చెప్పఁ బడినది.

సంసిద్ధస్య ఫలం త్వేతజ్జీవన్ముక్తస్య యోగినః,
బహిరన్తః సదానన్దరసాస్వాదనమాత్మని. 419

తా. యోగసిద్ధి గలిగి జీవన్ముక్తుఁడగు యోగికి (బ్రహ్మవి ద్వరిష్ఠునకని భావము), బాహ్యాభ్యంతరములందు "సర్వంఖల్విదం బ్రహ్మ" యని సర్వదా సచ్చిదానందరసానుభూతియే ఫలము.

అవ. వైరాగ్యము మొదలు పరమశాంతి పర్యంతము సాధ్య సాధనభావమును సూచించుచున్నారు:—

వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలమ్,
స్వానన్దానుభవాచ్ఛాన్తిరేషైవోపరతేః ఫలమ్. 420

తా. సంపూర్ణవైరాగ్యమునకు ఫలము తత్త్వజ్ఞానము. జ్ఞానమునకు ఉపరతి (చిత్తమును సర్వదా బ్రహ్మలక్ష్యమందు నిలుపుట) ఫలము. ఉపరతివలన స్వస్వరూపానుభవద్వారా పరమ శాంతి కలుగును.

అవ. వైరాగ్యాదులలో నెద్ది లోపించినను నిష్ఫలమగు నని చెప్పుచున్నారు:—

యద్యుత్తరోత్తరాభావః పూర్వపూర్వం తు నిష్ఫలమ్,
నివృత్తిః పరమా తృప్తిరానన్దోఽనుపమః స్వతః. 421

తా. వైరాగ్యము గలిగిబోధకలుగనియెడల వైరాగ్యము నిష్ఫల మగును, వైరాగ్యమును, జ్ఞానమును నుండి ఉపరతి లేని యెడల వైరాగ్యజ్ఞానములు నిష్ఫలము లగును. అన్నియు నుండి శాంతి కలుగనియెడల సర్వము నిష్ఫలమే యగును, విషయ వాసనానివృత్తివలన పరమతృప్తి కలుగును. తృప్తివలన అనుప మానందప్రాప్తి యగును.

అవ. అజ్ఞానదశయందు దుష్కార్యములఁ జేసినను జ్ఞాన దశయందు జ్ఞాని అట్టి అవివేకకార్యములఁ జేయఁ డని చెప్పు చున్నారు:—

దృష్టదుఃఖేష్వనుద్వేగో విద్యాయాః ప్రస్తుతం ఫలమ్,
యత్కృతం భ్రాన్తివేళాయాం నానాకర్మ జుగుప్సితమ్,
పశ్చాన్నరో వివేకేన తత్కథం కర్తుమర్హతి. 422

తా. దుఃఖము కలిగినపుడు పామరునివలె దుఃఖాబ్ధిని మునుగకుండ ధైర్యముతో నుండుటయే జ్ఞానము కలిగినందుకు ప్రస్తుతఫలము. జ్ఞానోత్పత్తికి పూర్వము అజ్ఞానవశమున నానా నిషిద్ధకర్మలను జేసినను, వివేకము కలిగినపిమ్మట నట్టి నిందితఃకర్మల జ్ఞాని యెంతమాత్రమును జేయఁజాలఁడు.

విద్యాఫలం స్యాదసతో నివృత్తిః
ప్రవృత్తిరజ్ఞానఫలం తదీక్షితమ్,

తజ్జ్ఞాజ్ఞయోర్యన్మృగతృష్ణికాదౌ
నో చేద్విదాం దృష్టఫలం కిమస్మాత్. 423

తా. అసద్వస్తువునందు (దేహాదిమిథ్యాప్రపంచమందు) నివృత్తికలుగుట జ్ఞానమునకు ఫలము; ప్రవృత్తికలుగుట అజ్ఞానమునకు ఫలము. ఈనివృత్తిప్రవృత్తులు తద్‌జ్ఞులందును అజ్ఞులందును గనఁబడుచున్నవి. ఎట్లన, ఎండమావులను జూచినపుడుజ్ఞానికి జలభ్రాంతి కలుగదు; అజ్ఞానికి జలభ్రాంతి కలుగును. జ్ఞానాజ్ఞానముల తారతమ్యము దెలియుట కింతకంటె నిదర్శన మేమి కావలెను?

అజ్ఞానహృదయగ్రన్థేర్వినాశో యద్యశేషతః,
అనిచ్ఛోర్విషయః కిం ను ప్రవృత్తేః కారణం స్వతః. 424

తా. అజ్ఞానజన్యచిదచిద్గ్రంథి నిశ్శేషముగ నశించినయెడల సర్వైషణాశూన్యుఁడగు విద్వాంసునకు శబ్దాదివిషయములందు (సంసారమందు) ప్రవృత్తి కలుగుటకు కారణమే లేదు.

అవ. పూర్వోక్త వైరాగ్యబోధోపరతుల కవధిని జెప్పుచున్నారు:—

వాసనానుదయో భోగ్యే వైరాగ్యస్య తదావధిః,
అహంభావోదయాభావో బోధస్య పరమావధిః,
లీనవృత్తేరనుత్పత్తిర్మర్యాదోపరతేస్తు సా. 425

తా. భోగ్యవస్తువులం దాసక్తి యెపుడు కలుగకుండునో, యపుడు సంపూర్ణవైరాగ్యము కలిగినదని తెలియనగును. కర్తృత్వాదిరూపాహంకార మెపుడు కలుగకుండునో, యపుడు ఆత్మ

జ్ఞానము కలిగిన దని తెలియఁదగును. బ్రహ్మమునందు లయ భావము కలిగి పునరుత్థాన మెప్పుడు కలుగకుండునో, యప్పుడు ఉపరతి గల దని తెలియ నగును. (తు శబ్దమువలన జీవన్ముక్తునకు వైరాగ్యబోధోపరతులు మూఁడును గలిగియుండు నని సూచింపఁబడుచున్నది.

అవ. వైరాగ్యబోధోపరతులు గలిగియుండు విద్వద్వరీయునిఁ బ్రశంసించుచున్నారు:—

బ్రహ్మాకారతయా సదా స్థితతయా నిర్ముక్తబాహ్యార్థధీ
రన్యావేదితభోగ్యభోగకలనో నిద్రాలువద్బాలవత్,
స్వప్నాలోకితలోకవజ్జగదిదం పశ్యన్క్వచిల్లబ్ధధీ
రాస్తే కశ్చిదనన్తపుణ్యఫలభుగ్ధన్యః స మాన్యో భువి. 426

తా. సర్వకాలసర్వావస్థలందును బ్రహ్మాకారస్థితియం దుండి బాలునివలెను, నితరులచేఁ బ్రేరేపింపఁబడినపుడు మాత్రము బాహ్యవస్తుస్ఫురణ మెంతమాత్రమును లేక నిద్రాలువువలెను, భోగ్యవస్తువులను (ఆహారమును) స్వీకరించుచు నీదృశ్యప్రపంచమును స్వప్నప్రపంచమువలె మిథ్యగాఁ జూచుచు, బ్రహ్మాకారవృత్తితోనుండి అనంతజన్మోపార్జితపుణ్యఫలానుభోగియై, కృతకృత్యుఁడగు నొకానొకమహనీయుఁడు అరిదిగ నుండును. పృథివియం దట్టిమహాత్ముఁడే పూజ్యుఁడు.

వి. ఈశ్లోకమందు జ్ఞానభూమికలలో నాఱవభూమికయందభ్యాసియగు బ్రహ్మవిద్వరీయుఁడు సూచింపఁబడెను (చూ. వి. 416 శ్లోకము). సప్తమభూమికయం దుండు బ్రహ్మవిద్వరిష్ఠునకు నితరులచేఁబ్రేరేపింపఁబడినను పునరుత్థానము కలుగనే కలుగదు.

అయినను బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠు లుభయులును స్థిత ప్రజ్ఞులగుటచే జీవన్ముక్తులే యగుదురు,

అవ. ఇంకను స్థితప్రజ్ఞుఁడగు యోగియొక్క లక్షణములను జెప్పుచున్నారు:—

స్థితప్రజ్ఞో యతిరయం యః సదానన్దమశ్నుతే,
బ్రహ్మణ్యేవ విలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః. 427

తా. ఏపురుషుఁడు సదా బ్రహ్మమునందే చిత్తమును లయింపఁజేసి, ఆనందపరవశత్వముచేత వికారశూన్యుఁడై నిష్క్రియుఁడై యుండునో వాఁడు 'స్థితప్రజ్ఞుఁ' డనఁబడును. ఇచట, "ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్, ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే." అను గీతా వాక్యము ప్రమాణము.

అవ. జీవన్ముక్తుని లక్షణములను ౨౨ శ్లోకములచే వర్ణించుచున్నారు:—

బ్రహ్మాత్మనోః శోధితయోరేకభావావగాహినీ,
నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే,
[1]సా సర్వదా భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే. 428

తా. పూర్వోక్తప్రకారము 'తత్ త్వం' పదార్థశోధన వలనఁ గలిగిన జీవేశ్వరైక్యభావము ప్రవాహరూపముగ నిర్వికల్పమై చిన్మాత్రమై యుండెనేని ఆవృత్తి 'ప్రజ్ఞ' యనఁబడును. ఎవని కీప్రజ్ఞ నిరంతరాయముగ నిరంతరము నిల్చియుండునో వాఁడు జీవన్ముక్తుఁ డనఁబడును.

---

1 సుస్థితా సా భవేద్యస్య స్థితప్రజ్ఞః స ఉచ్యతే.

యస్య స్థితా భవేత్ప్రజ్ఞా యస్యానన్దో నిరంతరః,
ప్రపంచో విస్మృతప్రాయః స జీవన్ముక్త ఇష్యతే. 429

తా. ఎవని కీప్రజ్ఞ సుస్థిరమగునో, అనఁగా స్థితప్రజ్ఞుఁడైన ఎవనికి బ్రహ్మానందము నిరంతరాయముగ సంతతధారగా నుండి ప్రపంచస్మృతి లేకుండునో వాఁడు జీవన్ముక్తుఁ డనఁబడును.

"యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే, యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఇష్యతే." అని వసిష్ఠ వచనము.

లీనధీరపి జాగర్తి యో జాగ్రద్ధర్మవర్జితః,
బోధో నిర్వాసనో యస్య స జీవన్ముక్త ఇష్యతే. 430

తా. జాగ్రద్దశయందును నేపురుషుఁడు జాగ్రద్ధర్మము లగు విక్షేపాదులు లేక చిత్తనిరోధము గలిగి మేల్కొని యుండునో, మఱియు ప్రాపంచికవాసనలు లేకుండ దృఢబోధము గలిగియుండునో వాఁడు జీవన్ముక్తుఁడు.

శాన్తసంసారకలనః కలావానపి నిష్కలః,
[1]యః సచిత్తోఽపి నిశ్చిత్తః స జీవన్ముక్త ఇష్యతే. 431

తా. ఎవఁడు సంసారమున నున్నను అహంకారమమకారములు గలిగియుండఁడో, శాస్త్రపారంగతుఁడయ్యును పాండిత్య ప్రకర్షమువలన దర్పాహంకారములు గలిగియుండఁడో, జాగ్రదవస్థలో చిత్తము గలిగియున్నను సంకల్పవికల్పరూపవృత్తులు గలిగియుండఁడో వాఁడు జీవన్ముక్తుఁడు.

వర్తమానేఽపి దేహేఽస్మింశ్ఛాయావదనువర్తిని,
అహంతామమతాభావో జీవన్ముక్తస్య లక్షణమ్. 432

---

1 యస్య చిత్తం వినిశ్చిన్తం స జీవన్ముక్త ఇష్యతే.

తా. తననీడవలె నంటియుండెడి తనశరీరమందు అహంకారమమకారములు లేకుండుటయే జీవన్ముక్తుని లక్షణము. [ప్రతిమనుజునకు తననీడయందు తా ననెడి యభిమాన ముండదు. ఆ ప్రకారమే ఆత్మజ్ఞానికి జీవచ్ఛరీరమందు అభిమాన మించుకేని యుండ దని భావము].

అతీతాననుసంధానం భవిష్యదవిచారణమ్,
ఔదాసీన్యమపి ప్రాప్తే జీవన్ముక్తస్య లక్షణమ్. 433

తా. కడచినదానిని స్మరింపకుండుట, రాఁబోవువిషయమై విచారింపకుండుట, ప్రాప్తించినదానియందు ఉదాసీనత అనునవి యును జీవన్ముక్తుని లక్షణములు.

గుణదోషవిశిష్టేఽస్మిన్స్వభావేన విలక్షణే,
సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్. 434

తా. ఆత్మ గుణదోషరహిత మయినది. ఈ బహువిధ ప్రపంచము గుణదోషవిశిష్టమగుటచేత ఆత్మకంటె విలక్షణమగు నీప్రపంచమందలి నామరూపముల నుపేక్షించి, అంతటను నిండి యుండెడి చైతన్యమాత్రావలోకనము జీవన్ముక్తునిలక్షణము.

ఇష్టానిష్టార్థసంప్రాప్తౌ సమదర్శితయాత్మని,
ఉభయత్రావికారిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్. 435

తా. లోకములో ఇష్టవస్తువు దొరకినపుడు ప్రీతియు, అనిష్టము గలిగినపుడు దుఃఖమును గలుగుట ప్రసిద్ధము. "సమతా సర్వభావేషు యాసౌ సత్యపరాస్థితిః" అనునట్లు లోక మందంతట సమమగు బ్రహ్మమును మాత్రము సాక్షాత్కరించు

కొనుటచేత, ఇష్టానిష్టప్రాప్తివలన మోదభేదములను జెందక యుండుట జీవన్ముక్తుని లక్షణము.

బ్రహ్మానన్దరసాస్వాదాసక్తచిత్తతయా యతేః,
అన్తర్బహిరవిజ్ఞానం జీవన్ముక్తస్య లక్షణమ్. 436

తా. యతియొక్క చిత్తము సదా బ్రహ్మానందరసానుభవ మగ్నమగుటవలన బాహ్యాభ్యంతరవిషయజ్ఞానము లేని యునికియె జీవన్ముక్తునిలక్షణము.

దేహేన్ద్రియాదౌ కర్తవ్యే మమాయంభావవర్జితః,
ఔదాసీన్యేన యస్తిష్ఠేత్స జీవన్ముక్త ఇష్యతే. 437

తా. దేహేంద్రియాదులందు అహంకారమమకారములను విడిచి తటస్థుఁడగువాఁడే జీవన్ముక్తుఁడు.

విజ్ఞాత ఆత్మనో యస్య బ్రహ్మాభావః శ్రుతేర్బలాత్,
భవబన్ధవినిర్ముక్తః స జీవన్ముక్త ఇష్యతే. 438

తా. ఉపనిషద్వాక్యార్థశ్రవణ మనన నిదిధ్యాసముల వలన నెవనికి బ్రహ్మాభావము తెలియఁబడునో, అట్టి పురుషుఁడు సంసారబంధమునుండి విడువఁబడిన జీవన్ముక్తుఁడు.

దేహేన్ద్రియేష్వహంభావ ఇదంభావస్తదన్యకే,
యస్య నో భవతః క్వాపి స జీవన్ముక్త ఇష్యతే. 439

తా. దేహేంద్రియాదులందు అహంభావమున్ను, శబ్దాద్యన్యవిషయములందు ఇదంభావమున్ను ఎవనికి నెప్పుడును గలుగకుండునో, యాపురుషుఁడు జీవన్ముక్తుఁ డనఁబడును.

న ప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కదాపి బ్రహ్మసర్గయోః,
ప్రజ్ఞయా యో విజానాతి స జీవన్ముక్త ఇష్యతే. 440

తా. ఏపురుషునియొక్క బుద్ధికి కూటస్థాత్మకును, బ్రహ్మమునకును, అట్లే బ్రహ్మమునకును బ్రహ్మమందుఁ గల్పింపఁబడిన ప్రపంచమునకును భేద మెన్నఁడును గోచరింపకుండునో, అనఁగా సర్వము దృఙ్మాత్రమై యితర మెద్దియు గోచరింపకుండునో, వాఁడే జీవన్ముక్తుఁ డనఁబడును.

సాధుభిః పూజ్యమానేఽస్మిన్పీడ్యమానేఽపి దుర్జనైః,
సమభావో భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే. 441

తా. దృశ్యమగుటచేత ఘటాదికమువలె నశ్వరమగు ఈపాంచభౌతికదేహము సజ్జనులచేఁ బూజింపబడుచుండుటచే గర్వింపక, దుష్టులచే నిందింపఁబడుటచే ఖేదపడక, నిందాస్తుతులు దేహమునకే కాని ఆత్మకు లేవనెడి సుజ్ఞానముతో నుపాధుల నుపేక్షించుటచే ఆత్మభావమున సమదృష్టి గలవాఁడు జీవన్ముక్తుఁ డనఁబడును.

అవ. ఇంతదనుక జీవన్ముక్తలక్షణములు చెప్పఁబడినవి. ఇఁకను జీవన్ముక్తుని కర్మఫలవిచారమును జెప్పుచున్నారు:—

యత్ర ప్రవిష్టా విషయాః పరేరితా
నదీప్రవాహా ఇవ వారిరాశౌ,
లీనన్తి సన్మాత్రతయా న విక్రియా
ముత్పాదయన్త్యేవ యతిర్విముక్తః. 442

తా. నదీప్రవాహములు సముద్రమందుఁ జేరి దానియందు లీనమగుటవలన సముద్రమునకు వృద్ధి కలుగదు. ఆప్రకారమే ప్రారబ్ధప్రేరితములగు శబ్దాదివిషయములు జ్ఞానికి కర్తృత్వాది వికారములను గలిగింపక సన్మాత్రముగ వానియందు లీనమగును.

అట్టి నిర్వికారియగు యతియె జీవన్ముక్తుఁడు. ఇచట, "అపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్, తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తిమాప్నోతి న కామకామీ." యనెడి గీతావాక్యము ప్రమాణము.

అవ. కేవలతత్త్వజ్ఞునకును ప్రాతిభాసికతత్త్వజ్ఞునకునుగల తారతమ్యము:—

విజ్ఞాతబ్రహ్మతత్త్వస్య యథాపూర్వం న సంసృతిః,
అస్తి చేన్న స విజ్ఞాతబ్రహ్మభావో బహిర్ముఖః. 443

తా. సంశయవిపర్యయరహితముగ బ్రహ్మతత్త్వము నెఱింగినపురుషుఁడు సంసారమందుండినను మునుపటివలె సంసారబద్ధుఁడు కాఁడు. సంసారప్రేరితుఁ డగునేని యతఁడు బహిర్ముఖుఁడగుటచేత బ్రహ్మజ్ఞానియే కాఁడు. అనఁగా నట్టి సంసారలంపటుఁడగు పురుషుఁడు వాచికజ్ఞాని యగును. వాచికజ్ఞాని యనఁగా, "కుశలో బ్రహ్మవార్తాయాం వృత్తిహీనఃసురాగ్యపి, న స జ్ఞానీ నాఽపి యోగీ కేవలో దుఃఖభాగసౌ," బ్రహ్మతత్త్వమునుగూర్చి పలువిధముల నుపన్యసింపఁగలుగునేకాని స్వయముగ ననుభవశాలి కాఁడు, రాగద్వేషాదులు గలిగియుండును. అట్టివాఁడు దుఃఖభాగియే కాని యోగియుఁ గాఁడు జ్ఞానియుఁ గాఁడు.

అవ. అనంతజన్మోపార్జితవాసనావేగమున జ్ఞానియు హానోపాదేయరూపప్రాతిభాసికసంసారిగా వర్తించు ననెడిశంకకు సమాధానము:—

ప్రాచీనవాసనావేగాదసౌ సంసరతీతి చేత్,
న సదేకత్వవిజ్ఞానాన్మన్దీభవతి వాసనా. 444

తా. జ్ఞానియుఁ బ్రాచీనసంస్కారవశమున నితరునివలెనే సంచరించుచుండునుగదా యనెదవేని (న) అట్లనరాదు. ఏలయన, నతఁడు (జ్ఞాని) కల్పితనామరూపాత్మకమగు జగత్తు మిథ్య యని ఎఱింగి సర్వాధారసద్బ్రహ్మమాత్రముగ నుండుటచేత వాని సంస్కారములు మందగించి వేఁగినగింజలవలె ఫలవంతములు కాఁజాలవు, అనఁగా బాధింపవు. "నిమిషార్ధం న తిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయీం వినా, యథా తిష్ఠన్తి బ్రహ్మాద్యాః సనకాద్యాః శుకాదయః." సనకశుకాదులవలె జ్ఞానియొక్క చిత్తము బ్రహ్మాకార వృత్తిరహితముగ నర్ధనిమిషమయిన నుండదు.

అవ. జ్ఞానికి వాసనలు మందగించు ననుట కొక ప్రసిద్ధ దృష్టాంతమును జెప్పుచున్నారు:—

అత్యన్తకాముకస్యాపి వృత్తిః కుణ్ఠతి మాతరి,
తథైవ బ్రహ్మణి జ్ఞాతే పూర్ణానన్దే మనీషిణః. 445

తా. ఎంతకాముకుఁడైనను వానిచిత్తవృత్తి తల్లిముందర క్షీణించునట్లు, అఖండానందబ్రహ్మవిజ్ఞానముగల యోగియొక్క చిత్తము దుఃఖభాజనములగు తుచ్ఛసుఖముల నపేక్షింపదు.

అవ. ఆత్మానందానుభవము గలయోగికి బాహ్యవాసన లుండవా? అనుశంకకు సమాధానము:—

నిదిధ్యాసనశీలస్య బాహ్యప్రత్యయ ఈక్ష్యతే,
బ్రవీతి శ్రుతిరేతస్య ప్రారబ్ధం ఫలదర్శనాత్. 446

తా. నిరంతరసమాధినిష్ఠుఁడగు యోగికి నొకానొకపుడు బాహ్యప్రవృత్తి కలుగుచుండును. ప్రారబ్ధము అవశ్య మనుభవింపఁదగినదని శ్రుతి చెప్పుటచేత నాయాభోగానుభవమువలన విరోధ మేమియును లేదు.

సుఖాద్యనుభవో యావత్తావత్ప్రారబ్ధమిష్యతే,
ఫలోదయః క్రియాపూర్వో నిష్క్రియో న హి కుత్రచిత్.

తా. సుఖదుఃఖాద్యనుభవ ముండునంతవఱకు ప్రారబ్ధము నంగీకరింపక తప్పదు. పూర్వము చేసికొనిన కర్మము లేకుండ సుఖదుఃఖానుభవము గలుగదు. ఎవఁడును ఒకప్పుడును ఏపని నైనను మనస్సుచేతనైనను చేయక యుండ లేఁడు.

అవ. ప్రారబ్ధకర్మభోగమువలననె క్షీణించు నని చెప్పఁ బడినది. ఇఁకను సంచితాగామికర్మలనుగూర్చి చెప్పుచున్నారు:—

అహం బ్రహ్మేతి విజ్ఞానాత్కల్పకోటిశతార్జితమ్,
సంచితం విలయం యాతి ప్రబోధాత్స్వప్నకర్మవత్. 448

తా. స్వప్నమందుఁ గల్పితములగు శుభాశుభకర్మలెల్లను మేల్కొనినవెంటనే క్షీణించునట్లు, అజ్ఞానము వదలి 'అహం బ్రహ్మాస్మి' (నేను పరబ్రహ్మమును) అనెడి అపరోక్షజ్ఞానము కలుగఁగనే నూఱుకోట్ల జన్మములనుండి ఆర్జింపఁబడిన సంచితకర్మజాత మంతయు క్షణమాత్రములో నశించును. ఎట్లనఁగా:—

యత్కృతం స్వప్నవేళాయాం పుణ్యం వా పాపముల్బణమ్,
సుప్తోత్థితస్య కిం తత్స్యాత్స్వర్గాయ నరకాయ వా. 449
స్వమసంగముదాసీనం పరిజ్ఞాయ నభో యథా,
న శ్లిష్యతే యతిః కించిత్కదాచిద్భావి కర్మభిః. 450

తా. స్వప్నకాలమందుఁ జేయఁబడిన అశ్వమేధాదిపుణ్య కర్మలవలనఁగాని, గోహత్యాదిపాపకర్మలవలనఁగాని మేల్కొనిన పిమ్మట స్వర్గనరకములు ప్రాప్తించునా? స్వాప్నికకర్మలకు కర్తృత్వము లేనందున ప్రబోధము కలుగఁగనే యవి ఫలదాయ

ములు కాఁజాలవు. ఆప్రకారమే జ్ఞాని తాను గగనమువలె సంగరహితుఁడును ఉదాసీనుఁడును అని తెలిసికొనెనేని భావి (ఆగామి) కర్మలతో సంబంధ మెంతమాత్రమును లేక సుఖించును. "బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః, లిప్యతే న స పాపేభ్యః పద్మపత్రమివాంభసా." అని గీతావాక్యము.

అవ. కర్తృత్వాభిమానమే బంధహేతు వని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

న నభో ఘటయోగేన సురాగన్ధేన లిప్యతే,
తథాత్మోపాధియోగేన తద్ధర్మైర్నైవ లిప్యతే. 451

తా. ఆకాశమునకును ఘటమునకును సంబంధము లేదు. ఆకాశము నిర్మలము. ఘటము మలినము. ఈ రెండింటికి సంబంధము లేనందున ఘటసంయోగమువలన ఘటమునందుఁగల మద్యముయొక్క దుర్గంధము గగనము నంటదు. ఇట్లే ఉపాధియగు దేహమునకును పరిశుద్ధాత్మకును సంబంధ మేమియు లేనందున లింగదేహకృతమగు కర్తృత్వము వీడఁగనె ఆత్మ ఆయాపుణ్యపాపఫలమును జెందదు,

అవ. జ్ఞాన ముదయింపఁగా సంచితాగామి కర్మలు రెండును నశించినట్లు ప్రారబ్ధము సయితమేల నశింపదు? అనెడి శంకకు సదృష్టాంతముగ సమాధానమును జెప్పుచున్నారు:—

జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మ జ్ఞానాన్న నశ్యతి,
అదత్త్వా స్వఫలం లక్ష్యముద్దిశ్యోత్సృష్టబాణవత్. 452

తా. తత్త్వజ్ఞానము గలుగకమున్ను ఆరంభింపఁబడిన కర్మము జ్ఞానమువలన నశింపదు. ఎట్లనఁగా గుఱిపెట్టి వదలఁబడిన బాణము లక్ష్యవస్తువును గొట్టక మానదు. అట్లే కర్తృత్వాభిమానముతోఁ బూర్వము చేయఁబడిన కర్మము దానిఫలము నియ్యక మానదు.

అవ. ఈయర్థమునే స్పష్టపర్చుచున్నారు:—

వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ,
న తిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్. 453

తా. మదాంధకారములో దూరముగనున్న జంతువును జూచి యది పులి యనుకొని బాణమును వదలెను. తరువాత ఆజంతువు వ్యాఘ్రము గాక గోవు అని తెలిసికొనినను ఆబాణము వేగముగఁ బోయి లక్ష్యమును (గోవును) గొట్టునే కాని మధ్యను ఆగి పోదు. ఆప్రకారమే ప్రారబ్ధమున్ను కర్మఫలము నవశ్యము నిచ్చును, అని తెలియవలెను.

ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః
సమ్యగ్జ్ఞానహుతాశనేన విలయః ప్రాక్సంచితాగామినామ్,
బ్రహ్మాత్మైక్యమవేక్ష్య తన్మయతయా యే సర్వదాసంస్థితా
స్తేషాంతత్త్రితయం న హి క్వచిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్.

తా. ప్రారబ్ధము బలవత్తరమయినది గనుక విద్వాంసునికైనను అనుభవింపక తప్పదు. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్," "అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభమ్." ఇతి శ్రుతిః. సంచితప్రారబ్ధాగామికర్మలు మూఁడును సమ్యగ్జ్ఞాన

మనెడి అగ్నిచే దహింపఁబడును. "తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే." అని శ్రుతి. ఇటులచెప్పుటలో విరోధ మేమియు లేదు. కారణ మేమి యన? ఆరురుక్షువు (అభ్యాసి) సప్తజ్ఞానభూమికలలో నైదవ భూమికయం దారూఢుఁడగువఱకు నతనికి దేహాద్యధ్యాస ముండును గనుక, అధ్యాసముతోపాటు ప్రారబ్ధమును ఉండును. ౫, ౬, ౭ భూమికలం దభ్యాసము గలిగి ఆరూఢుఁడగుయోగికి దేహాద్యధ్యాసమే యుండక, బ్రహ్మముతో నైక్యమొంది, తన్మయుఁడై సర్వదా నిర్గుణబ్రహ్మస్వరూపుఁడే యైయుండును. కనుక నట్టియోగిని సంచితప్రారబ్ధాగాములు మూఁడును ఎన్నఁడును స్పృశింపఁజాలవు. "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" అని భగవద్వాక్యము.

వి. సంచిత మనఁగా అనేకజన్మాంతరములనుండి పెరిగిన కర్మజాలము.

ప్రారబ్ధ మనఁగా సంచితకర్మమునుండియీజన్మమం దనుభవింపఁబడవలసినకర్మము.

ఆగామి యనఁగా ఈజన్మమందుఁ జేయఁబడి ముందు జన్మములం దనుభవింపఁబడవలసిన కర్మము.

అవ. ఈయర్థమునే వివరించుచున్నారు:—

ఉపాధితాదాత్మ్యవిహీనకేవల
బ్రహ్మాత్మనైవాత్మని తిష్ఠతో మునేః,
ప్రారబ్ధసద్భావకథా న యుక్తా
స్వప్నార్థసంబన్ధకథేవ జాగ్రతః. 455

తా. స్థూలసూక్ష్మకారణదేహోపాధులతో తాదాత్మ్యము నొందక, కేవలబ్రహ్మమాత్రముగ జీవన్ముక్తుఁడై యుండు యోగికి, నిద్రనుండి మేల్కొనినవానికి స్వప్నదృష్టార్థసంబంధము లేనియట్లు, ప్రారబ్ధకర్మఫలసంబంధము సయితము లేదు.

న హి ప్రబుద్ధః ప్రతిభాసదేహే
దేహోపయోగిన్యపి చ ప్రపఞ్చే,
కరోత్యహంతాం మమతామిదంతాం
కిం తు స్వయం తిష్ఠతి జాగరేణ. 456

తా. నిద్రనుండి మేల్కొనినవాఁడు మనఃకల్పితస్వప్నదేహమందు అహంభావమున్ను, స్వప్నకల్పితపదార్థములందు మమకారమున్ను నొందక తాను మాత్రమే శేషించి యుండును. గురుకృపావశమున జీవభ్రాంతిని వదలి కేవలకూటస్థబ్రహ్మమాత్రుఁ డగు యోగికి దేహోపాధియం దహంభావమున్ను, గృహదారసుతాదులందు మమత్వమున్ను గలిగియుండక అద్వితీయుఁడై యానందించును.

న తస్య మిథ్యార్థసమర్థనేచ్ఛా
న సంగ్రహ స్తజ్జగతోఽపి దృష్టః,
తత్రానువృత్తిర్యది చేన్మృషార్థే
న నిద్రయా ముక్త ఇతీష్యతే ధ్రువమ్. 457

తా. మఱియు, మేల్కొనినవానికి స్వప్నకాలమందలి మిథ్యాభూతార్థమును సమర్థించుటయందుగాని, ఆమిథ్యాపదార్థసంగ్రహమందుఁగాని వాంఛ యుండదు. ఆమిథ్యాస్వప్నపదార్థములందు అహంతా మమతలు విడువలేనివాఁడు నిర్ముక్తుఁడు కానివాఁడే యగును.

తద్వత్పరే బ్రహ్మణి వర్తమానః
సదాత్మనా తిష్ఠతి నాన్యదీక్షతే,
స్మృతిర్యథా స్వప్నవిలోకితార్థే
తథా విదః ప్రాశనమోచనాదౌ. 458

తా. ఆవిధముననే సదసద్వివేకము గలిగిన బ్రహ్మనిష్ఠుఁడు ఆత్మేతరములగు అసత్పదార్థముల నీక్షింపఁడు. అట్లు ఆత్మేతరమును గానని వానికి దేహయాత్ర యెట్లు జరుగు నందువేని వినుము. స్వప్నదృష్టపదార్థములను స్మరించునట్లే, జ్ఞాని అనివార్యములగు ఆహారవిసర్గములను జేయుచుండును.

అవ. దేహాభిమానముగలవానికే సంసారముగాని, అసంగాత్మకు కర్మ లేదని చెప్పుచున్నారు:—

కర్మణా నిర్మితో దేహః ప్రారబ్ధం తస్య కల్ప్యతామ్,
నానాదేరాత్మనో యుక్తం నైవాత్మా కర్మనిర్మితః. 459

తా. మనుష్యాదిశరీరము పురాకృతకర్మముచే నిర్మింపఁబడినది, కనుక ప్రారబ్ధము దేహమునకే కల్పింపఁబడినదిగాని, అనాదియగు ఆత్మకు ప్రారబ్ధమను మాటయే తగదు, ఆత్మ కర్మనిర్మితము కాదు.

అవ. ఈయర్థము శ్రుతివిహితమే యని చెప్పుచున్నారు:-

అజో నిత్య ఇతి బ్రూతే శ్రుతిరేషా త్వమోఘవాక్,
తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా. 460

తా. "అజో నిత్యః శాశ్వతః" అనెడి పరమేశ్వరవాక్యరూపమగుశ్రుతి ఆత్మ నిత్యుఁడనియు జననమరణములు లేనివాఁ డనియుఁ జెప్పుచున్నది. కూటస్థాసంగచిన్మాత్రుఁడై ప్రకా

శించెడి యోగికి ప్రారబ్ధకల్పన యెట్లుండును? ఉండదు. ఇచట "న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్, అజో నిత్యః శాశ్వతో౽యం పురాణో న హన్యతే హన్యమానే శరీరే." అనెడి కఠశ్రుతి ప్రమాణము.

ప్రారబ్ధం సిధ్యతి తదా యదా దేహాత్మనా స్థితిః,
దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధం త్యజ్యతామతః,
శరీరస్యాపి ప్రారబ్ధకల్పనా భ్రాన్తిరేవ హి. 461

తా. ఎంతకాలపర్యంతము దేహామే నేననెడి భ్రాంతి యుండునో, అంతపర్యంతము ప్రారబ్ధము నిల్చియుండును. ఆరూఢునకు దేహభ్రాంతియే లేదు గనుక ఆత్మకు ప్రారబ్ధము లేదని నిశ్చయము. శరీరమునకు ప్రారబ్ధకల్పనయు భ్రాంతి మాత్రమే యగును.

అధ్యస్తస్య కుతః సత్త్వమసత్త్వస్య కుతో జనిః,
అజాతస్య కుతో నాశః ప్రారబ్ధమసతః కుతః. 462

తా. కారణ మేమనఁగా, కల్పితశరీరమునకు సత్యరూప మెట్లు సంభవించును? శశశృంగమువలె స్వసత్తాశూన్యమగు శరీరమునకు ఉత్పత్తి యెట్లు? పుట్టనిదానికి నాశ మెట్లు? ఇట్టి శరీరమునకు ప్రారబ్ధ మన నేమి? కావున స్వప్నశరీరమువలెనే జాగ్రచ్ఛరీరమునకు సయితము ఉత్పత్తివినాశములు, ప్రారబ్ధ మును అసత్యము లని తాత్పర్యము. "స్వప్నదేహో యథా౽ధ్యస్తస్తథైవాయం స్వదేహకః, అధ్యస్తస్య కుతో జన్మ జన్మా౽౽భావే హి తత్కుతః." అని శాస్త్రాంతరము.

అవ. సత్యవాదిని యగు శ్రుతి సంచితాగామికర్మద్వయ

మును మాత్రమే చెప్పి యూరకొనక ప్రారబ్ధమును గూడ నేల వచియించె ననెడిశంకకు సమాధానము:—

జ్ఞానేనాజ్ఞానకార్యస్య సమూలస్య లయో యది,
తిష్ఠత్యయం కథం దేహ ఇతి శంకావతో జడాన్,
సమాధాతుం బాహ్యదృష్ట్యా ప్రారబ్ధం వదతి శ్రుతిః, 463
న తు దేహాదిసత్యత్వబోధనాయ విపశ్చితామ్,
యతః శ్రుతేరభిప్రాయః పరమార్థైకగోచరః. 464

తా. జ్ఞానము అజ్ఞానమును, తత్కార్యమును నిర్మూలించు నేని అజ్ఞానకార్య మగు నీదేహ మెట్లు నిలిచియుండును? అని శంకించెడి జడమతులను సమాధానపర్చుటకై శ్రుతిమాత బాహ్యదృష్టితో ప్రారబ్ధము కలదని చెప్పెనేకాని, దేహాదికము సత్యమే యని పండితులకు బోధించుటకు శ్రుతి ప్రవర్తింపలేదు. ఏలయన, పరమార్థమగు అద్వితీయబ్రహ్మమును బోధించుటే శ్రుతియొక్క యభిప్రాయము.

అవ. 441-వ (సాధుభిః అను) శ్లోకము మొదలు ఇంత దనుక జీవన్ముక్తుని కర్మవిషయమై చెప్పఁబడినది. ఇఁకను సప్తశ్లోకములచేత సర్వనిషేధావధిభూతాద్వైతమును బోధించు చున్నారు:—

పరిపూర్ణమనాద్యన్తమప్రమేయమవిక్రియమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 465
సద్ఘనం చిద్ఘనం నిత్యమానన్దఘనమక్రియమ్,
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహ నానాస్తికించన. 466

ప్రత్యగేకరసం పూర్ణమనన్తం సర్వతోముఖమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 467
అహేయమనుపాదేయమనాధేయమనాశ్రయమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 468
నిర్గుణం నిష్కలం సూక్ష్మం నిర్వికల్పం నిరంజనమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 469
అనిరూప్యస్వరూపం యన్మనోవాచామగోచరమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 470
సత్సమృద్ధం స్వతఃసిద్ధం శుద్ధం బుద్ధమనీదృశమ్,
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 471

తా. ఆయద్వితీయబ్రహ్మస్వరూప మెట్టి దనఁగా:—

(దేశకాలవస్తుపరిచ్ఛేదము లేని) సర్వవ్యాపకమయినది, ఆద్యంతములు లేనిది, జననమరణాదివికారములు లేనిది, 465; సర్వదా సద్రూపము, ఏకరసచైతన్యరూపము, త్రికాలాబాధ్యమగు ఆనందస్వరూపము, క్రియారహితము, 466; ప్రత్యగ్రూపము, ఏకరసము, అనంతము, సర్వపరిపూర్ణము, సర్వమునకు అధిష్ఠానము. (ఎట్లనఁగా రజ్జువునందుఁ గల్పింపఁబడిన సర్పము రజ్జుమాత్రమే యైనట్లు, అవిద్యాకల్పిత మగు నామరూపాత్మక జగత్తు "నాధిష్ఠానాద్భిన్నతాఽఽరోపితస్య" యనునట్లు అధిష్ఠానాత్మకంటె వేఱు కాదు గనుక బ్రహ్మమే సర్వాధిష్ఠానము 467; అత్యాజ్యము, అవాచ్యము,అగ్రాహ్యము,తనకు తానే ఆశ్రమమగుటచే నితరాశ్రయము లేనిది. 468; నిర్గుణము, నిరవయవము, ప్రత్యక్షాగోచరము, భావాభావరూపకల్పనారహితము, మాయామలరహితము 469; ఇది యిట్టి దని వాక్కుచే నిరూ

పించుటకును మనస్సుచేఁ దెలియుటకును శక్యముగానిది; 470 స్వసత్తాస్ఫూర్తులచేత జడములగు మనోవాక్కులను బ్రకాశింపఁ జేయునది, స్వతస్సిద్ధమయినది, సర్వకలనారహితమగు జ్ఞానస్వరూపము, ఉపమానరహితము. 471. ఇట్టి బ్రహ్మము ఏకము, అద్వితీయము, పరిపూర్ణమును; నానా భేదవిశిష్టమగు దృశ్యప్రపంచము బ్రహ్మాభిన్నము. బ్రహ్మేతరము లేనే లేదు.

నిరస్తరాగా [1]నిరపాస్తభోగాః
శాన్తాః సుదాన్తా యతయో మహాన్తః,
విజ్ఞాయ తత్త్వం పరమే తదన్తే
ప్రాప్తాః పరాం నిర్వృతిమాత్మయోగాత్. 472

తా. రాగద్వేషములును భోగాసక్తియు లేనిసమాహితచిత్తులును, జితేంద్రియులును, మహానీయులును అగుయోగులీపరతత్త్వమును లెస్సగఁ దెలిసికొని, అనఁగా ఆత్మసాక్షాత్కారమును బొంది, పరమానందభరితు లగుదురు. విదేహముక్తులగుదు రని భావము.

అవ. శ్రీశంకరాచార్యగురువు శిష్యున కుపదేశించుచున్నారు:—

భవానపీదం పరతత్త్వమాత్మనః
స్వరూపమానన్దఘనం విచార్య,
విధూయ మోహం స్వమనః ప్రకల్పితం
ముక్తః కృతార్థో భవతు ప్రబుద్ధః. 473

1 వినిర స్తభోగాః.

తా. వత్సా! నీవును ఆనందఘనస్వరూపమగు ఈపర మాత్మతత్త్వమును లెస్సగ విచారించి, మనఃప్రకల్పితమగుమహా మోహమును (అనఁగా అవిద్యాతత్కార్యపటలమును) విడిచి, కృతకృత్యుఁడవై అవిద్యానిద్రనుండి జ్ఞానరూపజాగ్రదవస్థను బొంది సుఖింపుము.

వి. స్వప్నావస్థయందుఁ దోఁచు సింహశార్దూలాదులవలని భయము మేల్కానినంతనె నశించును. ఆప్రకారమే, అజ్ఞాన మనెడి నిద్రనుండి మేల్కానినంతనే (ఆత్మజ్ఞానము కలుగఁగనే) జన్మమరణాదిరూపసంసారభయము తొలఁగుననిసూచింపఁబడినది.

సమాధినా సాధు వినిశ్చలాత్మనా
పశ్యాత్మతత్త్వం స్ఫుటబోధచక్షుషా,
నిఃసంశయః సమ్యగవేక్షితశ్చే
చ్ఛ్రుతః పదార్థో న పునర్వికల్ప్యతే. 474

తా. శిష్యా! నిర్వికల్పకసమాధియందు ఏకాగ్రచిత్త ముఁతో జ్ఞాననేత్రముచేత ప్రత్యగభిన్నపరమాత్మతత్త్వమును గనుఁగొనుము. సంశయరహితముగ శ్రుతమగు నీయాత్మతత్త్వ మును సాక్షాత్కరించుకొనెదవేని మఱల నీకు సంశయవిపర్య యములు గలుగవు.

స్వస్యావిద్యాబన్ధసంబన్ధమోక్షా
త్సత్యజ్ఞానానన్దరూపాత్మలబ్ధౌ,
శాస్త్రం యుక్తిర్దేశికోక్తిః ప్రమాణం
చాన్తఃసిద్ధా స్వానుభూతిః ప్రమాణమ్. 475

తా. అనాద్యవిద్యాబంధసంబంధము వీడుటవలన సత్య జ్ఞానానందస్వరూపుఁడగును అనుటకు వేదాంతశాస్త్రము, యుక్తి,

సద్గురువాక్యమును బ్రమాణములు. మఱియు నంతఃకరణసిద్ధమగు బ్రహ్మాత్మైక్యరూపస్వానుభవమే ముఖ్యప్రమాణము.

బన్ధో మోక్షశ్చ తృప్తిశ్చ చిన్తారోగ్యక్షుధాదయః,
స్వేనైవ వేద్యా యద్జ్ఞానం పరేషామానుమానికమ్. 476

తా. విచారము, ఆరోగ్యము, ఆఁకలి మొదలగునవి తన చేతనే యెట్లు తెలియఁబడునో ఆప్రకారమే బంధము మోక్షము తృప్తి యనునవి తనకే గోచరింపవలయును. జ్ఞాన మనునది పరులచే నూహింపఁబడును. అంతమాత్రాన ప్రయోజనము లేదు. కావున శ్రద్ధాళువు సద్గురూపదిష్టబ్రహ్మస్వరూపమును మఱవక నిరంతరము తదాకారమున నుండి ఆత్మానందసుఖము ననుభవించుచుండవలెను.

తటస్థితా బోధయన్తి గురవః శ్రుతయో యథా,
ప్రజ్ఞయైవ తరేద్విద్వానీశ్వరానుగృహీతయా. 477

తా. వేదాంతములు బోధించు అర్థమునే గురువులు తటస్థముగ నుపదేశింతురు. పురాకృతసుకృతాతిశయమున జ్ఞానప్రతిబంధకమగు పాతము క్షీణింపఁగా, ఈశ్వరప్రసాదలబ్ధాత్మ్యుత్తమప్రజ్ఞచేతనే తత్త్వజ్ఞుఁడు సంసారసాగరమును దాఁటవలెను. స్వానుభవమునఁగాని తత్త్వము బోధపడదు. ఎట్లనఁగా, బెల్లము మధురముగ నుండునని శాస్త్రమువలనఁ దెలిసికొనినపుడు, ఆబెల్లమును స్వయముగ నాలుకపై వేసికొని చవిగొనినఁగాని దాని మాధుర్యము తెలియదు గద. అట్లే పరతత్త్వమును స్వానుభవవేద్యము.

స్వానుభూత్యా స్వయం జ్ఞాత్వా స్వమాత్మానమఖణ్డితమ్,

సంసిద్ధః సుసుఖం తిష్ఠే న్నిర్వికల్పాత్మనాత్మని. 478

తా. ఆయఖండాత్మస్వరూపము తానె యని స్వానుభవమువలనఁ దెలిసికొని, సమ్యక్తత్వనిష్ఠగలిగి ఏకాగ్రచిత్తముతో నుండవలెను.

వేదాన్త సిద్ధాన్త నిరుక్తిరేషా
 బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ,
అఖణ్డరూపస్థితి రేవ మోక్షో
 బ్రహ్మాద్వితీయే శ్రుతయః ప్రమాణమ్. 479

తా. జీవుఁడును సకలజగత్తును బ్రహ్మమాత్రమే యని వేదాంతసిద్ధాంతవచనము. ఆరోపితము అధిష్ఠానముకంటె భిన్నముకాదు. చిత్రపటమునందు రచియింపఁబడిన నగనగరనదీ వృక్షలతాదిసకలచిత్రములును విమర్శింపఁగా పటము మాత్రమే యగునట్లు, సర్వాధిష్ఠానమగు బ్రహ్మమునందు మాయారచితమగు సర్వప్రపంచమును బ్రహ్మమాత్రమే యగును. దేహాది సకలదృశ్యము నుపేక్షించి సర్వదా అఖండానందస్వరూపస్థితి నుండుటయే మోక్షము; బ్రహ్మ మద్వితీయ మనుటకు "సర్వం హ్యేతద్బ్రహ్మ", "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా, కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ." ఇత్యాదిశ్రుతులు ప్రమాణము.

ఇతి గురువచనాచ్ఛ్రుతిప్రమాణా
 త్పరమవగమ్య సతత్త్వమాత్మయుక్త్యా,
ప్రశమితకరణః సమాహితాత్మా
 క్వచిదచలాకృతిరాత్మనిష్ఠితోఽభూత్. 480

తా. ఉత్తమాధికారియు శ్రద్ధాభక్తి సమన్వితుఁడును అగు శిష్యుఁడు పూర్వోక్తగురుబోధవలనను, వేదాంతప్రమాణ వచనములందు విశ్వాసమువలనను, స్వయుక్తులవలనను పరతత్త్వమును దృఢముగ ననుభవించి. ఇంద్రియములను అంతర్ముఖములుగ మఱలించి, పరతత్త్వమునందే చిత్తమునునిలిపి బాహ్యమును మఱచి, సమాహితచిత్తముతో నచలుఁడై, ఆత్మనిష్ఠుఁడయ్యెను.

అవ. శిష్యుఁడు తన అనుభవమును గురువునకు విన్నవించుచున్నాఁడు:—

కంచిత్కాలం సమాధాయ పరే బ్రహ్మణి మానసమ్,
వ్యుత్థాయ పరమానన్దాదిదం వచనమబ్రవీత్. 481

తా. ఇట్లు సమాధిపరుఁడై చిత్తమును కొంతకాలము ఆత్మయందు లయింపఁజేసి, ఆనందమగ్నుఁడైయుండి, సమాధిస్థితినుండి లేచి పరమానందమున శ్రీగురువుతో నిట్లు తన అనుభవమును విన్నవించెను.

బుద్ధిర్వినష్టా గలితా ప్రవృత్తి
ర్బ్రహ్మాత్మనోరేకతయాధిగత్యా,
ఇదం న జానేఽప్యనిదం న జానే
కిం వా కియద్వా సుఖమస్య పారమ్. 482

తా. ఓగురువరేణ్యా! నావిన్నప మాలింపుఁడు. జీవాత్మపరమాత్మల కైక్యానుసంధానముచేత నాబుద్ధి నష్టమైనది. బాహ్యప్రవృత్తి గళితమైనది. వ్యక్తమగు కార్యముచేఁగాని అవ్యక్తమగు కారణముచేఁగాని నాకు గోచరించుటలేదు. సుఖమెద్దియో దాని సార మెంతో నాకుఁ దెలియుటదు లే.

వాచా వక్తుమశక్యమేవ మనసా మన్తుం న వా శక్యతే
స్వానన్దామృతపూరపూరితపరబ్రహ్మాంబుధే ర్వైభవమ్,
అంభోరాశివిశీర్ణ వార్షికశిలాభావం భజన్మే మనో
యస్యాంశాంశలవే విలీనమధునానన్దాత్మనా నిర్వృతమ్. 483

తా. అఖండానందామృతపూర్ణమగు పరబ్రహ్మమనెడి పారావారముయొక్క వైభవము వాక్కుచేతఁ జెప్పనలవికాదు. మనస్సుచే నూహించుటకు శక్యము కాదు. అనుభవస్వరూపమే యగుటచేత అనుభవింపఁబడునదియును గాదు. (ఇచట, "స్వయమేవానుభూతిత్వాద్విద్యతే నానుభావ్యతా," అనెడి వేదాంత పంచదశిలోని పంచకోశవివేక ప్రకరణ ౧౩-వ శ్లోకము ప్రమాణము) సముద్రమందు పడి కరిగిపోయిన వడగండ్లవలె నామనస్సు ఆత్మానందాబ్ధియందు ప్రవిలీన మయ్యెను. సమాధి నుండి లేచినప్పుడు నాచిత్తము ఆయానందాంశములో అల్పాంశముగ విలీనమై సుఖించెను.

క్వ గతం కేన వా నీతం కుత్ర లీనమిదం జగత్,
అధునైవ మయా దృష్టం నాస్తి కిం మహదద్భుతమ్. 484

తా. ఆసమాధిదశయందు ఈదృశ్యప్రపంచ మెచటికిఁ బోయెను? ఎవనిచే 'తేఁబడెను? ఎచ్చట లీన మయ్యెను? అప్పుడు లేకపోయెనా? ఇపుడే చూడఁబడెనా? ఆహా! ఇది యెంత వింతగా నున్నది!

కిం హేయం కిముపాదేయం కిమన్యత్కిం విలక్షణమ్,
అఖణ్డానన్దపీయూషపూర్ణే బ్రహ్మమహార్ణవే. 485

తా. బ్రహ్మమనెడి యామహాసముద్రము అఖండానందా

మృతప్రపూర్ణమై యుండఁగా నీకను గ్రహింపఁదగినది గాని, విడువఁదగినదిగాని, యితరముగాని, బ్రహ్మవిలక్షణ మైనదిగాని ఎద్దియును లేదు. నామరూపోపాధులను ఉపేక్షింపఁగా సర్వ మును సచ్చిదానందపు బ్రహ్మమే యని భావము.

న కించిదత్ర పశ్యామి న శృణోమి న వేద్మ్యహమ్,
స్వాత్మనైవ సదానన్దరూపేణాస్మి విలక్షణః. 486

తా. ఇపుడు నాకెద్దియుఁ గనఁబడుటలేదు, ఏమియు వినబడుట లేదు, ఏమియుఁ దెలియుటలేదు, సదానందాత్మ రూపముతోనున్న నాకంటె విలక్షణమైన దెద్దియు నాకు స్ఫురిం చుట లేదు.

నమో నమస్తే గురవే మహాత్మనే
విముక్తసఙ్గాయ సదుత్తమాయ,
నిత్యాద్వయానన్దరసస్వరూపిణే
భూమ్నే సదాపారదయాంబుధామ్నే. 487

యత్కటాక్షశశిసాన్ద్రచన్ద్రికా
పాతధూతభవతాపజశ్రమః,
ప్రాప్తవానహమఖండవైభవా
నన్దమాత్మపదమక్షయం క్షణాత్. 488

తా. ఏమహానుభావునికటాక్షమనెడిదట్టమైన చంద్రకిరణ ములయొక్క ప్రసారమువలన సంసారతాపముచేఁ గలిగిన శ్రమ యంతయు క్షణమాత్రమున నివారింపఁబడి, అఖండవైభవానంద మనెడి అక్షయమగు ఆత్మపదమును నేను పొందఁగలిగితినో యట్టి సర్వసంగవినిర్ముక్తుఁడును, పరిశుద్ధుఁడును, నిత్యాద్వయానంద

రసస్వరూపుఁడును, బ్రహ్మస్వరూపుఁడును, సదా అపారదయా సముద్రుఁడును అగు నాగురుమూర్తికి నమస్కారము; నమస్కారము.

ధన్యోఽహంకృతకృత్యోఽహం విముక్తోఽహం భవగ్రహాత్
నిత్యానన్దస్వరూపోఽహం పూర్ణోఽహంత్వదనుగ్రహాత్.

తా. స్వామీ! గురువరా! మీకటాక్షమున నేను ధన్యుఁడనైతిని. (కర్తవ్యాభావరూప) కృత కృత్యతను బొందితిని. సంసారరూపగ్రాహామునుండి విముక్తుఁడ నయితిని. నిరతిశయానందరూపపరబ్రహ్మము నయితిని.

అవ. ఇందులకు ఫలితమగు తన స్వరూపమును శిష్యుఁడు శ్రీగురువునకు విజ్ఞాపించుచున్నాఁడు:—

అసంగోఽహమనంగోఽహమలింగోఽహమభంగురః,
ప్రశాన్తోఽహ[1]మనన్తోహమతాన్తోహం చిరంతనః. 490
అకర్తాహమభోక్తాహమవికారోఽహమక్రియః,
శుద్ధబోధస్వరూపోఽహం కేవలోహం సదాశివః. 491

తా. స్వామీ! నే నద్వితీయుఁడ నగుటచే దేనితోను నాకు సంగము లేదు. నిర్మలబోధస్వరూపుఁడను పరిపూర్ణుఁడను అగు నాకు హస్తపాదాద్యవయవములు లేవుగనుక స్త్రీపురుషాది లింగ (చిహ్న)ములును లేవు. అజుఁడనగ నాకు నాశము లేదు. నిస్తరంగ నీరరాశివలె సంకల్పవికల్పరహితుఁడనైతిని. దేశకాల వస్తుపరిచ్ఛేదములేక అంతటను పరిపూర్ణుఁడ నయితిని. తాపత్రయ రహితముగ ఆనందపరిపూర్ణుఁడనై సనాతనుఁడ నయితిని.

1 అనన్తోఽహమమలోఽహం చిరంతనః.

అక్రియుఁడను గనుక కర్తృత్వభోక్తృత్వాదివికారము లెవ్వియును లేవు. కేవల బోధస్వరూపుఁడను. సదా శివస్వరూపుఁడను.

ద్రష్టుః శ్రోతుర్వక్తుః కర్తుర్భోక్తుర్విభిన్న ఏవాహమ్,
నిత్యనిరన్తరనిష్క్రియనిస్సీమాసంగపూర్ణబోధాత్మా. 492

తా. కూటస్థచిదాత్మనగు నేను ద్రష్టను, శ్రోతను, వక్తను, కర్తను, భోక్తను. ఆద్రష్టృత్వాదిక్రియలకు సాక్షిమాత్రుఁడను. మఱియు నిత్యుఁడను, పరిపూర్ణుఁడను, నిష్క్రియుఁడను, పరిమితి లేనివాఁడను, అసంగుఁడను అగు పూర్ణబోధాత్మను.

వి. బ్రహ్మము సర్వపరిపూర్ణమయ్యును వ్యష్టియందు ఉపాధిపరిగ్రహమువలన ప్రత్యగాత్మ లేక కూటస్థాత్మ యనఁబడును. ఈకూటస్థాత్మ బుద్ధియందు ప్రతిఫలింపఁగా నాప్రతిబింబము చిదాభాసుఁడు లేక జీవుఁడు అనఁబడి, కర్తృత్వాది సాంసారికధర్మములతో సంచరించును. నీటియొక్క చలనమువలన నీటియందు ప్రతిఫలించిన చంద్రబింబముయొక్క చలనము గగనస్థచంద్రునిదే యనుకొనునట్లు, చిదాభాసవిశిష్టబుద్ధిధర్మములు కూటస్థాత్మయందు అజ్ఞానముచేఁ గల్పింపఁబడినను, కూటస్థాత్మ నిర్మలుఁడు నిస్సంగుఁడు నిష్క్రియుఁడు "అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీని చాత్మని, కల్ప్యన్తేఽమ్బుగతే చన్ద్రే చలనాదిర్యథాంభసః." అని ఆత్మబోధయందుఁ జెప్పఁబడినది. శిష్యుఁడీభావమునే వ్యక్తీకరించుచున్నాఁడని యభిప్రాయము. ముందు ౫౧౭-వ శ్లోకమువఱకు శిష్యుఁ డిట్టి భావమునే వ్యక్తీకరించుచున్నాఁ డని తెలియవలెను.

నాహమిదం నాహమదో
　　ఉప్యుభయోరవభాసకం పరం శుద్ధమ్,
బాహ్యాభ్యన్తరశూన్యం
　　పూర్ణం బ్రహ్మాద్వితీయ మేవాహమ్. 493

తా. నేనీ స్థూలప్రపంచమును గాను, సూక్ష్మప్రపంచమును గాను, ఉభయమును బ్రకాశింపఁజేయు చిద్రూపుఁడను. బాహ్యాభ్యంతరరహితమును పరిపూర్ణమును అద్వితీయమును అగు పరబ్రహ్మమునే నేను (అస్మచ్ఛబ్దలక్ష్యచైతన్య మని భావము.)

నిరుపమమనాదితత్త్వంత్వమహమిదమదఇతి కల్పనాదూరమ్,
నిత్యానన్దైకరసం సత్యం బ్రహ్మాద్వితీయ మేవాహమ్. 494

తా. నిరుపమానము, ఆద్యంతరహితము, 'నీవు నేను అది ఇది'యని నిరూపింప శక్యము కానిదియు, నిత్యానందైకరసము, అద్వితీయమును అగు బ్రహ్మము నేనే.

అవ. సకలోపాధులందును గల చైతన్యము నేనే యని శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:—

నారాయణోఽహం నరకాన్తకోఽహం
　　పురాన్తకోఽహం పురుషోఽహమీశః,
అఖణ్డబోధోఽహమశేషసాక్షీ
　　నిరీశ్వరోఽహం నిరహం చ నిర్మమః. 495

తా. క్షీరసాగరశయనుఁడగు నారాయణుఁడను నేనే. నరకాసురుని సంహరించిన శ్రీకృష్ణుఁడను నేనే. త్రిపురాసురులను వధించిన శివుఁడను నేనే. పురాణపురుషుఁడగు ఈశ్వరుఁడను నేనే. ఈసకలోపాధుల బాహ్యాభ్యంతరముల నిండి

యుండు చైతన్యమును నేనే. సమస్తసాక్షి యగుబోధస్వరూపుఁడను గనుక నాకు నియంత వే ఱొకఁడు లేఁడు. నేనే సర్వనియంతను, అయినను నాకు అహంకార మమకారములు లేవు.

అవ. అజ్ఞానావస్థకంటె జ్ఞానావస్థకుఁ గల భేదమును జూపుచున్నాఁడు:—

సర్వేషు భూతేష్వహమేవ సంస్థితో
జ్ఞానాత్మనాన్తర్బహిరాశ్రయః సన్,
భోక్తా చ భోగ్యం స్వయమేవ సర్వం
తద్యత్పృథగ్దృష్టమిదం తయా పురా. 496

తా. సకలప్రాణులందును బాహ్యాంతరముల జ్ఞానరూపమున నిండి యుండి,అజ్ఞానదశయందు ఇది భోక్త, ఇది భోగ్యము నని పృథగ్దృష్టితోఁ జూడఁబడిన సమస్తమును ఆత్మగనే చూచుచున్నారు. అనఁగా నీ విజ్ఞానదశయందు ఆత్మాతిరిక్త మెద్దియు గోచరించుట లేదని యభిప్రాయము.

మయ్యఖణ్డసుఖాంభోధౌ బహుధా విశ్వవీచయః,
ఉత్పద్యన్తే విలీయన్తే మాయామారుతవిభ్రమాత్. 497

తా. అఖండానందాంబుధి నగునాయందుమాయ యనెడి వాయుసంబంధమువలన ననేకములగు జగత్తరంగములు పుట్టుచుఁ గిట్టుచు నున్నవి.

అవ. అద్వితీయాఖండబ్రహ్మమునందు స్థూలసూక్ష్మాది దేహభేదము ఎట్లు కలిగెనో సదృష్టాంతముగఁ జెప్పుచున్నాఁడు:

స్థూలాదిభావా మయి కల్పితా భ్రమా
దారోపితానుస్ఫురణేన లోకైః,

కాలే యథా కల్పకవత్సరాయ
　　నర్త్వాదయో నిష్కలనిర్వికల్పే. 498

తా. "దిక్కాలాత్మసమైవ యస్య విభుతా" అనఁగా, దిక్కు కాలము ఆత్మ ఆకాశము ననునివి అఖండములు, సర్వ వ్యాపకములు నని ప్రసిద్ధము. అవాంతర భేదమును వికల్పమును లేని అఖండకాలమందు అఖండత్వజ్ఞానము లేని జనులచేత బ్రహ్మాదికల్పములు, సంవత్సరములు, అయనములు, ఋతువులు, మాసములు మొదలగు భేదము లెట్లు కల్పింపఁబడినవో అట్లే అనంతాఖండపరమాత్మనగు నాయందు స్థూలసూక్ష్మభేదము గల మిథ్యాపదార్థములు (చరాచరప్రపంచము) అజ్ఞానమూలమగు భ్రాంతిచే నారోపింపఁబడుచున్నవే కాని వాస్తవములు కావు.

అవ. వాస్తవముగాని యీకల్పితభావములు ఆత్మను బాధించునవి కావని సదృష్టాంతముగఁ జెప్పుచున్నాఁడు:—

ఆరోపితం నాశ్రయదూషకం భవే
　　త్కదాపి మూఢైర్మతిదోషదూషితైః,
నార్ద్రీకరోత్యూషరభూమిభాగం
　　మరీచికావారిమహాప్రవాహః. 499

తా. ఎండమావులయందలి జలప్రవాహము ఊషర క్షేత్రమును తడుపఁజాలనియట్లు, బుద్ధిదోషముగల మూఢుల చేతఁగల్పింపఁబడిన ఆరోపితవస్తువు అధిష్ఠానవస్తువును దూషింప నేరదు.

ఆకాశవత్కల్పవిదూరగోఽహ
　　మాదిత్యవద్భాస్యవిలక్షణోఽహమ్,

అహార్యవన్నిత్యవినిశ్చలోఽహ
మంభోధివత్పారవివర్జితోఽహమ్. 500

తా. ఆకాశమువలె నేను అసంగుఁడను. సూర్యుఁడు పర ప్రకాశకుఁడై తనచేఁ బ్రకాశింపఁబడు వస్తువులకంటె విలక్షణుఁ డైనట్లు సకలప్రపంచప్రకాశకుఁడ నగునేను నాచేఁ బ్రకాశింపఁ బడు జగత్తుకంటె విలక్షణుఁడను, పర్వతమువలె నిశ్చలుఁడను, అనఁగా జగత్తు మాయాకల్పితవికారములచే పరిణామమును బొందుచున్నను అట్టి వికారములు మాయాతీతుఁడ నగునాకు లేవు. సముద్రమునకు పారము లేనియట్లు అఖండస్వరూపుఁడ నగు నాకు పారము లేదు. ఈ నాలుగు దృష్టాంతముల వలనను పరమాత్మయొక్క అసంగత్వము, ప్రకాశకత్వము, అక్రియత్వము, అగోచరత్వమును సూచింపఁబడినవి. అసంగత్వ మునకు భగవద్వాక్యప్రమాణము—"యథాసర్వగతంసౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే, సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే."

న మే దేహేన సంబన్ధో మేఘేనేవ విహాయసః,
అతః కుతో మే తద్ధర్మా జాగ్రత్స్వప్నసుషుప్తయః. 501

తా. మేఘముయొక్క రాకపోకలవలన ఆకాశమునకు సంబంధములుగాని, లాభనష్టములుగాని లేనియట్లు, ప్రత్యగాత్మ నగు నాకు జాగ్రత్స్వప్నసుషుప్తులతోఁగాని తద్ధర్మములతోఁగాని సంబంధము లేదు.

ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి
స ఏవ కర్మాణి కరోతి భుఙ్క్తే,

స ఏవ జీవన్మ్రియతే సదాహం
కులాద్రివన్నిశ్చల ఏవ సంస్థితః. 502

తా. కార్యోపాధియగు నీశరీరము వచ్చుచు పోవుచు నుండును. ఇదియే కర్తయై కర్మములను జేయుచు సుఖదుఃఖాది కర్మఫలముల ననుభవించుచుండును. ఇదియే ప్రాణసంబంధము వలన జీవసంజ్ఞ గలిగి (జీవించి) ప్రాణవియోగమువలన మృత్యువును బొందుచుండును. నేనయితే కులగిరులవలె నిశ్చలుఁడను. అనఁగా దేహమునకువలె జన్మమరణములు కర్మము సుఖదుఃఖాదికమును ప్రత్యగాత్మకు లేదని భావము.

న మే ప్రవృత్తిర్న చ మే నివృత్తిః
సదైకరూపస్య నిరంశకస్య,
ఏకాత్మకో యో నిబిడో నిరన్తరో
వ్యోమేవ పూర్ణః స కథం ను చేష్టతే. 503

తా. అవయవములులేని యఖండాకారుఁడ నగు నాకు ప్రవృత్తినివృత్తులు (వ్యాపారమును చేయుట చేయకుండుట) లేవు. ఏలయన, ఏకాత్మనై పరిపూర్ణమై ఆకాశమువలె సర్వవ్యాపకమై యుండునాకు (ఆత్మకు) చేష్ట లెట్లుండును?

పుణ్యాని పాపాని నిరిన్ద్రియస్య
నిశ్చేతసో నిర్వికృతేర్నిరాకృతేః,
కుతో మమాఖణ్డసుఖానుభూతే
ర్బ్రూతే హ్యనన్వాగతమిత్యపి శ్రుతిః. 504

తా. ఇంద్రియములుగాని మనస్సుగాని వ్యక్తిగాని లేనట్టి అఖండసుఖస్వరూపుఁడ నగునాకు పుణ్యపాపములు ఎట్లుండును?

ఉండనే యుండవు. ఆత్మ అసంగుఁ డని "య త్తత్ర కించిత్పశ్యత్యన న్వాగత స్తేన భవత్యసంగో హ్యయం పురుషః," (ఆత్మ జాగ్ర దాద్యవస్థలలో యేయవస్థయందు దేనినిఁ జూచునో దానిని ఆయవస్థయందే వదలివేయునుగాని మఱియొక అవస్థలోనికి దానినిఁ దీసికొనకను, దానిసంబంధము లేకయు నుండును) అనెడి శ్రుతి చెప్పుచున్నది.

ఛాయయా స్పృష్టముష్ణం వా శీతం వా సుష్ఠు దుష్ఠు వా,
న స్పృశత్యేవ యత్కించిత్పురుషం తద్విలక్షణమ్. 505

తా. ఛాయాశరీరము(నీడ)చే తాఁకఁబడిన వస్తువుల యొక్క ఉష్ణమును శీతమును అనుకూలమైనను ప్రతికూలమైనను అసలు శరీరమును ఎంతమాత్రము స్పృశింపవు. అట్లే దేహధర్మము లాత్మ నంట వని భావము.

న సాక్షిణం సాక్ష్యధర్మాః సంస్పృశన్తి విలక్షణమ్,
అవికారముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్,
దేహేన్ద్రియమనోధర్మా నైవాత్మానం స్పృశన్త్యహో. 506

తా. ఇంటియందు జరిగెడిపనులు దీపమును సోఁకనియట్లు లోకవ్యవహారమందలి సాక్ష్యధర్మములు (లాభనష్టములు) తటస్థుఁడగు సాక్షిని స్పృశింపవు. ఆవిధముననే దేహేంద్రియమనో ధర్మములు వానికి విలక్షణుఁడును సకలవికారసాక్షియు నగు ఆత్మ నంటవు.

అవ. కూటస్థాత్మకు వికారసంబంధము లే దనుటకు దృష్టాంతములను శిష్యుఁడు చెప్పుచున్నాఁడు:—

రవేర్యథా కర్మణి సాక్షిభావో
వహ్నేర్యథా వాఽయసి దాహకత్వమ్,

రజ్జోర్యథాఽఽరోపితవస్తుసంగ
స్తథైవ కూటస్థచిదాత్మనో మే. 507.

తా. లోకమందు జను లొనరించు సర్వకర్మలయందు రవి తాను పాల్గొనక సర్వసాక్షియై యెట్లు భాసిల్లునో, అట్లే చిదాభాసుల (జీవుల) కర్మలయందు కూటస్థుఁడ నగు నేను పాల్గొనక సాక్షిమాత్రుఁడ నగుదును. మఱియు, జడమగు లోహమునకు వహ్నిసంసర్గమువలన దాహకత్వ మెంనరినట్లు, జడుఁడగు చిదాభాసునకు అధిష్ఠానచైతన్యమునగు నాసంసర్గము వలన ప్రకాశకత్వము ఒనఁగూడును. మఱియు, రజ్జువునందు సర్పరూపాన్యవస్తుసంసర్గ మారోపితమైనయట్లు, చిదాభాసకృత కర్తృత్వభోక్తృత్వాదికము భ్రాంతిమూలమున కూటస్థచైతన్య స్వరూపుఁడనగునాయందు ఆరోపింపఁబడును. "అసంగోహ్యయమనాః శుభ్రః" అని శ్రుతి.

కర్తాపి వా కారయితాపి నాహం
భోక్తాపి వా భోజయితాపి నాహమ్,
ద్రష్టాపి వా దర్శయితాపి నాహం
సోఽహం స్వయంజ్యోతిరనీదృగాత్మా. 508

తా. నే నేక్రియకును కర్తను (చేయువాఁడను) గాను; కారయిత (ప్రేరకుఁడను) గాను. భోక్తను గాను; భోజయితను గాను. ద్రష్టను (చూచువాఁడను) దర్శయితను (చూపువాఁడను) గాను. మఱి నేనెట్టివాఁడ ననఁగా స్వయంప్రకాశస్వరూపుఁడను ఇంద్రియములకు అవిషయుఁడను నగు ఆత్మను.

చలత్యుపాధౌ ప్రతిబింబలౌల్య
మౌపాధికం మూఢధియో నయన్తి,

స్వబింబభూతం రవివద్వినిష్క్రియం
కర్తాస్మి భోక్తాస్మి హతోఽస్మి హేతి. 509

తా. చలించుచున్న నీటియందుఁ దోఁచు సూర్యప్రతిబింబముయొక్క చలనము నిష్క్రియుఁడగు గగనస్థరవియందు మూఢు లారోపింతురు. ఆప్రకారమే ఉపాధియగు దేహేంద్రియాదికమందలి ఆత్మప్రతిబింబధర్మములు కూటస్థాత్మయం దారోపించుకొని 'నేను కర్తను, భోక్తను. అయ్యో! నేను హతుఁడను' అని అజ్ఞానులు దుఃఖింతురు.

జలే వాపి స్థలే వాపి లుఠత్వేష జడాత్మకః,
నాహం విలిప్యే తద్ధర్మైర్ఘటధర్మైర్నభో యథా. 510

తా. జడమగు నీదేహము జలమందు మునిఁగినను, భూమిపై పొర్లినను ఆనీటితడిగాని బూడిదగాని, ఘటధర్మములాకాశమున కంటనియట్లు ఆత్మను అంటవు. అనఁగా దేహధర్మములతో ఆత్మకు సంబంధము లేదు.

కర్తృత్వభోక్తృత్వఖలత్వమత్తతా
జడత్వబద్ధత్వవిముక్తతాదయః,
బుద్ధేర్వికల్పా న తు సన్తి వస్తుతః
స్వస్మిన్పరే బ్రహ్మణి కేవలేఽద్వయే. 511

తా. కర్తృత్వము, భోక్తృత్వము, దుర్జనత్వము, మత్తత, జడత్వము, బంధము, మోహము మొదలగు సర్వమును బుద్ధిధర్మములేకాని, కేవలాద్వితీయపరబ్రహ్మమున కెట్టి వికారములును లేవు.

సన్తు వికారాః ప్రకృతేర్దశధా శతధా సహస్రధా వాపి,

తై: కింమేఽసంగచితేర్న హ్యంబుదడంబరోఽంబరం స్పృశతి.

తా. ప్రకృతియొక్క వికారములు వేలకొలఁది లక్షల కొలఁది కలిగినను గలుగుఁగాక. మేఘసంఘము లెన్ని వచ్చుచుఁ బోవుచున్నను నిర్మలాకాశమున కెట్టివికారమును గలుగనియట్లు అసంగచిదాత్మ నగునాకు ప్రకృతిసంబంధవికారము లెవ్వియు నంటవు.

అవ్యక్తాదిస్థూలపర్యన్తమేత
ద్విశ్వం యత్రాభాసమాత్రం ప్రతీతమ్,
వ్యోమప్రఖ్యం సూక్ష్మమాద్యన్తహీనం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి. 513

తా. అవ్యక్తము మొదలు స్థూలదేహపర్యంతముగఁగల చరాచరప్రపంచ మంతయు ఏపరబ్రహ్మమునందు ఆభాసమాత్రముగఁ బ్రతీత మగుచున్నదో అట్టి ఆకాశమువలె సర్వవ్యాపకమును, సూక్ష్మమును, ఆద్యంతశూన్యమును, అద్వితీయమును అగు బ్రహ్మము నేనే.

సర్వాధారం సర్వవస్తుప్రకాశం
సర్వాకారం సర్వగం సర్వశూన్యమ్,
నిత్యం శుద్ధం నిశ్చలం నిర్వికల్పం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి. 514

తా. కల్పితసకలప్రపంచమున కధిష్ఠానమును, సకలజడవస్తుప్రకాశకమును, (సర్వోపాధులయందు నుండుటచేత) సర్వాకారమును, (అధిష్ఠానరూపమున) సర్వగతమును, నామరూపాది వర్జితమగుటచేత) సర్వశూన్యమును, నిత్యమును, శుద్ధమును,

నిశ్చలమును, వికల్పశూన్యమును, అద్వితీయమును అగు ఏబ్రహ్మము గలదో ఆబ్రహ్మమే నేను.

[1]యస్మిన్నస్తాశేషమాయావిశేషం
ప్రత్యగ్రూపం ప్రత్యయాగమ్యమానమ్,
సత్యజ్ఞానానన్తమానన్దరూపం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి. 515

తా. ఏబ్రహ్మ సాక్షాత్కారసమయమున మాయాకల్పిత సకలవిశేషములును నిలీనమై ప్రత్యగ్రూపమున (సర్వాంతరరూపమున) బుద్ధివృత్తులకు నగోచరమై, సత్యజ్ఞానానందరూపమున అద్వితీయమైయుండునో అట్టి పరబ్రహ్మము నేనే.

నిష్క్రియోఽస్మ్యవికారోఽస్మి నిష్కలోఽస్మి నిరాకృతిః,
నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి నిరాలంబోఽస్మి నిర్ద్వయః. 516

తా. ఆబ్రహ్మమగు నాకు చలనాదిక్రియలు లేవు. ఏవికారములు (మార్పులు) లేవు. ఆకారముగాని అవయవములుగాని లేవు. వికల్పములుగాని మఱియొక ఆధారముగాని నాకు లేదు.

సర్వాత్మకోఽహం సర్వోఽహం సర్వాతీతోఽహమద్వయః,
కేవలాఖణ్డబోధోఽహమానన్దోఽహం నిరన్తరః. 517

తా. సకలవస్తువులయందును సత్తారూపమున సర్వాత్మకుఁడ నగుటవలన సర్వమును నేనేయైనను సర్వాతీతుఁడను, అద్వితీయకేవలాఖండబోధస్వరూపుఁడను, నిరంతరానందస్వరూపుఁడను (అగుబ్రహ్మమను).

---

1 యత్రప్రత్యస్తాశేషమాయావిశేషం.

అవ. గురుకృతోపకారసూచనగా శిష్యుఁడు గురువునకు నమస్కరించుచున్నాఁడు:—

స్వారాజ్యసామ్రాజ్యవిభూతిరేషా
భవత్కృపాశ్రీమహితప్రసాదాత్,
ప్రాప్తా మయా శ్రీగురవే మహాత్మనే
నమో నమస్తేఽస్తు పునర్నమోఽస్తు. 518

తా. "స్వేనైవ రాజత ఇతి స్వరాట్, స్వరాజః భావః స్వారాజ్యం," అనఁగా స్వయంప్రకాశమానైకస్వరూపము ఇది యనెడి మహారాజ్యము. ఇట్టి మహైశ్వర్యము, స్వామీ! గురువరేణ్యా! మీపరిపూర్ణకటాక్షమున నాకు సంప్రాప్తమైనది. మహాత్మా! గురుమూర్తీ! నీకు నమస్కారసహస్రములు.

మహాస్వప్నే మాయాకృతజనిజరామృత్యుగహనే
భ్రమన్తం క్లిశ్యన్తం బహులతరతాపైరనుకలమ్,
అహంకార వ్యాఘ్రవ్యథితమిమమత్యన్తకృపయా
ప్రబోధ్య ప్రస్వాపాత్పరమహితవాన్మామసి గురో.

తా. ఓగురునాథ! మీచరణకమలములకు నమస్కారములు. మాయాకల్పితజననజరామరణదుఃఖములతో దురవగాహమగు సంసారరూపమహాస్వప్నమున పరిభ్రమించుచుఁ, బ్రతిదినము తాపత్రయతప్తుఁడ నగుచు, అహంకారమనెడి మహావ్యాఘ్రముచే పీడింపఁబడుచున్న నన్ను నత్యంతదయతో మహానిద్రనుండి మేల్కొలిపి రక్షించితిరి. ధన్యుఁడనైతిని.

వి. జీవుఁడు తన నిజస్వరూపమునుమఱచి మాయాకల్పిత ప్రాపంచికవిషయనిమగ్నుఁ డగుటయే మహాస్వప్నము. సద్గురు

కటాక్షమున స్వస్వరూపమును దెలిసికొని జీవభ్రాంతిని విడిచి బ్రహ్మరూపస్థితి నుండుటయే జాగ్రత్తు. ఇది జ్ఞానికి మాత్రమే గోచరము.

అవ. శిష్యుఁడు బ్రహ్మస్వరూపుఁ డగుగురువే విశ్వరూపుఁడుగా నెంచి నమస్కరించుచున్నాఁడు:—

నమస్తస్మై సదేకస్మై నమశ్చిన్మహసే ముహుః,
యదేతద్విశ్వరూపేణ రాజతే గురురాజ తే. 520

తా. పరమాత్మాఽభిన్నుఁడవగు ఓగురునాథ! ఏ నీదివ్య తేజస్సు జగదాకారముగ భాసించుచున్నదో, అనిర్వాచ్యము అద్వితీయము కాలత్రయాబాధ్యమునగు అట్టి తేజోరూపమునకు నమస్కారము.

అవ. శిష్యుఁ డిట్లు తన అనుభవమును విన్నవింపఁగావిని, గురువు సంతోషించి, మిగుల ప్రసన్నుఁడై, జీవన్ముక్తిసుఖార్థము బ్రహ్మాభ్యాసవిధానమును బోధించుచున్నాఁడు:—

ఇతి నతమవలోక్య శిష్యవర్యం
సమధిగతాత్మసుఖం ప్రబుద్ధతత్త్వమ్,
ప్రముదితహృదయః స దేశికేన్ద్రః
పునరిదమాహ వచః పరం మహాత్మా. 521

తా. ఆత్మతత్త్వమును దెలిసికొని బ్రహ్మానందనిమగ్నుఁడై తనకు నమస్కరించిన శిష్యవర్యునిఁ జూచి సంతోషచిత్తుఁ డగు గురూత్తముఁడు శిష్యునితో నిట్లు చెప్పుచున్నారు:—

బ్రహ్మప్రత్యయసంతతిర్జగదతో బ్రహ్మైవ సత్సర్వతః
పశ్యాధ్యాత్మదృశా ప్రశాన్తమనసా సర్వాస్వవస్థాస్వపి,

రూపాదన్యదవేక్షితుం కిమభితశ్చక్షుష్మతాం విద్యతే
తద్వద్బ్రహ్మవిదః సతః కిముపరం బుద్ధేర్విహారాస్పదమ్. 522

తా. వత్సా! రజ్జువునం దారోపింపఁబడిన సర్పముతోఁ జూచు నపుడు అధిష్ఠాన మగురజ్జువు కనఁబడదు. ఇదియే వివర్త మనఁ బడును. ఆప్రకారమే యీప్రపంచ మంతయు బ్రహ్మముయొక్క వివర్తరూప మగుటవలన బ్రహ్మమే యగును. "ప్రతీతిత్వాత్ప్రత్యయః" అనెడి వ్యుత్పత్తివలన బోధయే బ్రహ్మము. కాఁబట్టి, సర్వావస్థలందును అధ్యాత్మదృష్టితో శాంతచిత్తుఁడవై సర్వము సద్రూపముగనె కనుఁగొనుము. అయ్యా! నేను బ్రహ్మస్వరూపుఁడనేకదా. ఇఁకను బ్రహ్మమును జూచు టెట్లు? అనెదవేని వినుము. నేత్రములతోఁ జూచువాఁడు దృశ్యపదార్థమునే చూచునుగాని అన్యపదార్థమును జూడఁజాలఁడు. ఇది యటులఁ గాదు. బ్రహ్మవేత్త సద్రూపమునే చూచునుగాని తదితరమును జూడఁడు. ఎట్లన, "యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః," అనునట్లు బుద్ధి యేయేవిషయములను తలంచునో ఆయావిషయములెల్ల బ్రహ్మమే యగును. అనఁగా, జ్ఞానదృష్టితోఁ జూచువానికి బ్రహ్మేతరము గోచరింపదని భావము.

కస్తాం పరానన్దరసానుభూతి
మ్రుత్సృజ్య శూన్యేషు రమేత విద్వాన్,
చన్ద్రే మహాహ్లాదిని దీప్యమానే
చిత్రేన్దుమాలోకయితుం క ఇచ్ఛేత్ ? 523

తా. దుఃఖమిశ్రముగాని నిత్యనిరతిశయానందరసానుభవము నుపేక్షించి, ఆనందశూన్యములును తుచ్ఛములును అగు

విషయముల నేవిద్వాంసుఁడు (జ్ఞాని) అపేక్షించును? పరమా నంద ప్రదుఁడగు రాకాచంద్రుఁడు ప్రకాశించుచుండ చిత్రపట మందు వ్రాయఁబడిన చంద్రునిఁ జూడ నిచ్ఛయించు మూర్ఖుఁ డుండునా? "న కేచన జగద్భావా స్తత్త్వజ్ఞం రంజయంత్యమీ, నాగరం నాగరీ కాంతం కుగ్రామలలనా ఇవ" అని వసిష్ఠవాక్యము.

అసత్పదార్థానుభవే న కించి
న్నహ్యస్తి తృప్తిర్న చ దుఃఖహానిః,
సదద్వయానన్దరసానుభూత్యా
తృప్తః సుఖం తిష్ఠ సదాత్మనిష్ఠయా. 524

తా. అసత్ (మిథ్యా) పదార్థానుభవమువలన నించు కైనను తృప్తికలుగదు. ప్రాప్తదుఃఖమును దొలఁగదు. కావున వత్సా! అద్వితీయ బ్రహ్మానందరసము ననుభవింపుచు, సంతృప్తుఁడ వై బ్రహ్మనిష్ఠుఁడవై సుఖింపుము.

స్వమేవ సర్వతః పశ్యన్మన్యమానః స్వమద్వయమ్,
స్వానన్దమనుభుంజానః కాలం నయ మహామతే. 525

తా. ఓధీమంతుఁడా! 'నేను' అనునది ప్రజ్ఞానము(బోధ) గాని, దేహము కాదు. దృశ్యపదార్థములయొక్క నామరూప ముల నపేక్షింపఁగా శేషించునది బోధమాత్రమే కనుక, నట్టి సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమును అద్వితీయమును అగు 'జ్ఞాన (బ్రహ్మ) స్వరూపమే నేను' అని తలంచుచు ఆత్మా నందము ననుభవింపుచు కాలము గడపుము.

అఖణ్డబోధాత్మని నిర్వికల్పే
వికల్పనం వ్యోమ్ని పురః ప్రకల్పనమ్,

తదద్వయానన్దమయాత్మనా సదా
శాన్తిం పరామేత్య భజస్వ మౌనమ్. 526

తా. సర్వవికల్పశూన్యమై అఖండబోధరూపపరమాత్మ యందు ఇద్దియా అద్దియా యని వికల్పించుట ఆకాశమందు నగరకల్పన వంటిది. కావున అద్వయానందస్వరూపుఁడవై పరమ శాంతితో మౌనమును భజింపుము.

వి. "త్రివిధపరిచ్ఛేదశూన్యత్వం అఖండత్వం," దేశకాల వస్తుపరిచ్ఛేదరహితమే అఖండత్వము.

మౌనలక్షణము:—

యస్మాద్వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ,
యన్మౌనం యోగిభిర్గమ్యం తద్భజేత్సర్వదా బుధః.
వాచో యస్మాన్నివర్తన్తే తద్వక్తుం కేన శక్యతే,
ప్రపంచోయది వక్తవ్యః సోఽపి శబ్దవివర్జితః,
ఇతి వా తద్భవేన్మౌనం సతాం సహజసంజ్ఞితమ్,
గిరా మౌనం తు బాలానాం ప్రయుక్తం బ్రహ్మవాదిభిః"

తూష్ణీమవస్థా పరమోపశాన్తి
ర్బుద్ధేరసత్కల్పవికల్పహేతోః,
బ్రహ్మాత్మనా బ్రహ్మవిదో మహాత్మనో
యత్రాద్వయానన్దసుఖం నిరన్తరమ్. 527

తా. మిథ్యాసంకల్పవికల్పహేతు వగుబుద్ధి శాంతించి యుండుటయే మౌనావస్థ. ఈయవస్థయందు బ్రహ్మవేత్తయగు మహాత్మునకు నిరవచ్ఛిన్నముగ బ్రహ్మానందసుఖమనుభవ మగును.

నాస్తి నిర్వాసనాన్మౌనాత్పరం సుఖకృదుత్తమం.
విజ్ఞాతాత్మస్వరూపస్య స్వానన్దరసపాయినః, 528

తా. ఆత్మతత్త్వమును దెలిసికొని స్వస్వరూపానంద రసానుభవము గలయోగికి వాసనారహిత మగుమౌనముకంటె సుఖదాయక మితర మెద్దియును లేదు.

గచ్ఛంస్తిష్ఠన్నుపవిశన్ శయానో వాన్యథాపి వా,
యథేచ్ఛయా వసేద్విద్వానాత్మారామః సదా మునిః. 529

తా. ఆత్మజ్ఞాని నడుచునపుడును, కూర్చుండునపుడును, విశ్రమించి యుండునపుడును, శయనించి యుండునపుడును, లేక యితర క్రియలు చేయుచుండునపుడును సదా ఆత్మారాముఁడై స్వేచ్ఛతో వర్తించును. ఇచట భగవద్వాక్యప్రమాణము:— "ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి, ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్."

న దేశకాలాసనదిగ్యమాది
లక్ష్యాద్యపేక్షా ప్రతిబద్ధవృత్తేః,
సంసిద్ధతత్త్వస్య మహాత్మనోఽస్తి
స్వవేదనే కా నియమాద్యవస్థా. 530

తా. చిత్తవృత్తులు నిరోధింపఁబడి బ్రహ్మాత్మైకత్వసిద్ధి గల మహాత్మునకు దేశకాలాసనదిగ్యమాదిసాధనాపేక్ష లేదు. బ్రహ్మస్వరూపస్థితి నుండువానికి యమ నియమధ్యానాదులతోఁ బ్రయోజన మేమి? ప్రయోజనమే లేదు.

ఘటోఽయమితి విజ్ఞాతుంనియమః కోఽన్వపేక్ష్యతే,
వినా ప్రమాణసుష్ఠుత్వం యస్మిన్సతి పదార్థధీః. 531

తా. ఇది ఘటము అని తెలియుటకు తననేత్రము సూర్యప్రకాశము ననెడి స్ఫుట ప్రమాణమే కావలయునుగాని స్నాన

జపాదినియమములతోఁ బనిలేదు. ఆప్రకారమే ఆత్మజ్ఞానమునకు శాస్త్రాచార్యోపదేశమున్ను స్వానుభవమున్ను కావలయును గాని ఇతరనియమములతో నెంతమాత్రము ప్రయోజనము లేదు.

అయమాత్మా నిత్యసిద్ధః ప్రమాణే సతి భాసతే,
న దేశం నాపి వా కాలం న శుద్ధిం వాప్యపేక్షతే. 532

తా. తత్త్వమస్యాదిమహావాక్యప్రమాణమువలన ఆత్మ అపరోక్షముగ నిత్యసిద్ధమై ప్రకాశించుచుండ, దేశము కాలము శరీరశుద్ధి (అపిశబ్దమువలన యమనియమాదులు) మొదలగు వానితోఁ బ్రయోజనము లేదు.

దేవదత్తోఽహామిత్యేతద్విజ్ఞానం నిరపేక్షకమ్,
తద్వద్బ్రహ్మవిదోఽప్యస్య బ్రహ్మాహామితి వేదనమ్. 533

తా. 'నేను దేవదత్తుఁడను' అని తెలిసికొనుట కితరాపేక్ష యెట్లు లేదో, అట్లే బ్రహ్మవిదునకు 'నేను బ్రహ్మమను' అని తెలిసికొనుటకు అన్యాపేక్ష యుండదు. శాస్త్రాదులు ప్రతిబంధమును నివర్తించునే కాని సిద్ధవస్తువును బోధింపఁజాలవు.

అవ. ఆత్మజ్ఞానమునకు అన్యాపేక్ష లేదని సదృష్టాంతముఁగ నిరూపించుచున్నారు:—

భానునేవ జగత్సర్వం భాసతే యస్య తేజసా,
అనాత్మకమసత్తుచ్ఛం కిం ను తస్యావభాసకమ్. 534

తా. జగత్తంతయు సూర్యునియొక్క తేజస్సుచేఁ బ్రకాశించుచున్నది. ఆప్రకారమే, అనృతజడదుఃఖాత్మకమును తుచ్ఛమును నగు దృశ్యప్రపంచము సర్వమును అధిష్ఠానాత్మచే

భాసించుచున్నది, ఆయాత్మ స్వయంప్రకాశస్వరూపము. అన్య మెద్దియును ఆత్మను బ్రకాశింపఁజేయఁజాలదు. ఇచట "సత్య భాసా సర్వమిదం విభాతి," అను శ్రుతి ప్రమాణము.

వేదశాస్త్రపురాణాని భూతాని సకలాన్యపి,
యేనార్థవన్తి తం కిం ను విజ్ఞాతారం ప్రకాశయేత్. 535

తా. సకల వేదశాస్త్రపురాణములు, స్థావరజంగమరూప సమస్తభూతములును ఏయాత్మచైతన్యముచేతనే సార్థకములగు చున్నవో, అట్టి సకలప్రకాశకచైతన్యరూపపరమాత్మను దృశ్య వస్తు వెద్దియైన ప్రకాశింపఁజేయఁగలదా? ఎద్దియుఁ బ్రకాశింపఁ జేయఁజాలదు.

ఏష స్వయంజ్యోతిరనన్తశక్తి
రాత్మాప్రమేయః సకలానుభూతిః,
యమేవ విజ్ఞాయ విముక్తబన్ధో
జయత్యయం బ్రహ్మవిదుత్తమోత్తమః. 536

తా. ఈయాత్మ స్వయంజ్యోతిస్సు, (అనఁగా సూర్యా గ్న్యాదులు సయితము ఆత్మతేజస్సుచేతనే భాసించుచున్నవి గాని ఆత్మకు పరాపేక్ష లేదని భావము) కర్తుమకర్తు మన్యథా కర్తుం సమర్థమగు శక్తి గలది, సజాతీయవిజాతీయస్వగతభేదము లేనిది, సకలానుభూతి, అనఁగా సర్వప్రపంచరూపమున్ను అను భవాత్మకమున్ను. ఇట్టి సర్వాభిన్నపరమాత్మను తన్నుగాఁ దెలిసి కొనిన బ్రహ్మవిద్వరిష్ఠుఁడు సర్వబంధవినిర్ముక్తుఁడై (ముక్తుఁడై) విరాజిల్లును.

న శిద్యతే నో విషయైః ప్రమోదతే
న సజ్జతే నాపి విరజ్యతే చ,
స్వస్మిన్సదా క్రీడతి నన్దతి స్వయం
నిరన్తరానందరసేన తృప్తః. 537

తా. మఱియు నీబ్రహ్మవిద్వరిష్ఠుఁడు శబ్దాదికవిషయములయెడల ఖేదమోదములఁ జెందఁడు. దేనియందును ఆసక్తిగాని విరక్తిగాని కలిగి యుండఁడు. సర్వకాలసర్వావస్థలందును ఆత్మారాముఁడై ఆనందరసముచే సంతృప్తుఁడై విహరించుచుండును.

క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా బాలః క్రీడతి వస్తుని,
తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ. 538

తా. బాలుఁడు తనకు ఆటవస్తువు దొరికినపుడు ఆఁకలినిగాని శరీరాయాసమునుగాని పాటింపక యాడుకొనును. ఆవిధముననే జ్ఞానియు అహంతా మమతాశూన్యుఁడై, సర్వదా ఆత్మవస్తువునందే క్రీడించుచుండును.

అవ. బ్రహ్మవేత్తల శాస్త్రవిహితవ్యవహారమును జెప్పుచున్నారు:—

చిన్తాశూన్యమదైన్యభైక్ష్యమశనం పానం సరిద్వారిషు
స్వాతన్త్ర్యేణ నిరఙ్కుశా స్థితిరభీర్నిద్రా శ్మశానే వనే,
వస్త్రం క్షాళనశోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సంచారో నిగమాన్తవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి.

తా. బ్రహ్మవేత్తలకు చిత్తమందు విచారముగాని దిగులుగాని యుండదు. భిక్షాన్నమును భుజియింతురు. నదీజలము

స్థానము, ఎట్టి నిర్బంధమును లేక స్వతంత్రముగ విహరింతురు. నిర్భయులై వనమందుగాని శ్మశానమందుగాని నిదురింతురు. ఉతుకుటగాని ఆర వేయుటగాని యక్కఱలేని దిక్కులే వస్త్రము. (దిగంబరులు) నేలపై పవళింతురు. వేదవేదాంతరూప వనవీథులయందుఁ దిరుగుచు సర్వదా పరబ్రహ్మమునందే క్రీడించుచుందురు.

విమానమాలంబ్య శరీరమేతత్
భునక్త్యశేషాన్విషయానుపస్థితాన్,
పరేచ్ఛయా బాలవదాత్మవేత్తా
యోఽవ్యక్తలింగోఽననుషక్తబాహ్యః. 540

తా. బ్రహ్మవేత్త (విద్వరిష్ఠుఁడు) శరీరమనెడి విమానము నాశ్రయించి ప్రాప్తమగు శుభాశుభవిషయములను పరేచ్ఛతో ననుభవించుచుండును, మఱియు, బాహ్యవిషయములం దనురాగము లేక, తా నిట్టివాఁడని యితరులకుఁ దెలియకుండ పిచ్చివానివలెను, బాలునివలెను పరేచ్ఛాప్రాప్తములనె యనుభవించుచుండును.

అవ. మఱియు బ్రహ్మవిద్వరిష్ఠుని చేష్టలను వివరించుచున్నారు:—

దిగంబరో వాపి చ సాంబరో వా
త్వగంబరో వాపి చిదంబరస్థః,
ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా
పిశాచవద్వాపి చరత్యవన్యామ్. 541

తా. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు సదా చిదాకాశస్థితుఁడై యుండి, అనఁగా ప్రత్యగాత్మయందే విలీనమైయుండి, ఒకప్పుడు దిగంబరి

గాను, ఒకప్పుడు వస్త్రమును ధరించియు, ఒకప్పుడు చర్మాంబర మును ధరించియు, పిచ్చివానివలెను బాలునివలెను పిశాచము వలెను భూమియందు సంచరించుచుండును. (దేహవాసన లేక పోవుటచేత మనస్సున్ను వాసనలున్ను క్షీణించి బ్రహ్మస్వరూపుం డై యుండుటవలన నిట్టిస్థితియం దుండు నని యభిప్రాయము.)

1కామాన్ని కామరూపీ సంశ్చరత్యేకచరో మునిః,
స్వాత్మనైవ సదా తుష్టః స్వయం సర్వాత్మనా స్థితః. 542

తా. ఇట్టివిజ్ఞానిస్వస్వరూపమందె సదా సంతుష్టుండగుచు, తాను సర్వాత్మస్వరూపుండై, అనఁగా సర్వమును బ్రహ్మమాత్ర ముగను అన్నిరూపములు తనవిగను తలంచుచు, విషయముల యందు కోరికలేక ప్రాప్తము లనుభవించుచుండును.

క్వచిన్మూఢో విద్వాన్క్వచిదపి మహారాజవిభవః
క్వచిద్భ్రాన్తః సౌమ్యః క్వచిదజగరాచారకలితః,
క్వచిత్పాత్రీభూతః క్వచిదవమతః క్వాప్యవిదిత
శ్చరత్యేవం ప్రాజ్ఞః సతతపరమానన్దసుఖితః. 543

తా. ఇట్టిమహాత్ముఁ డొకపుడు మూఢునివలెను, ఒకపుడు విద్వాంసునివలెను సంభాషించును. ఒకపుడు మహారాజభోగ ముల ననుభవించును. మఱియొకప్పుడు పిచ్చివానివలెను ఒకపుడు సాధువువలెను ఉండును. ఒకానొకపుడు అజగరము(కొండచిలువ) వలె పడి యుండును. ఒకపుడు సర్వజనపూజ్యుఁడుగా నుండును. ఒకపు డెవరికిఁ దెలియకుండ నుండును. ఇట్లు నానావిధముల వర్తించుచు సతతము పరమానందసుఖ మనుభవించుచుండును.

---

1 కామాన్నిష్కామరూపీ.

నిర్ధనోఽపి సదా తుష్టోఽప్యసహాయో మహాబలః,
నిత్యతృప్తోఽప్యభుంజానోఽప్యసమః సమదర్శనః. 544

తా. మఱియు నీమహానీయుండు నిర్ధనుఁడయ్యును నిత్య సంతోషి. అసహాయుఁడయ్యును మహాబలశాలి. భుజియింపకున్నను నిత్యతృప్తుఁడు. తనతో తుల్యవస్తువు లేకున్నను సర్వమును సమదృష్టితోఁ జూచును.

వి. సమదృష్టి యనఁగా బ్రహ్మభావన. "సమతా సర్వభావేషు యాఽసౌ సత్యపరా స్థితిః," అని ఆర్యవచనము.

అపి కుర్వన్న కుర్వాణశ్చాభోక్తా ఫలభోగ్యపి,
శరీర్యప్యశరీర్యేష పరిచ్ఛిన్నోఽపి సర్వగః. 545

తా. ఈపరమవిజ్ఞాని బాహ్యదృష్టి కేదేనిచేయుచున్నను కర్తృత్వాభిమానము లేమిచే నేమియుం జేయనివాఁడే, కర్మఫలమనుభవించుచున్నను అనుభవింపనివాఁడే, శరీరధారియయ్యును (చిద్రూపమాత్రుఁడగుటచేత) శరీరము లేనివాఁడే, పరిచ్ఛిన్నుఁడయ్యును(చైతన్యస్వరూపుఁడగుటచే) సర్వవ్యాపియే యగును.

అశరీరం సదా సన్తమిమం బ్రహ్మవిదం క్వచిత్,
ప్రియాప్రియే న స్పృశత స్తథైవ చ శుభాశుభే. 546

తా. సశరీరి యయ్యు నశరీరియగు నిట్టిబ్రహ్మవిదుత్తమునకు ప్రియాప్రియములగు సుఖదుఃఖములును, శుభాశుభములగు పుణ్యపాపములును ఎంతమాత్రము స్పృశింపవు. "అశరీరం వా వసన్తం న ప్రియాప్రియే స్పృశతః," అను ఛాందోగ్యశ్రుతిప్రమాణముగ నీశ్లోకము చెప్పఁబడినది.

అవ. ప్రియాప్రియములును శుభాశుభములును గలిగి నప్పు డెవనికైనను సుఖదుఃఖములు గలుగకుండునా యనుశంక కుత్తరము:—

స్థూలాదిసంబన్ధవతోఽభిమానినః
సుఖం చ దుఃఖం చ శుభాశుభే చ,
విధ్వస్తబన్ధస్య సదాత్మనో మునేః
కుతః శుభం వాప్యశుభం ఫలం వా. 517

తా. స్థూలసూక్ష్మశరీరములతో తాదాత్మ్యాభిమానముగల వానికే సుఖదుఃఖములు శుభాశుభములు వర్తించునుగాని, కారణసహితముగ దేహాదితాదాత్మ్యాభిమాన శూన్యుఁడును సద్రూపుఁడును అగు జ్ఞానికి శుభాశుభకర్మలవలనఁ గలిగెడి సుఖ దుఃఖములు ఎట్లు కలుగును? కలుగనే కలుగవు.

అవ. నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడగు ఆత్మ అజ్ఞులదృష్టికి నెట్లు తోఁచునో సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

తమసా గ్రస్తవద్భానాదగ్రస్తోఽపి రవిర్జనైః,
గ్రస్త ఇత్యుచ్యతే భ్రాన్త్యా హ్యజ్ఞాత్వా వస్తులక్షణమ్.
తద్వద్దేహాదిబన్ధేభ్యో విముక్తం బ్రహ్మవిత్తమమ్,
పశ్యన్తి దేహివన్మూఢాః శరీరాభాసదర్శనాత్. 519

తా. రాహుగ్రహము సూర్యుని అడ్డగించి యున్నపుడు, రాహువుచే సూర్యుఁడు మ్రింగఁబడె నని, వస్తులక్షణము తెలి యక, భ్రాంతిచే జనులు వచింతురు. కాని రాహువుచే సూర్యుఁడు మ్రింగఁబడుట లేదు. ఆప్రకారమే, దేహాదిబంధ విముక్తుఁ డగు బ్రహ్మవిదుని శరీరాభాసుఁ డగుటచే శరీరబద్ధుఁ డని మూఢులు తలంతురు.

అహినిర్ల్వయనీ వాయం ముక్తదేహస్తు తిష్ఠతి,
ఇతస్తతశ్చాల్యమానో యత్కించిత్ప్రాణవాయునా. 550

తా. పాముకుబుసము గాలిచే నటు నిటు కదలుచుండునట్లు, దేహాభిమానశూన్యుఁడగుజ్ఞాని ప్రాణవాయువుచేత నిటు నటు కదలుచుండును.

స్రోతసా నీయతే దారు యథా నిమ్నోన్నతస్థలమ్,
దైవేన నీయతే దేహో యథా కాలోపభుక్తిషు. 551

తా. ప్రవాహమందుఁ బడిన దారువు (కొయ్య)నిమ్నోన్నతస్థలములకు కొట్టుకొనిపోఁబడునట్లు, దైవానీతమగు దేహము ప్రారబ్ధానుసారముగ సుఖదుఃఖముల ననుభవించును, జ్ఞాని నిర్లిప్తుఁడై యుండును.

ప్రారబ్ధకర్మపరికల్పితవాసనాభిః
సంసారివచ్చరతి భుక్తిషు ముక్తదేహః,
సిద్ధః స్వయం వసతి సాక్షివదత్ర తూష్ణీం
చక్రస్య మూలమివ కల్పవికల్పశూన్యః. 552

తా. బండిచక్రములు తిరుగుచున్నను ఇరుసు తిరుగక స్థిరముగ నుండునట్లు, జీవన్ముక్తుఁడగుయోగి ప్రారబ్ధకర్మవశమునఁ గలుగు వాసనలచేత సంసారివలె కర్మఫలభోగశాలి యయ్యును, నిర్లేపుఁడై సాక్షిమాత్రుఁడుగ వర్తించును.

నైవేన్ద్రియాణి విషయేషు నియుఙ్క్త ఏష
నైవాపయుఙ్క్త ఉపదర్శనలక్షణస్థః,
నైవ క్రియాఫలమపీషదపేక్షతే చ
స్వానన్దసాన్ద్రరసపానసుమత్తచిత్తః. 553

తా. సాక్షిమాత్రుఁడుగ వ్యవహరించు నట్టి బ్రహ్మవేత్త శబ్దాదివిషయములందు ప్రవృత్తిగాని నివృత్తిగాని కలిగి యుండఁడు. ఆత్మానందరసపానముచేత ఆనందింపుచు శుభాశుభ క్రియాఫలముల నెంతమాత్రము నపేక్షింపఁడు.

లక్ష్యాలక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠేత్కేవలాత్మనా.
శివ ఏవ స్వయం సాక్షాదయం బ్రహ్మవిదుత్తమః. 554

తా. సర్వప్రపంచమున్ను పరమాత్మయొక్క వివర్తమే కనుక, తానును పరమాత్మయే యని తెలిసికొని ఇది గురూక్త లక్ష్య మని, యిది తదన్య మని భేదబుద్ధి లేనివాఁడై, బ్రహ్మ మాత్రముగ నుండెడి బ్రహ్మవిద్వరిష్ఠుఁడు స్వయముగ పరమ శివుఁడే యగును.

జీవన్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః.
ఉపాధినాశాద్బ్రహ్మైవ సద్బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్. 555

తా. జీవదశయందే సదా ముక్తుఁడగు బ్రహ్మవేత్త కృత కృత్యుఁ డగును. ఉపాధినాశమువలన, అనఁగా దేహవాసన లేకుండుటచే నట్టియోగి "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" యను శ్రుతిప్రమాణమునుబట్టి అద్వితీయబ్రహ్మమే యగును.

వి. కృతకృత్యత్వము— "ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై ముక్తేశ్చ సిద్ధయే, బహుకృత్యం పురాఽస్యాభూత్తత్సర్వ మధునా కృతమ్," అని శ్రీవేదాంతపంచదశి (7-253) లోఁ జెప్పఁ బడినది. అనఁగా, విద్వాంసునకు తత్త్వజ్ఞానోదయమునకుఁ బూర్వము ఇష్టప్రాప్తికొఱకును, అనిష్టనివృత్తికొఱకును కృషి వాణిజ్యాదికర్మము చేయఁదగి యుండెను. స్వర్గాదిసిద్ధికొఱకు

యాగోపాసనాదికము చేయఁదగి యుండెను. తత్త్వజ్ఞానోదయమైన పిమ్మట సాంసారికఫలేచ్ఛలేమిచేతను, బ్రహ్మసాక్షాత్కారము గలుగుటచేతను ఆకృషి యాగాదికమంతయుఁ జేయఁబడినట్లాయెను, అని జ్ఞాని తృప్తినొందును. ఇదియె కృతకృత్యత్వము.

శైలూషో వేషసద్భావాభావయోశ్చ యథా పుమాన్,
తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః సదా బ్రహ్మైవ నాపరః. 556

తా. నటుఁడు తాను ధరించిన వేషమున కనుగుణ్యముగ నానావిధముల నటించునపుడును, ఆవేషము తీసివేసినతర్వాతను ఎప్పటిపురుషుఁడే యగును. ఆవిధముననే బ్రహ్మవిద్వరిష్ఠుఁడు ఏయవస్థయందుండినను బ్రహ్మమే యగునుగాని తద్భిన్నుఁడు కాఁడు.

యత్ర క్వాపి విశీర్ణం పర్ణమివ తరోర్వపుః పతనాత్,
బ్రహ్మీభూతస్య యతేః ప్రాగేవ హి తచ్చిదగ్నినా దగ్ధమ్.

తా. బ్రహ్మభావమును బొందిన యతీశ్వరునియొక్క శరీరము పూర్వమే చిదగ్నిచే దగ్ధమైయుండుటవలన, నతనిశరీరము చెట్టునుండి పండినపత్రము రాలిపోవునట్లు, ఎప్పుడు ఎచ్చట పడిపోయినను నమ్మహాత్ముఁడు చింతింపఁడు.

సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః
పూర్ణాద్వయానన్దమయాత్మనా సదా,
న దేశకాలాద్యుచితప్రతీక్షా
త్వఙ్మాంసవిట్పిణ్డవిసర్జనాయ. 558

తా. సర్వదా అద్వయానందమయుఁడై సచ్చిదానందాత్మకపరబ్రహ్మరూపమున నుండు రాజయోగికి చర్మబద్ధమైన

మాంసపిండమగు నీతుచ్ఛశరీరమును విడుచుటకు ఉత్తరాయణా ద్యుచితకాలములోఁ గాని, స్వగృహాది ప్రదేశములోఁ గాని ప్రయోజనము లేదు.

దేహస్య మోక్షో నో మోక్షో న దణ్డస్య కమణ్డలోః,
అవిద్యాహృదయగ్రన్థిమోక్షో మోక్షో యతస్తతః. 559

తా. దేహమును విడుచుట మోక్షము కాదు. దండ కమండులువులను విడుచుట మోక్షము కాదు. మఱియేమనఁగా, అవిద్యాహృదయగ్రంథిమోక్షమే మోక్షము. అనఁగా, అవిద్యా కల్పిత మలమాంసాదిపూర్ణమగు నీశరీరమునందు అభిమాన త్యాగమే (కేవల చిద్రూపమున నుండుటయే) మోక్షము.

అవ. శరీరనాశమువలన ఆత్మకు హాని యేమియు లేదని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

కుల్యాయామథ నద్యాం వా శివక్షేత్రేఽపి చత్వరే,
పర్ణం పతతి చేత్తేన తరోః కిం ను శుభాశుభమ్. 560

పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవ
ద్దేహేన్ద్రియప్రాణధియాం వినాశః,
నైవాత్మనః స్వస్య సదాత్మకస్యా
నన్దాకృతేర్వృక్షవదాస్త ఏషః. 561

తా. ఒకవృక్షమునుండి దానియాకు ఒకపిల్లకాల్వలోఁ గాని, పెద్దనదిలోఁగాని, శివాలయములోఁగాని, ముంగిటిలోఁ గాని పడినయెడల వృక్షమునకు శుభాశుభఫలము లేనియట్లే జ్ఞానియొక్క దేహపతనమువలన ఫల మేమియు లేదు. మఱియు పత్రముగాని పుష్పముగాని ఫలముగాని నష్టమైనందున చెట్టు

నకు నష్టము లేనట్లే, సచ్చిదానందస్వరూపుఁ డగుపరమయోగికి దేహేంద్రియప్రాణధియాద్యనాత్మవస్తు నష్టమువలన నాతని పరిపూర్ణాత్మత్వమునకు కొంతయైన లేదు.

అవ. ఆత్మలక్షణమును జెప్పుచున్నారు:—

ప్రజ్ఞానఘన ఇత్యాత్మలక్షణం సత్యసూచనమ్,
అనాద్యోపాధికస్యైవ కథయన్తి వినాశనమ్. 562

తా. 'ప్రజ్ఞానఘనః' అనెడి శ్రుతి ఆత్మ సత్యమని సూచించుచున్నది. 'దేహేంద్రియాదులు నశించును' అని యేల చెప్పవలెననఁగా, మాయోపాధిభూతశరీరము ననువదించి శరీరమునకు నాశమును శ్రుతి చెప్పుచున్నది.

అవినాశీ వారేఽయమాత్మేతి శ్రుతిరాత్మనః,
ప్రబ్రవీ త్యవినాశిత్వం వినశ్యత్సు వికారిషు. 563

తా. "అవినాశీ వారేఽయమాత్మా" అనెడి శ్రుతి దేహాది వికారపదార్థజాతము నశించినను అధిష్ఠానాత్మకు నాశము లేదని చెప్పుచున్నది.

అవ. ఈ యర్థమునే దృష్టాంతయుక్తముగ నిరూపించు చున్నారు:—

పాషాణవృక్షతృణధాన్యకటాంబరాద్యా
దగ్ధా భవన్తి హి మృదేవ యథా తథైవ,
దేహేన్ద్రియాసుమనఆది సమస్తదృశ్యం
జ్ఞానాగ్నిదగ్ధముపయాతి పరాత్మభావమ్. 564

తా. మృత్కార్యములగు ఱాళ్లు చెట్లు తృణము ధాన్యము వస్త్రము మొదలగునవి దగ్ధములై స్వకారణమగు మృద్భావ

మునే పొందుచున్నవి. ఆ ప్రకారమే బ్రహ్మకార్యములగు దేహేంద్రియమనఃప్రాణాదిదృశ్యజాత మంతయు జ్ఞానాగ్నిచే దగ్ధములై, అనఁగా వానిమిథ్యాత్వము నిశ్చయింపఁబడఁగా బ్రహ్మభావమును బొందును.

అవ. దృగ్దృశ్యములు రెండును తేజస్తిమిరములవలె విలక్షణము లను నీయర్థమును దృఢపర్చుచున్నారు:—

విలక్షణం యథా ధ్వాంతం లీయతే భానుతేజసి,
తథైవ సకలం దృశ్యం బ్రహ్మణి ప్రవిలీయతే. 565

తా. సూర్యోదయము కాఁగా విలక్షణ మగు చీఁకటి సూర్యుని తేజస్సులో విలీనమగునట్లు, ఆత్మజ్ఞానము కలుగఁగనే విలక్షణమగు దృశ్యజాత మంతయు దృగ్రూపమగు బ్రహ్మము నందు విలీన మగును.

ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్ఫుటమ్,
తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయమ్. 566

తా. ఘటము నష్టము కాఁగా ఘటాకాశము మహాకాశమే యైనట్లు, ఉపాధివిలయము కాఁగా బ్రహ్మవేత్త స్వయముగ బ్రహ్మమే యగును.

అవ. ప్రారబ్ధక్షయానంతరము ఉపాధివిలయపూర్వకముగ బ్రహ్మవిదుఁడు విదేహముక్తుఁ డగునని శ్లోకత్రయముచే ప్రతిపాదింపుచున్నారు:—

క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే,
సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః. 567

తా. క్షీరమందు క్షీరమును, తైలమందు తైలమును, జలమందు జలమును కలిసి ఏకమగునట్లు ఆత్మవేత్త యగుయోగి ఆత్మయందే విలీనమై ఆత్మయే యగును.

ఏవం విదేహకైవల్యం సన్మాత్రత్వమఖణ్డితమ్,
బ్రహ్మభావం ప్రపద్యైష యతిర్నావర్తతే పునః. 568

తా. ఈ ప్రకారము సన్మాత్రాఖండరూపబ్రహ్మభావముతో విదేహకైవల్యమును బొందినయతి (జ్ఞాని)కి మఱల జననమరణరూపసంసారము కలుగదు.

సదాత్మైకత్వవిజ్ఞానదగ్ధావిద్యాదివర్ష్మణః,
అముష్య బ్రహ్మభూతత్వాద్బ్రహ్మణః కుత ఉద్భవః. 569

తా. ఈ బ్రహ్మవిద్వరిష్ఠుఁడు ఆత్మైకత్వవిజ్ఞానము గలవాఁడగుటచేత తాను బ్రహ్మమే యై విత్తనములు మొలవకుండ వేగించినట్లు, అవిద్యాతత్కార్యములను దేహాదికమునున్ను జ్ఞానాగ్నిచే దహించినవాఁడయ్యెను. బ్రహ్మమునకు జననమరణములు లేవు గనుక బ్రహ్మభూతుఁ డగునిమ్మహాత్మునకు పునరుద్భవ మెట్లగును? పునర్జన్మము లేదని భావము.

అవ. నిష్క్రియబ్రహ్మమునకు బంధమోక్షములు లేవనుటకు దృష్టాంతము:—

మాయాక్లుప్తౌ బన్ధమోక్షౌ న స్తః స్వాత్మని వస్తుతః,
యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాసవినిర్గమౌ. 570

తా. క్రియాశూన్యమగు త్రాటియందు స్వరూపాఽజ్ఞానముచే సర్పాభాసము కలుగుచున్నది. ఆ ఆభాసమున్ను సర్ప

మున్ను వాస్తవములు గావు. ఆప్రకారమే, మాయాకల్పితము లగు బంధమోక్షములు ఆత్మయందు వాస్తవముగ లేవు. "అహం త్వం చైవ చిన్మాత్రం మూర్తామూర్తాది చిన్మాత్రమ్, దృగ్దృశ్యం యది చిన్మాత్రమస్తి చేచ్చిన్మయః సదా." ఇత్యాది శ్రుతులు ఆత్మ చిన్మాత్రమని ఘోషించుచున్నవి.

అవ. ఆవరణమే బంధమోక్ష హేతువనియు, నిరావరణ బ్రహ్మమునకు బంధమోక్షములు లేవనియుఁ జెప్పుచున్నారు:-

ఆవృతేః సదసత్త్వాభ్యాం వక్తవ్యే బన్ధమోక్షణే,
నావృతిర్బ్రహ్మణః కాచిదన్యాభావాదనావృతమ్,
యద్యస్త్యద్వైతహానిః స్యాద్ద్వైతం నో సహతే శ్రుతిః.571

తా. అజ్ఞాన మనెడి ఆవరణమే బంధము. ఆయావరణాభావమే మోక్షము. అద్వితీయబ్రహ్మమునకు ఆవరణమే లేదు. ఆవరణకారకమగు ద్వితీయవస్తువు నంగీకరించినయెడల అద్వైతశాస్త్రమునకే భంగము కలుగును. అనఁగా ద్వైతమును శ్రుతి నిషేధించును.

అవ. ద్వైతమే లేనియెడల బంధమోక్షము లనెడి వ్యవహార మెట్లుఁ గలిగె నను శంకకు సమాధానము:—

బన్ధశ్చ మోక్షశ్చ మృషైవ మూఢా
బుద్ధేర్గుణం వస్తుని కల్పయన్తి,
దృగావృతిం మేఘకృతాం యథా రవౌ
యతోఽద్వయాసంగచిదేకమక్షరమ్. 572

తా. బంధమోక్షములు మిథ్యాభూతములేకాని వాస్తవములు కావు. మఱి వీనివ్యవహార మెట్లుకలిగెననఁగా, మేఘము

వలనఁ గలిగిన నేత్రావరణము సూర్యునియందుఁ గల్పింపఁబడినట్లు, బుద్ధి కార్యములగు బంధమోక్షములను అజ్ఞులు పరమాత్మధర్మములని భ్రాంతిచే భావింతురే కాని యది వాస్తవము కాదు. ఏల యనఁగా, పరబ్రహ్మము అద్వితీయము, సంగరహితము, చిన్మాత్రము, ఏకము, నాశరహితము కనుక పరమాత్మకు బంధమోక్షములు లేవు.

అస్తీతి ప్రత్యయో యశ్చ యశ్చ నాస్తీతి వస్తుని,
బుద్ధేరేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః. 573

తా. ప్రపంచము సత్యమనియు, బ్రహ్మము లేదనియు, నిట్టి విరుద్ధజ్ఞానము బుద్ధిధర్మమే కాని నిత్య మగు ఆత్మయొక్క ధర్మము కాదు.

అతస్తౌ మాయయా క్లృప్తౌ బన్ధమోక్షౌ న చాత్మని
నిష్కలే నిష్క్రియే శాన్తే నిరవద్యే నిరంజనే,
అద్వితీయే పరే తత్త్వే వ్యోమవత్కల్పనా కుతః. 574

తా. కావున బంధమోక్షములు మాయాకల్పితములే కాని ఆత్మధర్మములు కావు. నిరవయవము నిష్క్రియము శాంతము నిరావరణము నిరంజనము అద్వితీయమును, ఆకాశమువలె పరిపూర్ణమును అగు ఆత్మకు బంధమోక్షాదికల్పన పొసఁగదు.

న నిరోధో న చోత్పత్తిర్న బన్ధో న చ సాధకః,
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా. 575

తా. అట్టి అద్వయాత్మకు ఉత్పత్తియు లేదు. బంధమును లేదు, చిత్తనిరోధము లేదు, సాధకుఁడు ముముక్షువు ముక్తుఁడు

అనుటయు బుద్ధికల్పితమేకాని వాస్తవములు కావు. ఇదియే పరమార్థము.

అవ. శ్రీగురువు శిష్యున కుపదేశకారణమును ఫలితమును జెప్పుచున్నారు—

సకలనిగమచూడాస్వాన్తసిద్ధాన్తరూపం
పరమిద మతిగుహ్యం దర్శితం తే మయాద్య,
అపగతకలిదోషః కామనిర్ముక్త[1]బుద్ధి
స్తదతులమసకృత్త్వం భావయేదం ముముక్షుః. 576

తా. వత్సా! సకలవేదాంతసిద్ధాంతరూపమును అతి రహస్యమును అగు తత్త్వమును నీకు బోధించితిని. కనుక సకల కలికృతదోషవర్జితుఁడవై, విషయవాసనాశూన్యుఁడవై, మోక్షాసక్తుఁడవై నిరుపమాన మగునీతత్త్వమును సదా భావింపుము.

ఇతి శ్రుత్వా గురోర్వాక్యం ప్రశ్రయేణ కృతానతిః,
స తేన సమనుజ్ఞాతో యయౌ నిర్ముక్తబన్ధనః. 577

తా. ఇట్లు గురువు నుడువఁగా విని, శిష్యుఁడు వినయభయభక్తులతో గురువునకు నమస్కరించి, వారియాజ్ఞం గొని, సర్వబంధనిర్ముక్తుఁడై, అనఁగా జీవన్ముక్తుఁడై వెడలిపోయెను.

గురురేష సదానన్దసిన్ధౌ నిర్మగ్నమానసః,
పావయన్వసుధాం సర్వాం విచచార నిరన్తరః. 578

తా. అనంతరము శ్రీగురువు సదానందరససింధునిమగ్నుఁడై, పృథ్విని పవిత్రము నేసి, అనఁగా జనులను తరింపఁజేసి, పరిపూర్ణుఁడై విహరించెను.

---

1 బుద్ధిం స్వసుతవదసకృత్త్వాం భావయిత్వా ముముక్షుమ్.

ఇత్యాచార్యస్య శిష్యస్య సంవాదేనాత్మలక్షణమ్,
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోపపత్తయే. 579

తా. ఇట్లు గురుశిష్యసంవాదరూపమున పరతత్త్వము ముముక్షువులకు సుఖముగాఁ దెలియునట్లు నిరూపింపఁబడినది.

హితమిదముపదేశమాద్రియన్తాం
విహితనిరస్తసమస్తచిత్తదోషాః,
భవసుఖవిరతాః ప్రశాన్తచిత్తాః
శ్రుతిరసికా యతయో ముముక్షవో యే. 580

తా. ఉత్కటబ్రహ్మజిజ్ఞాసువు లగుయతులును, ముముక్షువులును, అహంకారాది మనోదోషములు లేనివారలై, సంసారవిషయసుఖవిముఖులై, జితేంద్రియులై, శ్రుతిగురువాక్యములందు విశ్వాసముగలిగి, యీహితోపదేశమును శ్రద్ధతో నాదరించి యానందింతురుగాక.

సంసారాధ్వని తాపభానుకిరణప్రోద్భూతదాహవ్యథా
ఖిన్నానాం జలకాంక్షయా మరుభువిభ్రాన్త్యా పరిభ్రామ్యతాం,
అత్యాసన్నసుధాంబుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ
న్త్యేషా శంకరభారతీ విజయతే నిర్వాణసంధాయినీ. 581

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య
శ్రీగోవిన్దభగవత్పూజ్యపాదశిష్యస్య
శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ
వివేకచూడామణిః

సమాప్తః



తా. సంసారపథమందు ఆధ్యాత్మికాది తాపత్రయరూప భాస్కరునికిరణములచే పరితపించి, దుఃఖితులై దాహశాంతి కొఱకు ఆత్మవిచారరూపజలమును కాంక్షించి,వ్యర్థముగ విషయ రూప మరుభూమియందు పరిభ్రమించి శ్రమఁజెందినమానవులకు సుఖకరమగు మోక్షరూపసుధాంబుధిని అత్యంతసమీపమునఁ గనపఱచి నిర్వాణసుఖమును సమకూర్చు శ్రీశంకరాచార్యులవారి సరసవాణి విరాజిల్లుచున్నది.

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య
శ్రీగోవిందభగవత్పాదశిష్యులగు
శ్రీమచ్ఛంకరాచార్యులవారిచే
విరచితమగు
వివేకచూడామణి
కామర్తి వేంకటసుబ్బయ్యచే
రచియింపఁబడిన
ఆంధ్రతాత్పర్యవివరణసహితము
సమాప్తము.



ఓం తత్ సత్.

ఓమ్

# వివేకచూడామణి

## శ్లోకపాదానుక్రమణిక.

---

చెన్నపురి: 'చంద్రికా' ప్రెస్సున ముద్రితము—1957.

# స్తోత్రములు

ప్రతి 1-కి రూ.

| | | |
|---|---|---|
| ఇంద్రాక్షీశివకవచము | ... | [illegible] |
| కనకధారాస్తవము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | [illegible] |
| కృష్ణకర్ణామృతము, ఆంధ్రటీకాపద్యతా॥ సహితము | ... | [illegible] |
| గంగాలహరి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 4 |
| శ్రీగుణరత్నకోశము, ఆంధ్రటీకాతాత్పర్యవిశేషార్థసహితము | | 0 1[illegible] |
| తులసీస్తోత్రకదంబము, చిన్నసైజు | ... | 0 4 |
| త్రైలోక్యమోహనకవచము, త్రిపురసుందరీస్తోత్రము, త్రిపురాస్తవరాజము | ... | 0 8 |
| ఆళవందార్ స్తోత్రము, సటీక | ... | 0 12 |
| నారాయణకవచము | ... | 0 2 |
| దక్షిణామూర్తిస్తోత్రము, సాంధ్రపద్యతాత్పర్యము, చిన్నసైజు | | 0 4 |
| దేవీమానసికపూజ, చిన్నసైజు | ... | 0 2 |
| దేవీఖడ్గమాల ,, | ... | 0 2 |
| నవగ్రహస్తోత్రము ,, | ... | 0 10 |
| పరమేశ్వరస్తోత్రకదంబము, శుద్ధప్రతి, చిన్నసైజు | ... | 0 12 |
| ప్రాతఃస్మరణ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 4 |
| భజగోవిందము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 4 |
| ఆపదుద్ధారకస్తోత్రము | ... | 0 2 |
| ముకుందమాల, సటీక | ... | 0 6 |
| లక్ష్మీనృసింహస్తోత్రము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 4 |
| లక్ష్మీనారాయణహృదయము | ... | 0 4 |
| లక్ష్మీస్తోత్రరత్నత్రయము | ... | 1 8 |
| హరిమీడేస్తవము, సాంధ్రతాత్పర్యము | ... | 0 4 |
| స్తోత్రరత్నపంచకము | ... | 0 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.